# రఘువంశం

(మహాకవి కాళిదాస కృతికి భావానువాదం)


మహామహోపాధ్యాయ

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**



ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**

**2017**

# RAGHUVAMSAM

**(Mahakavi Kalidasakrutiki Bhavanuvadam)**
**Sarvaswamya Sankalitam**

*Writer*
**Dr. Samudrala Lakshmanaiah**

T.T.D. Religious Publications Series No. 1256


*First Edition : 2017*

Copies : 1000

Price :

*Published by :*
**Sri ANIL KUMAR SINGHAL**, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

***D.T.P:***
Publications Division,
T.T.D, Tirupati.

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati.

## ముందుమాట

ప్రపంచంలో వైదికసాహిత్యం ఇతర సాహిత్యాలకంటే మిక్కిలి పురాతనమైనదిగా గుర్తింపబడింది. సమాజ సంక్షేమంకోసం అవసరమైన ప్రబోధాలన్నీ వేదవాఙ్మయంలో పుష్కలంగా లభిస్తున్నాయి.

వేదాల తరువాత సంస్కృతంలో ఆవిర్భవించిన రామాయణాదికావ్యాలు, భారతాది ఇతిహాసాలు, భాగవతాదిపురాణాలు ఆ వేదాలలోని అర్థాలనే కథలద్వారా, ఉపకథలద్వారా విశదీకరించాయి. ఆదికావ్యమైన రామాయణంలో ఎలా జీవిస్తే మానవజీవితం అన్నివిధాలా శుభప్రదమౌతుందో వాల్మీకి చక్కగా వర్ణించాడు.

వాల్మీకి ననుసరించి ఆ తరువాతి కవులలో చాలామంది వివిధకావ్యాలు రచించారు. అట్టి కవులలో మహాకవి కాళిదాసు అగ్రగణ్యుడు. ఆయన రచించిన కావ్యాల్లో రఘువంశ మహాకావ్యం నాటికీ నేటికీ లోకోత్తరమైన రచనగా పేరుపొందింది. దశావతారాలలో శ్రీరాముడు ఒక అవతారం. ఆయనకు ముందు తరాలవారినీ, తరువాతి తరాలవారినీ వర్ణిస్తూ వారి రాజ్యపరిపాలనా విధానాన్ని కాళిదాసు ఈ రఘువంశకావ్యంలో అత్యద్భుతంగా వివరించాడు.

జగత్ప్రసిద్ధమైన ఈ కావ్యాన్ని వ్యాఖ్యానించినవారు, వివిధభాషల్లో అనువదించినవారు అనేకులున్నారు. ప్రస్తుతం మహామహోపాధ్యాయ డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారు రఘువంశాన్ని శిష్టవ్యావహారిక వచనంలో తెలుగులోకి అనువదించారు. సంస్కృతాన్ని చదివేవారి సంఖ్య చాలావరకు తగ్గిపోయింది కాబట్టి అందలి విషయాలను తెలుసుకోవడానికి ఈ కాలంలో ఇట్టి అనువాదాలే అవసరమైనాయి.

ఈ గ్రంథాన్ని దేవస్థానం ప్రచురించడానికి సమ్మతించి సమర్పించిన రచయితను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. పాఠకులు శ్రద్ధతో దీనిని చదివి ఆత్మోన్నతిని కలిగించే ఇందలి విషయాలను గ్రహించి భగవదనుగ్రహానికి పాత్రు లగుదురుగాక!

*సదా శ్రీవారి సేవలో...*

**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

**ఎన్. ముక్తేశ్వర రావు,** ఐఏఎస్ (రిటైర్డ్)
ప్రత్యేకాధికారి (ప్రాజెక్టులు)
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

## ప్రస్తావన

మహామహోపాధ్యాయ శ్రీసముద్రాల లక్ష్మణయ్యగారు పండిత లోకంలో సుప్రసిద్ధులు. వారు తెలుగులో రచించిన 'రఘువంశం' భావానువాదం ఆసాంతం చదివాను. పుస్తకం చదువుతున్నంతసేపు ఏదో ప్రాచీన ప్రపంచంలో విహరిస్తున్న అనుభూతి కలుగుతుంది. ఆధునికంగా ఆంగ్లసాహిత్యంనుంచి వచ్చిన కల్పనాసాహిత్యం (ఫిక్షన్) ఏ మూలకూ సరిపోదు అనిపిస్తుంది. అందమైన తెలుగులో ఎక్కడా నట్టు రాకుండా వచనం పరుగులు తీస్తుంది.

ఇక కావ్యవిషయానికొస్తే రఘురాముడు జన్మించిన రఘువంశ రాజుల ఆదర్శాలు, కీర్తి, ప్రజానురంజనం మొదలైన ఉన్నతగుణాలను పతాకాస్థాయిలో వర్ణిస్తూ కాళిదాస మహాకవి ఈ కావ్యం రచించాడు.

రాజు లెందుకు? రాజు ఏమి చెయ్యాలి? ఏం చేస్తే రాజ్యం బాగుంటుంది? – అన్న చర్చ చాలా కావ్యాలలో కనబడదు. రాజులు, వారి అంతఃపుర విజయాలు, అరివీర భయంకర పరాక్రమాలవంటివే వర్ణించబడ్డాయి. అప్పటికప్పటికి ఇది చాల గొప్పగా అనిపించినా ఈ లక్షణా లేవీ కాలపరీక్షకు నిలబడలేదు. మఖలో పుట్టి పుబ్బలో పోయాయి.

కానీ, రఘువంశపు రాజులు ఎలా ఉన్నారో ఒక వంద రాజనీతి శాస్త్రాలు చెప్పలేని విషయాలను కాళిదాసు కాంతాసమ్మితంగా, రసాత్మకంగా, మనోహరంగా రచించాడు.

నా ఉద్దేశ్యంలో రఘువంశం చదవనివాడు పాలకుడు కాకూడదు. పాలకుల కిది అవశ్యపఠనీయమైన గ్రంథం.

స్థాలీపులాకంగా రఘువంశంలోని కొన్ని సన్నివేశాలను చూద్దాం.

ఆధునికయుగంలో సంక్షేమరాజ్యాలు ఏర్పడ్డాయి. ప్రజల యోగక్షేమాలు మేమే చూస్తామని చెబుతున్నాయి. రఘువంశంలో కాళిదాసు రాజు ఎలా ఉంటాడో చెబుతూ...

**ప్రజానాం వినయాధానాత్ రక్షణాత్ భరణాదపి ।**
**స పితా పితరస్తాసాం కేవలం జన్మహేతవః ॥**

దిలీపుని రాజ్యంలో జన్మించిన పౌరులయొక్క విద్య, క్రమశిక్షణ, రక్షణ, పోషణ మొదలగు సమస్తసౌకర్యాల బాధ్యతలు రాజువే. వారి తల్లితండ్రులు వారి జన్మకు మాత్రమే కారకులుగా ఉండేవారు.

రాజై పుడితే రాజ్యం చేస్తే అలా చెయ్యాలి. రాజంటే వాడే. రాజ్యం అంటే అదే.

ఇక మహిళల రక్షణ ఎలా ఉండేదో చూద్దాం.

**యస్మిన్ మహీం శాసతి వాణినీనాం నిద్రాం విహారార్ధ పథే గతానామ్।**
**వాతో౽పి నాస్రంశయదంశుకాని కో లంబయే దాహరణాయ హస్తమ్॥**

దిలీపుడు రాజ్యాన్ని చేసే సమయంలో మార్గమధ్యంలో వీథులవెంట విహారానికి వచ్చి ప్రమత్తలై పడిపోయిన స్త్రీల ఒంటిమీద పమిటను కదిలించడానికి గాలి కూడా భయపడేది. ఇక వాళ్ళ మానప్రాణాలకు భయమేముంటుంది?

అంటే దిలీపుని రాజ్యంలో స్త్రీలు స్వేచ్ఛగా తమ రక్షణగురించి గాని, ఆభరణాల గురించిగాని ఎట్టి భయాలు లేకుండగా సంచరించేవారని తెలుస్తోంది. దిలీపుని పాలన గురించి ఒక్క శ్లోకంలో కొండను అద్దంలో చూపించినట్లుగా చెబుతాడు కాళిదాసమహాకవి.



ప్రవర్తనా విధానంలో కూడా రఘువంశ మహారాజులు సత్యవ్రతంతో ధర్మబద్ధులై జీవించేవారు.

**త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణామ్ ।**
**యశసే విజిగీషూణాం ప్రజాయై గృహమేధినామ్ ॥**

రఘువంశపురాజులు ధనాన్ని సంపాదించేవారు. ఎందుకు? పరులకోసం త్యాగం చేయటానికే!

మితంగా మాట్లాడే వారు. ఎక్కువగా మాట్లాడితే అసత్యం దొర్లుతుందేమో అనే భయంతో!

విజయాలను కోరుకునేవారు. కీర్తికోసం మాత్రమే! (రాజ్యవిస్తరణ కోసం కాదు).

గృహస్థులయ్యే వారు. సత్సంతానం ద్వారా వంశాభివృద్ధి కోసం. పితృఋణం తీర్చుకోవటం కోసం. విషయవాంఛలకోసం కాదు.

కాకుత్థ్స వంశం రాజులు యజ్ఞాలు చేసేందుకు పూర్తి సామర్థ్యం ఉన్నా, ఒక్క యజ్ఞం పూర్తి చేస్తే ఇంద్రపదవిని పొందే అవకాశం ఉన్నా ధర్మానికి నిలబడి వదులుకున్నవారు.

ఆ రాజులూ పోయారు, ఆ రాజ్యాలూ పోయాయి. కాని కాళిదాసు అక్షరబద్ధం చేసిన 'రఘువంశం' ఆయన 'దీపశిఖ' లాగ మెరిసిపోతూనే ఉంది. ఇంత చిక్కని కావ్యాన్ని చక్కని తెలుగులో ధారాశుద్ధిగా రచించి మనకందించిన శ్రీమాన్ లక్ష్మణయ్యగారికి తెలుగుజాతి ఎంతైనా ఋణపడి ఉంటుంది. వారికి కలియుగ ప్రత్యక్ష దైవమైన శ్రీ శ్రీనివాసుని దివ్యానుగ్రహం మెండుగా లభించి ఆయురారోగ్యాలతో, సకలాభ్యుదయాలతో జీవించాలని కోరుతున్నాను.

**నందివెలుగు ముక్తేశ్వర రావు**

# నివేదన

అది 1970వ సంవత్సరం. వ్యాసాశ్రమంలో బాల్యంలో విద్య నభ్యసించిన మేము కొందరం, శ్రీమలయాళ సద్గురు స్వాములవారి భక్తులు మరికొందరు కలిసి తిరుపతిలో "శ్రీ మలయాళ సద్గురు సేవాసమాజం" అన్న పేరుతో ఒక సమాజాన్ని నెలకొల్పడం జరిగింది. అప్పట్లో తిరుపతిలోనే ఉన్న ఆశ్రమ పూర్వవిద్యార్థి శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారి (ఇప్పటి శ్రీకాళహస్తి – శుకబ్రహ్మాశ్రమాధిపతులు, పూజ్యశ్రీ విద్యాస్వరూపానందగిరి స్వాములవారు) నేతృత్వములో సమాజం ఏర్పాటయింది. తిరుపతి ప్రాచ్యకళాశాలలో అధ్యాపకుడుగా పనిచేస్తున్న నన్ను సమాజానికి కార్యదర్శిగా ఎన్నుకొన్నారు.

1973లో సమాజాశయాలలో ఒకటయిన సంస్కృత ప్రాథమిక పాఠశాలను స్థాపించడమయింది. 1979 ఏప్రిల్‌లో 'సద్గురువాణి' అన్న పేరుతో ఒక త్రైమాసిక పత్రికను కూడ ప్రారంభించాం. శ్రీ గోపాల్‌గారు దానికి మేనేజింగ్ ఎడిటర్‌గా ఉండగా, సంపాదక వర్గంలో నేను ఒకడుగా ఉండేవాణ్ణి. ఇతర కార్యక్రమాలు గూడ గురుకృపచే విజయవంతంగా సమాజం ద్వారా నిర్వహించగలిగాం.

ఆత్మోన్నతి కలిగించే ఆధ్యాత్మిక విషయాలతోపాటు ఉదాత్తమైన సారస్వతాన్ని కూడా పత్రికద్వారా ప్రచారం చేయాలని సంకల్పించాం. ఏదైనా కథారూపంలో ఉన్న ఒక ప్రాచీన సంస్కృతకావ్యాన్ని అనువదించి ధారావాహికగా ప్రచురించుమని శ్రీగోపాల్‌గారు నాకు సలహా ఇచ్చారు.

సంస్కృతకావ్యాలలో నాటికీ, నేటికీ అగ్రతాంబూలం మహాకవి కాళిదాసు రచించిన రఘువంశానిదే. సంస్కృతం అభ్యసించేవారు రఘువంశంతోనే తమ అధ్యయనం ప్రారంభించడం అనూచానంగా వస్తున్న సంప్రదాయం. పైగా అందులో పురుషోత్తముడైన శ్రీరామచంద్రుని చరిత్ర కూడా ఒక భాగం. వ్యాసవాల్మీకుల తర్వాత కవి గణనాప్రసంగంలో కాళిదాసునిదే అగ్రస్థానం. ఇటు ప్రాచ్యపండితులే కాక అటు పాశ్చాత్యవిబుధులు కూడా కాళిదాసు లోకోత్తరప్రతిభాసంపన్నుడని శ్లాఘించియున్నారు. అందుచేత ఆయన రచించిన రఘువంశాన్ని శిష్టవ్యావహారికభాషలో అనువదించటానికి పూనుకున్నాను. పద్యరూపంగానూ, గద్యరూపంగానూ ఈ మహాకావ్యాన్ని ముందే కొంద రనువదించి ఉన్నారు.

ఈ కవికులతిలకుని రచనలైన రఘువంశం, కుమారసంభవం, మేఘసందేశం అనే మూడు శ్రవ్యకావ్యాలు, అభిజ్ఞానశాకుంతలం, మాళవికాగ్నిమిత్రం, విక్రమోర్వశీయం అనే మూడు దృశ్యకావ్యాలూ అనన్య సామాన్యమైన ఖ్యాతి పొందాయి.

రఘువంశానికి ఆంధ్రానువాదమే ప్రస్తుత గ్రంథం. ఇది సంస్కృతంలో కాళిదాసుని సర్వశ్రేష్ఠరచనగా ప్రసిద్ధి పొందింది. రఘువంశానికి చెందిన 30మంది రాజులచరిత్ర ఇందులో నిబంధింపబడింది. దిలీపుని పుత్రుడైన రఘుమహారాజు లోకోత్తరమైన విక్రమం, త్యాగం మున్నగు గుణాలచే శోభిల్లాడు. అందువల్లనే ఈ వంశానికి 'రఘువంశం' అన్న ఖ్యాతి కల్గింది. రఘువంశ కావ్యరచయితకు రఘుకారుడన్న ప్రశస్తి గూడా ఉన్నది.

పందొమ్మిది సర్గలు గల ఈ మహాకావ్యంలో పదవసర్గనుండి పదునైదవ సర్గవరకూ భగవదవతారమైన శ్రీరాముని చరిత్ర వర్ణితమయింది. సుప్రసిద్ధమైన పది భగవదవతారాలలో ఏడవ అవతారంగా శ్రీరామచంద్రుడు ప్రసిద్ధుడు. వాల్మీకి రామాయణంలో ఈ దేవుని సర్వతోముఖమైన వైశిష్ట్యం విపులంగా చిత్రింపబడింది.

ఆ విశిష్టతనే కవికులగురువగు కాళిదాసు ఈ కృతిలో రసవత్తరంగానూ, రమణీయంగానూ వివిధచ్ఛందస్సులలో రచించాడు.

చివరి సర్గలలో రఘువంశంలో జన్మించిన కొందరు రాజుల చరిత్రలను కవి నిర్దేశించాడు. చివరిదైన 19వ సర్గలో మితిమీరిన కాముకత్వంతో సౌశీల్యం కోల్పోయిన అగ్నివర్ణుణ్ణి వర్ణించాడు. అతని మరణానంతరం గర్భవతిగా ఉండిన అతని రాణి సింహాసనం అధిష్ఠించిందని చెప్పడంతో ఈ కావ్యం సమాప్తమవుతుంది.

ఈ మహాకావ్యంలో వర్ణింపబడిన రఘువంశసంభూతులైన రాజుల వంశక్రమం ఇలా ఉన్నది.

1. దిలీపుడు, 2. రఘువు, 3. అజుడు, 4. దశరథుడు, 5. శ్రీరాముడు, 6. కుశుడు, 7. అతిథి, 8. నిషధుడు, 9. నలుడు, 10. నభుడు, 11. పుండరీకుడు, 12. క్షేమధన్వుడు, 13. దేవానీకుడు 14. అహీనగుడు, 15. పారియాత్రుడు, 16. శిలుడు, 17. ఉన్నాభుడు, 18. వజ్రణాభుడు, 19. శంఖణుడు, 20. వ్యుషితాశ్వుడు, 21. విశ్వసహుడు, 22. హిరణ్యనాభుడు, 23. కౌసల్యుడు, 24. బ్రహ్మిష్ఠుడు, 25. పుత్రుడు, 26. పుష్యుడు, 27. ధ్రువసంధి, 28. సుదర్శనుడు, 29. అగ్నివర్ణుడు, 30. అగ్నివర్ణుని రాణి.

ఇందులో 18వ సర్గలో నిషధాదిమహారాజులు అనేకులు నామతః మాత్రమే నిర్దేశింపబడ్డారు. వారి జీవిత విశేషాల ప్రస్తావన లేకపోవడం గమనార్హం.

కాళిదాసు రచించిన ఈ కావ్యం సంస్కృత సారస్వతంలో నిరుపమానమైన రచనగా విఖ్యాతమయింది. పంచమహాకావ్యాలలో ప్రథమగణ్యమై భాసించింది.

సద్గురువాణి 1979 జూలై సంచికలో నా అనువాదప్రచురణ ప్రారంభమైంది. 1991 జూలైతో సమాప్తమయింది. ఈ మధ్యకాలంలో



సమయానికి పత్రికకు రచన అందేటట్లు కొంచెం కొంచెంగా రచన కావిస్తూ వచ్చాను. అభిజ్ఞులైన పాఠకులు నా కృషిని అభినందించారు.

1999లో తిరుమల తిరుపతి దేవస్థానంవారు ధర్మప్రచార పరిషత్తు ఆధ్వర్యవంలో తిరుమలలో ఒక వేదసదస్సు నిర్వహించారు. ఆ పరిషత్తుకు నేనప్పుడు కార్యదర్శిగా ఉండినాను. ఆ సదస్సుకు శ్రీ కంచికామకోటి పీఠాధిపతులు పూజ్యశ్రీ శ్రీ జయేంద్రసరస్వతీ స్వామివారు, పూజ్యశ్రీ శ్రీ శంకరవిజయేంద్రసరస్వతీ స్వామివారు మున్నగు మహనీయులు విచ్చేశారు. శ్రీ శంకరవిజయేంద్ర సరస్వతీ స్వాములవారు ధర్మప్రచార విషయమై కొన్ని సూచనలిస్తూ 'ఏవైనా రచనలు కావించావా' అని నన్ను అడిగారు. అప్పటికి నేను రచించి ప్రచురించిన శ్రీ మలయాళ స్వామి జీవితచరిత్ర, యోగవాసిష్ఠం, అన్నమాచార్య సంకీర్తనామృతం మొదలగు కొన్ని నా రచనలను గూర్చి వారికి తెలియజేస్తూ రఘువంశాన్ని అనువదించానని చెప్పాను. అది విని శ్రీ స్వామివారు అనువాదం ప్రతి ఒకటి కంచికి పంపమన్నారు. అది గ్రంథరూపంలో రాలేదనీ, పత్రికలో ప్రచురణ అయిందనీ అన్నాను. దానినే జిరాక్స్ చేసి పంపమని శ్రీ స్వామివారు ఆదేశించారు. అట్లే ఒక ప్రతి పంపాను. శ్రీస్వామివారి సూచన రఘువంశాన్ని గ్రంథరూపంలో తీసుకురావడానికి నాకు ప్రేరకమైంది.

శ్రీ వ్యాసాశ్రమంవారి ప్రేరణతో నేను పరిష్కరించిన శ్రీ మలయాళ సద్గురు గ్రంథావళి 20 సంపుటాల ప్రచురణ పూర్తి కాగానే రఘువంశ ముద్రణ చేపట్టి రెండు పర్యాయాలు (2002, 2007) నేనే ముద్రించాను.

తి.తి.దే. మాజీ కార్యనిర్వహణాధికారి డా॥ దొండపాటి శ్రీ సాంబశివరావు ఐ.ఎ.యస్., గారు దీన్ని పఠించి టి.టి.డి. ప్రచురణగా దీన్ని స్వీకరించవచ్చునని తదనుగుణమైన ఉత్తరువులు జారీ చేశారు. వారికి నా కృతజ్ఞతాంజలులు.

ఈ గ్రంథంపై 'ప్రస్తావన' అనే పేరుతో తమ అమూల్యమైన అభిప్రాయం వ్రాసి యిచ్చి నన్నెంతగానో అభినందించిన టి.టి.డి. ప్రాజెక్టుల విశేషాధికారి శ్రీ ముక్తేశ్వరరావు ఐ.ఎ.యస్., రిటైర్డ్, గారికి ప్రత్యేకించి నా నమస్కృతులు. ఈ గ్రంథప్రచురణ నామోదించిన ప్రస్తుత తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ అనిల్ కుమార్ సింఘాల్ ఐ.ఎ.యస్., గారికి నా ప్రణామాంజలులు.

ఈ అనువాద రచనకు ప్రేరకులైన పూజ్యశ్రీ విద్యాస్వరూపానందగిరి స్వాములవారికీ, గ్రంథరూపంలో ప్రచురణకు స్ఫూర్తిని ప్రసాదించిన పూజ్యశ్రీ శంకర విజయేంద్ర సరస్వతీ స్వాములవారికీ నా సాష్టాంగ నమస్సులు.

శ్రీవ్యాసాశ్రమ స్థాపకులు, శుష్కవేదాంత తమోభాస్కరులు, యోగవాసిష్ఠాది బహుగ్రంథప్రకాశకులు, సంస్కృత భాషాప్రచారకులు, బ్రహ్మవిద్యాప్రబోధకులు, చరాచర సుఖాభిలాషి అయిన అస్మద్గురుదేవులు మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాములవారి దివ్యచరణారవిందములవద్ద పూజాపుష్పంగా ఈ రఘువంశానువాదాన్ని భక్తితో సమర్పించుకొంటున్నాను.

**శరణము సద్గురుదేవుడు**
**శరణము సర్వాత్మభావసంపన్ను డిలన్,**
**శరణ మసంగమునీంద్రుడు**
**చరాచర సుఖాభిలాషి శరణము మనకున్.**

ఈ గ్రంథాన్ని ప్రేమతోనూ, సహృదయతతోనూ ఆదరించనున్న పాఠకలోకానికి నా అభివందనాలు.

సుధీ విధేయుడు

**– సముద్రాల లక్ష్మణయ్య**

# విషయసూచిక

* * *

# రఘువంశం

**వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే ।**

**జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ ॥**

శబ్దార్థాల వలె నిత్యమూ కలిసి వున్నవారూ, లోకానికి తల్లిదండ్రులూ అయిన పార్వతీ పరమేశ్వరులకు శబ్దార్థాల పరిజ్ఞానం బాగా కలగడానికై ప్రణమిల్లుతున్నాను.

## (1)

## అవతారిక

సూర్యమూలకమైన ఆ రఘువంశమెక్కడ? అల్పవిషయ పరిజ్ఞానం కల నా బుద్ధి ఎక్కడ? తరింప నలవిగాని సముద్రాన్ని అజ్ఞానంవల్ల చిన్న తెప్పతో దాటగోరుతున్నాను.

మందుడనై యుండీ కవికీర్తి నభిలషించిన నేను పొడగరి కందుబాటులో వుండే ఫలంకొరకై లోభంతో చేయి పైకెత్తిన పొట్టివానిలా నగుబాటు పాలవుతానేమో!

ఐనప్పటికీ వజ్రపు సూదితో బెజ్జం వేసిన మణిలో దూరే దారానికి లాగా పూర్వకవులు తీర్చిన వాగ్రూపమైన ద్వారం కల ఈ వంశంలో నాకూ ప్రవేశం లేకపోదు.

ఆ రఘువంశంలోనివారు పుట్టిన నాటినుండీ సమస్తసంస్కారాలచేతా పవిత్రు లయ్యేవారు. తలపెట్టిన ఏ పనైనా తుదముట్టా నెరవేర్చకుండా వదిలే స్వభావం వారికి లేదు. వారి సామ్రాజ్యం సముద్రంవరకూ విస్తరించి ఉండేది. వారి రథాలు నాకలోకానికి రాకపోకలు సాగించేవి.

శాస్త్రవిధి ననుసరించి ఆ నరపతులు హోమాలు చేసేవారు. యాచకులకు తనివితీరా దానం చేసేవారు. తప్పునకు తగిన దండన విధించేవారు. చేయవలసిన పనులు ఎప్పటి కప్పుడు ఏమాత్రం ఏమరకుండా చేసేవారు. పాత్రులకు దానం చేయటానికే వాళ్ళు ధనాన్ని ఆర్జించేవారు.

ప్రాభవం ప్రకటించడానికి గాక సత్యపాలనకొరకై మితంగా మాట్లాడేవారు. అర్థార్జనదృష్టితో కాక కీర్తికొఅకే పరరాజులపై దండయాత్రలు సాగించేవారు. భోగదృష్టితో కాక సంతానకాంక్షతోనే వివాహం చేసికొనేవారు. బాల్యంలో చదువుకొనేవారు. యౌవనంలో విషయసుఖ మనుభవించేవారు. వార్ధకంలో మునివృత్తి నాశ్రయించేవారు. కడపట పరమాత్మధ్యానంతో శరీరాన్ని త్యజించేవారు. అలాంటి ఆ రఘువంశరాజుల గుణాలు నా చెవికి వచ్చాయి కాన, నా వాగ్వైభవం స్వల్పమే అయినా చాపల్యప్రేరితుడనై వారి వంశచరిత్రను ప్రబంధంగా వర్ణిస్తాను.

ఈ ప్రబంధాన్ని గుణదోషాలు తెలిసిన సహృదయులు ఆలకింపదగియున్నారు. బంగారమందలి మేలిమి, లేక కల్తీ అగ్నిలోనే కదా స్పష్టమయ్యేది!

వేదాలకు ఓంకారంలాగా రాజులందరికీ మొదటివాడు వైవస్వతమనువు. విద్వాంసులందరూ ఆ నరపాలుణ్ణి ఘనంగా పూజించేవారు.

## దిలీపుడు

పరిశుద్ధమయిన ఆ మనువంశంలో పాలసముద్రంలో చంద్రుడులాగా ఇంకా పరిశుద్ధుడైన 'దిలీపుడు' అనే రాజచంద్రుడు ఉదయించాడు. విశాలమైన వక్షఃస్థలమూ, ఎద్దుమూపురంవంటి మూపులూ, నిడుపులైన బాహువులూ గల్గి సాలవృక్షంవలె పొడవైన అతని శరీరం స్వధర్మనిర్వహణకై రూపొందిన క్షాత్రధర్మంలాగా ఎంతో హుందాగా ఉండేది. బలంలోనూ, తేజస్సులోనూ, ఔన్నత్యంలోనూ సాటిలేనిదై విశాలభూవలయాన్ని ఆక్రమించిన అతని నిండైన విగ్రహం మేరుపర్వతాన్ని పోలి ఉండేది.

ఆ దిలీపుడు ఆకారానికి తగిన తెలివీ, తెలివికి తగిన శాస్త్రజ్ఞానమూ, జ్ఞానానికి తగిన పనులూ, పనులకు తగిన ఫలసిద్ధీ కలిగి ఉండేవాడు. జలజంతువులకు నిలయమైన సాగరాన్ని చేరడానికి ప్రజలు భయపడతారు.



కాని, అందలి రత్నాలను ఆశించి దరిజేరుతారు. ఆ రీతిగానే ఆ భూపాలుని తేజస్సు, ప్రతాపం మొదలైన రాజలక్షణాలు చూచి దగ్గరికి పోవటానికి ప్రజలు జంకేవారు. అయినా అతని కులశీల దాక్షిణ్యాది గుణాలను చూచి దగ్గఱ చేరేవారు.

కుశలుడైన సారథి నడుపుతుండగా ఒకింతైనా గాడితప్పని రథచక్రాలవలె దిలీపుడు పాలిస్తుండగా ప్రజలు అనూచానమైన మనుధర్మమార్గాన్ని అణుమాత్రమైనా అతిక్రమించేవారు కారు. సూర్యుడు వేయిరెట్లు తిరిగి వర్షించటానికే భూమినుండి జలం పీల్చినట్లు ఆ రాజు మరలా ప్రజల అభివృద్ధికొరకే వాళ్లనుండి పన్నులు కట్టించుకొనేవాడు. ఆ రాజుకు చతురంగబలం ఉపకరణం మాత్రమే. అతని అర్థసిద్ధికి శాస్త్రాలలో మొక్కవోని బుద్ధీ, ధనువునం దారోపించిన అల్లెత్రాడు – అనే రెండే సాధనా లయ్యాయి. ఆకారాన్నీ, మనోభావాన్నీ వెలుపలికి పొక్కనీక అతడు మంత్రగోపనం చేసేవాడు. అతని కార్యారంభాలన్నీ పూర్వజన్మవాసనలవలె ఫలాలచేతనే ఊహింపతగి యుండేవి. ఆ నరపాలుడు భీతి లేకనే శరీరాన్ని రక్షించుకొనేవాడు. రోగపీడ లేకనే సుకృతం ఆర్జించేవాడు. లోభం లేకనే ధనం సంపాదించేవాడు. లంపటుడు కాకనే సుఖ మనుభవించేవాడు.

ఇతరుల వృత్తాంతం తనకు తెలిసినా ఆ దిలీపమహారాజు వెలిపుచ్చేవాడు కాడు. అపకారికి ప్రతీకారం చేసే సామర్థ్యమున్నా ఓర్పుతో ఉండేవాడు. ఇచ్చి పొగడుకొనే స్వభావ మాయనకు లేదు. ఈ రీతిగా అన్యోన్య విరుద్ధగుణాలు సైతం అతనిపట్ల తోబుట్టువుల్లా మెలిగాయి. విషయసుఖాలపై విరక్తీ, సమస్తవిద్యలలో సంపూర్ణపాండిత్యమూ, ధర్మంమీద ఆసక్తీ కలిగి ఉండటం మూలాన వయోవృద్ధుడు కాకపోయినా ఆయన జ్ఞానవృద్ధుడై భాసించేవాడు. శిక్షకుడూ, రక్షకుడూ, పోషకుడుగా ఉంటూ ప్రజల నందరినీ అతడు తండ్రిలాగా కాపాడేవాడు. కాగా వారిని కన్నతండ్రులు కేవలం కన్నతండ్రులుగానే మిగిలిపోయేవారు. లోకప్రతిష్ఠకై అతడు దండింపదగినవారిని దండించాడు. సంతానాపేక్షతో పరిణయమాడాడు.

అలా అర్థకామాలను గూడా అతడు ధర్మాభివృద్ధికే వినియోగించాడు. ఆ రాజు యజ్ఞాలు నిర్వహించడానికై పన్నుల ద్వారా భూసారాన్ని పిండాడు. ఇంద్రుడు సస్యపోషణకై వర్షాల రూపంలో దేవలోకసారాన్ని పిండాడు. ఇలా వారిరువురూ పరస్పరం సంపదల మార్పిడిచే ఉభయలోకాలనూ పోషించారు. ప్రజలను భయంనుండి రక్షించే ఆ దిలీపుని కీర్తిని ఇతర రాజులెవ్వరూ అనుకరించలేకపోయారు. ఎందుకంటే అతని పరిపాలనలో దొంగతనమన్నది పరధనాలపట్లగాక మాటలో మాత్రమే నిలిచిపోయింది.

తనకు శత్రువైనా యోగ్యుడైనవాణ్ణి ఆ దిలీపుడు రోగి ఔషధాన్ని సమ్మతించినట్లు సమ్మతించేవాడు. ఇష్టుడైనా దుష్టుడైనవాణ్ణి పాముకాటుకు గురియైన వ్రేలినివలె పరిత్యజించేవాడు. బ్రహ్మదేవుడు పంచమహాభూతాల సామగ్రితో ఆ నరపతిని సృష్టించాడు. ఇది నిజం. అందుకే అతని గుణాలన్నీ మహాభూతాల గుణాలవలె పరప్రయోజనంలోనే పర్యవసించాయి. చెలియలికట్ట కోటగోడగానూ, సాగరాలే అగడ్తలుగానూ ఉన్న సమస్త భూమండలాన్నీ అతడు ఒకే ఒక నగరంలాగా ఎదురులేకుండా పాలిస్తూ వచ్చాడు.

మగధవంశంలో పుట్టిన సుదక్షిణాదేవి యజ్ఞానికి దక్షిణలాగా ఆ దిలీపునికి ధర్మపత్ని అయింది. పేరుకు తగినట్లు ఆమెలో దాక్షిణ్యగుణం నిండుగా ఉండేది. అంతఃపురకాంతలెందరున్నా మనస్వినియైన ఆ సుదక్షిణచేతా, రాజ్యలక్ష్మిచేతా మాత్రమే తాను కళత్రవంతుడైనట్లు అతడు భావించాడు. ఆ రాజు అన్నివిధాలా తనకు తగిన ఆమెయందు సంతానం పొందాలని ఆశించాడు కాని ఆయన కోరిక నెరవేరలేదు. ఇలా చాలాకాలం గడచిపోయింది.

తుదకు సంతానప్రాప్తికి తగిన వ్రతం అనుష్ఠించాలని రాజుకు సంకల్పం కల్గింది. వెంటనే అతడు మహారాజ్యభారాన్ని మంత్రులకు అప్పగించాడు. పత్నీసమేతుడై బ్రహ్మను పూజించాడు. పిమ్మట సంతానకాంక్షతో



వ్రతానుష్ఠానానికై ఆ రాజదంపతులు కులగురువైన వసిష్ఠుని ఆశ్రమానికి పయన మయ్యారు. వారు వర్షాకాలపు మేఘము నధిష్ఠించిన విద్యుత్తు, ఐరావతమువలెె మధురగంభీరనాదంతో సాగిపోయే ఒక రథాన్ని అధిరోహించారు.

ఆశ్రమానికి ఏ విధమైన ఇబ్బందీ కలుగకూడదన్న దృష్టితో చాలా స్వల్పమైన పరివారంతోనే వాళ్ళు వెళ్ళారు. ఐనా తేజోవిశేషంవల్ల చూచేవారికి పెద్ద సైన్యంతో కూడి పోతున్నట్లుగా కనిపించారు.

మద్దిచెట్ల సొనల వాసనలు గలవీ, పుప్పొడులు వెదజల్లేవీ, అడవి చెట్లనించుక కదిలించేవీ అయిన చల్లని గాడ్పులు మెల్లగా వీస్తూ వారికి ఆహ్లాదం కల్గించాయి. రథచక్రాల ధ్వనిని ఉఱుమనుకొన్న నెమళ్లు దారి పొడుగునా మనోహరంగా కేకారవాలు చేశాయి. రెండురకాలైన షడ్జస్వరాలను పోలినవై వీనులవిందుగా వినిపించే ఆ కేకారవాలు వింటూ వారు ముందుకు సాగారు. చేరువలో దారినుండి తొలగిన జింకలజంటలు రథంవైపు చూస్తూ ఉంటే వాటి కళ్లతో పరస్పరం తమకళ్లపోలిక చూచుకొంటూ ఆ రాజదంపతులు ముందుకు సాగారు. స్తంభాలు లేని తోరణంలాగా ఆకసంలో బారులుదీరి పయనిస్తున్న సారసపక్షులు మధురధ్వనితో వాళ్లదృష్టిని తమవైపు ఆకర్షించాయి. అనుకూలవాయువు వాళ్ళ ప్రయాణం శుభప్రద మవుతుందని సూచిస్తూ ముందుకు పయనించింది. అందువల్లనే గుర్రపుగిట్టల తాకిడికి పైకెగసిన దుమ్ము సుదక్షిణాదేవి ముంగురులకు గానీ, దిలీపుని తలపాగాకు గానీ సోకలేదు.

తామరల పరిమళాన్ని వెదజల్లుతూ కదిలే అలలుగల మడుగులనుండి వీస్తూ తమ నిశ్వాసాన్ని అనుకరిస్తున్న చల్లని గాలి నాఘ్రాణిస్తూ వాళ్ళు పయనించారు. తాము దానం చేసినవీ, యూపచిహ్నాలు గలవీ అయిన అగ్రహారాలలోని సోమయాజులు అర్ఘ్యప్రదానం కావించి వారికి అమోఘమైన ఆశీర్వాదాలు అందజేశారు. గొల్లపల్లెలలోని పెద్ద లెదురువచ్చి వాళ్లకు

కొంగ్రొత్త నేతిని కానుకగా సమర్పించారు. రాజదంపతులు వారిని పరామర్శించి దారిలోని చెట్లపేర్లు వారినడిగి తెలుసుకున్నారు. ఉజ్జ్వలమైన వేషంతో పయనిస్తున్న ఆ సతీపతులు మంచు తెరలు తొలగిన చైత్రపూర్ణిమనాటి చిత్రా (నక్షత్రం) చంద్రుల్లాగా శోభిల్లారు. ప్రియదర్శనుడూ, బుధునితో సమానుడూ అయిన ఆ దిలీపుడు దారిలోని ఆ యా విశేషాలను ప్రియపత్నికి తెలుపుతూ కడచివచ్చిన దారి ఎంత దూరమో గమనించలేదు.

ఇతరుల కందరాని కీర్తిగలవాడూ, ధర్మపత్నీ సమేతుడూ అయిన ఆ నరేంద్రుని రథం అలసిన గుర్రాలతో సాయంకాలానికి వసిష్ఠ మునీంద్రుని ఆశ్రమం చేరుకొన్నది.

ఆ సమయంలో సమీపవనప్రదేశాలనుండి సమిధలు, దర్భలు, పండ్లు తీసికొని తపస్వులు అక్కడికి చేరుకుంటూ ఉన్నారు. అపుడు అదృశ్యమైన హోమాగ్నులు వారికి ప్రత్యుత్థానం చేశాయి. నివ్వరిధాన్యం మేతకు అలవాటు పడ్డ లేళ్ళు మునిపత్నులను బిడ్డలలాగా సమీపించి పర్ణశాలల వాకిళ్లను అడ్డగిస్తున్నాయి. పాదులలో అప్పుడే పోసిన నీళ్ళు త్రాగటానికి వచ్చిన పక్షులు బెదరిపోకుండా ఉండటానికి మునికన్యలు వెంటనే చెట్లకు దూరంగా పోతూ ఉన్నారు. ఆరబోసిన నివ్వరిధాన్యాలను ఎండ తగ్గిపోగానే మునికన్యలు పర్ణశాలల ముంగిళ్ళలో రాసులు పోశారు. ఇంతలో జింక లక్కడికి వచ్చి పరుండి నెమరువేయసాగాయి. హోమకుండాలలో ప్రజ్వలించే అగ్నులనుండి ఆహుతిగంధంతో కూడి గాలికి వ్యాపిస్తున్న పొగలు ఆశ్రమానికి వచ్చే అతిథులకు పవిత్రత చేకూరుస్తూ ఉన్నాయి.

రథం నిలవగానే దిలీపుడు గుఱ్ఱాల అలసట తీర్చమని సారథి నాజ్ఞాపించి సుదక్షిణాదేవిని రథంనుండి దింపి తానూ దిగాడు. వెంటనే అక్కడి సదస్యులూ, నియతేంద్రియులూ అయిన మునులు శాస్త్రచక్షువూ, లోకరక్షకుడూ, సతీసమేతుడూ అయిన ఆ మహారాజునకు యథోచితమైన మర్యాదలు చేశారు.



రాజు ఆశ్రమం చేరిన సమయానికి వసిష్ఠమహర్షి సాయం కాలానుష్ఠానంలో ఉన్నాడు. ఆయన అనుష్ఠానం ముగిసేవరకూ రాజు కాచుకొని ఉండినాడు. పిమ్మట స్వాహాదేవితో కూడి ఉన్న అగ్నిదేవునిలాగా అరుంధతీ దేవితో కలిసి ఉన్న మునీంద్రుని సందర్శించాడు. రాజ దంపతులు మునిదంపతుల పాదాలంటి ప్రణామం చేశారు. మునిదంపతులు వారిని ప్రీతితో ఆశీర్వదించారు. వారికి వసిష్ఠుడు ప్రయాణశ్రమ తీరేటట్లుగా ఆతిథ్య మిచ్చాడు. పిమ్మట రాజ్యాశ్రమముని అయిన దిలీపునితో రాజ్యవిషయమై కుశలప్రశ్న చేశాడు.

ఆపై శత్రువిజేత, వక్తలలో శ్రేష్ఠుడూ అయిన ఆ రాజ్యాధిపతి అధర్వవేదనిధి అయిన వసిష్ఠ మునీంద్రుని సమక్షంలో అర్థవంతమైన మాటలతో ఇలా విన్నవించాడు –

“గురుదేవా! దైవికంగాగానీ, లేక మనుష్యులవల్ల గానీ, నాకు కలిగే ఉపద్రవాలన్నింటినీ మీరు నివారిస్తున్నారు. అందువల్ల సమస్త రాజ్యాంగాలలోనూ నాకు కుశలమే. మీరు మంత్రకర్తలు. పరోక్షంగా మీ మంత్రప్రభావం వల్లనే నా శత్రువు లందరూ కూలిపోయారు. ప్రత్యక్షంగా నా బాణాలు వారిని భేదిస్తున్నా మీమంత్రాలముందు అవి కొరగానివే. మీరిక్కడ హోమాలు చేస్తున్నారు. మీరు విధిప్రకారం అగ్నులలో విడిచిన హవిస్సే వఱపులకు ఎండిపోయిన పైరులకు వర్షంగా పరిణమిస్తున్నది. నా ప్రజలు ఈతిబాధలకు లోనుగాకుండా నిర్భయంగా నూరేండ్లూ జీవిస్తున్నారంటే దానికి కారణం మీ బ్రహ్మవర్చస్సే. మీరు బ్రహ్మపుత్రులు. మాకు గురువులు, సదా మా యోగక్షేమాలు చూచుకొంటున్నారు. మీ దయవల్ల నాకు ఏ విధమైన ఆపదలూ లేవు. సంపదలకు ఏమాత్రం లోటూ లేదు.

సప్తద్వీపాలతోకూడిన ఈ భూవలయం నాకు సమస్త రత్నాలనూ ప్రసాదిస్తూనే ఉన్నది. అయినా ఈ మీకోడలు సుదక్షిణకు తగిన సంతతి కలుగకపోవడంచేత ఈ రాజ్యంవల్ల నాకు సంతోషం లేకుండా పోతున్నది.

నా తర్వాత తమకు పిండం పెట్టేవారు లేరు అన్న విచారంతో నేను పెట్టే పిండాలను గూడా పితృభోజ్యతత్పరులైన నా పితృదేవతలు తృప్తిగా భుజించడం లేదు. ఇది ముమ్మాటికీ నిజం. అంతేకాదు ఇక మీదట తమకు తిలోదకాలిచ్చే దిక్కు కూడా లేదని నిట్టూరుస్తూ ఆ నిట్టూర్పులతో నులివెచ్చనయిన నేనిచ్చే తిలోదకాలను వాళ్ళు త్రాగుతున్నారు.

యజ్ఞానుష్ఠానంతో నేను పరిశుద్ధుడ నయ్యాను. కాని సంతాన లోపంవల్ల పరితప్తుడ నవుతున్నాను. ఇలా ఒకవంక వెలుగూ, మరొక వంక చీకటీ ఆవరించిన లోకాలోకపర్వతం లాగా ఉన్నాను. తపస్సువల్లా, దానంవల్లా కలిగే పుణ్యం పరలోకంలో మాత్రమే సుఖం కలిగిస్తుంది. కాని విశుద్ధవంశమైన సత్సంతానం ఇహపర సుఖాలు రెండింటినీ ప్రసాదిస్తుంది కదా!

ఆశ్రమంలో మీరు స్వయంగా పెంచిన చెట్టు ఫలించకపోతే మీకు విచారం కలుగదా? అలాగే సంతాన హీనుడనైన నన్ను చూస్తే మీకు సంతాపం కలగడం లేదా? ఓ భగవానుడా! బిడ్డలు లేని కారణాన పితౄణం తీర్చలేకపోతున్నాననే బాధ స్నానం లేని మదగజానికి మర్మచ్ఛేదకమైన కట్టుకంబంలాగా నాకు భరింపరానిదిగా ఉన్నది. తండ్రీ! అందువల్ల ఈ ఋణబాధనుండి నాకు విముక్తి మీరే కలిగించాలి. ఇక్ష్వాకువంశస్థులకు అసాధ్యాలైన ప్రయోజనాల నన్నింటినీ సమకూర్చి పెట్టేవారు తమరే కదా!"

దిలీపుని విన్నపం విని వసిష్ఠమునీంద్రుడు ధ్యానంతో నిశ్చలనేత్రుడై క్షణకాలం చేపలు నిద్రిస్తున్న మడుగులా ఉండిపోయాడు. రాజుకు సంతానం కలుగకపోవటానికి కారణం ఆయన యోగదృష్టికి గోచరించింది. పిమ్మట మహర్షి రాజుతో ఇలా అన్నాడు –

"రాజా! పూర్వం ఒకప్పుడు నీవు ఇంద్రుణ్ణి సేవించడానికై స్వర్గలోకానికి వెళ్ళావు. తిరిగి భూలోకానికి వస్తున్నప్పుడు దారిలో కల్పవృక్షం క్రింద కామధేనువు ఉండింది. నీ ధర్మపత్ని ఋతుస్నాతయై ఉన్నకాల మది. ఆమెను



సమయానికి అభిగమింపకపోతే ధర్మలోపం కల్గుతుందన్న భయంతో ఆమెనే స్మరిస్తూ ధేనువునకు ప్రదక్షిణాది సత్కారం చేయకనే నీవు వెళ్ళావు. తన్ను ఆదరించకుండా వెళ్తున్నావని దానికి కోపం వచ్చింది. అందువల్ల "నన్ను తిరస్కరించావు కాన నా సంతానాన్ని ఆరాధించకపోతే నీకు సంతానం కలుగదు" అని కామధేనువు నిన్ను శపించింది. ఆ సమయానికి గంగాప్రవాహంలో మదించిన దిగ్గజం ఘీంకరిస్తూ ఉండడంవల్ల ఆ శాపం నీకూ, నీ సారథికీ వినబడలేదు. నీకు సంతతి కలుగకపోవడానికి కారణం ఇదే. పూజ్యులను పూజించకపోతే శ్రేయస్సుకు ఆటంకం కలగడం సహజమే కదా!

ఇప్పుడు ఆ కామధేనువు వరుణుడు చేస్తున్న దీర్ఘకాలిక యాగానికి ఆజ్యం మొదలైన హవిస్సును చేకూర్చడానికై పాతాళానికి పోయి ఉన్నది. పాతాళద్వారం మహాసర్పాలతో నిరోధింపబడి ఉన్నది. అక్కడికి పోవడం సాధ్యం కాని పని. ఆ కామధేనువు పుత్రిక ఇక్కడనే ఉన్నది. దానికి మారుగా దీనిని నీవు శుచివై, ధర్మపత్నితోగూడి భక్తిశ్రద్ధలతో పూజించు. ఇది సంతసించినా నీ కోరిక నెరవేరుతుంది".

ఇలా వసిష్ఠమహర్షి చెబుతూ ఉండగానే ఆయనకు హవిస్సు సమకూర్చే ప్రశస్తమైన నందినీధేనువు అడవినుండి తిరిగి వచ్చింది. చిగురుటాకులాగా ఎర్రగా ఉన్నదది. దాని నొసటిపై వంకరతిరిగి ఉన్న తెల్లని మచ్చ సంధ్యాదేవి మొగంపై ఉన్న నెలవంకలాగా చూడ ముచ్చటగొల్పుతూ ఉన్నది. దానిది కుండంత పొదుగు. దూడను చూడగానే దాని పొదుగునుండి పాలు కారుతున్నాయి. నులివెచ్చనివీ అవభృథస్నానంకంటె కూడ పవిత్రమైనవీ అయిన ఆ పాలు ఆశ్రమభూమిని తడుపుతున్నాయి. దాని గిట్టలనుండి రేగిన ధూళి సోకగానే చెంతనే ఉన్న దిలీపునికి గంగాదితీర్థస్నానం చేసినంత పవిత్రత చేకూరింది. తాను దాని విషయం ప్రస్తావించే సమయంలోనే దానిరాక శుభప్రదమని శకునజ్ఞుడైన వసిష్ఠుడు భావించాడు. రాజుకోరిక తప్పక నెరవేరుతుందనుకొని మళ్లీ ఇలా అన్నాడు –

"రాజా! ఈ ధేనువు మంగళమూర్తి. దీన్ని మనం పేర్కొన్న వెంటనే ఇక్కడికి వచ్చింది. అందువల్ల నీ అభిలాష త్వరలో ఫలిస్తుందని తెలుసుకో! అభ్యాసంతో విద్యను వశం చేసికొన్నట్లు ఫలమూలాదులే ఆహారంగా స్వీకరిస్తూ నీవు ఈ గోవువెంట విడువక చరించి దీనిని ప్రసన్నం చేసికో. ఇది నడిస్తే నీవు నడవాలి, నిలబడితే నిలబడాలి, కూర్చుంటే కూర్చోవాలి, నీరు త్రాగితే నీరు త్రాగాలి. నీ భార్య గూడా దీన్ని భక్తితో ప్రతిదినమూ గంధమాల్యాదులతో పూజించాలి. ఉదయం ధేనువు అడవికి వెళ్ళేటప్పుడు ఆశ్రమం సరిహద్దు వరకూ వెళ్ళాలి. సాయంకాలం మళ్లీ ఎదురుగా పోయి తీసుకురావాలి. ఈ విధంగా నందినికి అనుగ్రహం కలిగేవరకూ మీరు దీనిని సేవించండి. నీవ్రతం నిర్విఘ్నంగా నెరవేరుగాక! నీ తండ్రిలాగే నీవుకూడ సత్పుత్రులు గలవారిలో అగ్రేసరుడ వగుదువుగాక!"

దేశకాలాలు తెలిసినవాడూ, వసిష్ఠుని శిష్యుడూ, ధర్మపత్నీ సహితుడూ అయిన దిలీపుడు ఆచార్యుడు చెప్పిన వ్రతక్రమాన్ని శ్రద్ధతో విని సంతోషించి "అలాగే చేస్తాను" అని అంగీకరించాడు.

పిమ్మట విద్వాంసుడూ, సత్యప్రియవచనుడూ, బ్రహ్మపుత్రుడూ అయిన వసిష్ఠమునీంద్రుడు మహాభాగ్యవంతుడైన దిలీపుని ఆ రాత్రికి నిద్రించమని చెప్పి అవసరమైన ఏర్పాట్లు చేశాడు. ఆయనకు తపశ్శక్తితో దిలీపునికి సమస్త రాజభోగాలూ కల్పించగల సామర్థ్యం ఉన్నది. ఐనా వ్రతవిధిజ్ఞుడు గాబట్టి రాజు ఆనాటినుండే వ్రతచర్యను పాటించడం మంచిదన్న ఉద్దేశంతో ఆయనకు అడవిలో లభించే ఫలమూలాదులు, కుశాస్తరణాదులతోనే సత్కారం ఏర్పాటు చేశాడు.

రాజు కులపతి చూపిన పర్ణశాలలో పత్నీసమేతంగా ప్రవేశించాడు. దర్భశయనంలో నిద్రించి ఆ రాత్రి గడిపాడు. మరునాటి వేకువజామున మునిశిష్యుల వేదనాదంతో మేల్కొన్నాడు.

* * *

# 2
# నందినీ పరిచర్య

పిమ్మట యశోధనుడూ, ప్రజాధిపుడూ అయిన దిలీపుడు సుదక్షిణాదేవి చేత వసిష్ఠుని హోమధేనువైన నందినికి పూజ చేయించాడు. దూడను పాలు గుడిపించి కట్టివేశాడు. తరువాత ఆవును అడవికి వదిలాడు.

సతీరత్నమైన నరేంద్రుని ధర్మపత్ని దాని గిట్టలవలని ధూళిచే పవిత్రమైన గోమార్గమును శ్రుత్యర్థాన్ని అనుసరించిన స్మృతిలాగా అనుగమించింది. కీర్తిమంతుడైన రాజు ఆమెను వెనుకకు మరలించి నాల్గుసముద్రాలూ నాల్గుచన్నులుగా రూపొందిన భూదేవిలాగా ఉన్న ఆ ధేనువును శ్రద్ధతో కాపాడుతూ అడవికి వెళ్ళాడు. వ్రతాచరణకై తన వెంట ఇతర పరిచారకుల నెవ్వరినీ అతడు తీసుకుపోలేదు. తమ పరాక్రమంతోనే తమ్ము రక్షించుకోగల మనువంశస్థులకు ఇతరులనుండి రక్షణ అవసరం లేదు గదా!

ఆ మహారాజు నందినికి రుచికరమైన పచ్చిగడ్డి కబళాలు అందిస్తూ, దాని ఒడలు గోకుతూ, ఈగలు వాలకుండా నివారిస్తూ, అది పోయిన దారినే పోనిస్తూ భక్తితో ఉపచర్యలు చేశాడు. అది నిలుచుంటే తానూ నిలబడేవాడు; అది నడిస్తే తానూ నడిచేవాడు; అది కూర్చుంటే తానూ కూర్చునేవాడు; అది నీళ్లు త్రాగితే తానూ నీళ్లు త్రాగేవాడు. ఇలా నీడలాగా ఆ ధేనువును అనుసరించాడు.

ఆ సమయంలో అతడికి ఛత్రచామరాది రాజచిహ్నాలు లేవు. అయినా తన తేజోవిశేషంవల్ల చూచేవాళ్ల కతడు మహారాజులాగానే కనిపించాడు. అతడప్పుడు మదజలరేఖలు పైకి పొడచూపక లోనణగిన మదావస్థగల గజేంద్రునిలాగా భాసించాడు. అతడు తీగలతో సిగను ఎగగట్టుకొని విల్లు ఎక్కు పెట్టుకొని హోమధేనువును కాపాడేనెపంతో అడవిలోని దుష్టజంతువులను శిక్షించేవాడిలా తిరిగాడు. అక్కడి చెట్లు మత్తెక్కిన పక్షుల

రొదలతో వరుణసదృశుడైన రాజుగారి అనుచరులకు బదులు తామే "చూడండి! చూడండి" అనే శబ్దాన్ని పలుకుతున్నట్లు తోచాయి. పౌరకన్యలు పేలాలు చల్లినట్లు గాలికి ఊగుతున్న లేతతీగలు అగ్నిలా భాసిస్తూ తన చెంత నడయాడుతున్న ఆ రాజుపై పువ్వులు చల్లాయి. ధనుర్ధారి అయివున్నా అతణ్ణి దయామయుడని నమ్మి పెంటిజింకలు ఏమాత్రం బెదురులేకుండా అతనివైపు చూస్తూ వెడద కనులు కలిగియున్నందుకు తగిన ఫలం పొందాయి.

బొంగువెదుళ్లలో దూరిన గాలి పిల్లనగ్రోవి మ్రోతలా సహకరిస్తూ ఉండగా వనదేవతలు పాడుతూవున్న తన కీర్తిని వింటూ దిలీపుడు ఆవువెంట సాగిపోయాడు. గొడుగు లేకపోవడంవల్ల ఎండలో బడలిపోయి ఆచారంతో పవిత్రుడైన ఆ మహారాజును గాలి సెలయేళ్లనుండి చల్లగా ప్రసరిస్తూ పూవులతావి వెదజల్లుతూ సేవించింది.

లోకరక్షకుడైన అతడు అడవిలో ప్రవేశించగానే కార్చిచ్చు వాన లేకనే చల్లారింది. చెట్లపూతా, కాపూ అధికమయ్యాయి. పులివంటి క్రూరజంతువులు లేడిలాంటి దుర్బల జంతువులను హింసించడం మానివేశాయి.

దిగంతాలు పవిత్ర మయ్యేటట్లు ఆ రోజంతా తిరిగి తిరిగి సాయంకాలం కాగానే చివురుటాకులాగా ఎర్రనైన సూర్యకాంతి అస్తమించటానికీ, హోమధేనువు ఆశ్రమం చేరడానికీ ప్రయాణ మయ్యాయి. సురలకూ, పితరులకూ, అతిథులకూ ఉపయోగపడే ఆ గోవువెంట మధ్యమలోక పాలకుడైన దిలీపుడు నడిచాడు. సజ్జన సమ్మాన్యుడైన నృపునితో చనుదెంచే ధేనువుకూడ సదనుష్ఠానంతో కూడిన శ్రద్ధవలె భాసించింది. ఆ సమయంలో చిన్న చిన్న నీటి గుంటలనుండి వెలుపలికి వస్తున్న పందులవల్లా, తమ నివాసవృక్షాలవైపుగా పయనిస్తున్న నెమళ్లవల్లా, పచ్చిక మైదానాలలో కదుపులు గట్టున్న జింకలవల్లా అడవులన్నీ నల్లబడినట్లు కనిపించాయి. మనోహరమైన ఆ సంధ్యాసమయ ప్రకృతిదృశ్యాన్ని చూస్తూ దిలీపుడు ధేనువువెంట వెళ్ళాడు.



తొలి ఈతదైన నందినీ ధేనువు బరువైన పొదుగును మోసుకొంటూ మెల్లగా నడిచింది. ఆజానుబాహుడైన రాజుకూడా శరీర గౌరవంవల్ల తాపీగా నడిచాడు. అందమైన వారి నడకలు తపోవనానికి వెళ్ళేదారి కెంతో శోభ చేకూర్చాయి. అడవినుండి ధేనువు వెంట తిరిగివస్తున్న రాజును సుదక్షిణాదేవి మిక్కిలి తమితో రెప్ప వాల్చకుండా ఉపవసించినవా అన్నట్లున్న కనులతో చూస్తూ ఎదురుగా పోయింది. అప్పుడు దారిలో ముందు రాణికీ, వెనుక రాజుకూ మధ్యలో ఉన్న నందినీధేనువు పగటికీ, రాత్రికీ మధ్యలో ఉన్న సంధ్య లాగా ప్రకాశించింది.

పయస్విని యైన గోవు ఆశ్రమం చేరగానే అక్షతల గిన్నె చేతబట్టుకొని సుదక్షిణాదేవి దానికి ప్రదక్షిణం చేసింది. ప్రణమిల్లింది. తర్వాత అర్థసిద్ధికి ద్వారంలా ఉన్న దానికొమ్ముల నడిమిచోటును పూజించింది. దూడకు పాలివ్వాలనే తమకంలో ఉండి కూడా ధేనువు నిశ్చలంగా నిలిచి పూజను స్వీకరించినందుకు సుదక్షిణా దిలీపులు ఎంతో సంతోషించారు. భక్తులపట్ల అలాంటి మహనీయుల అనుగ్రహ చిహ్నాలు సత్వరఫలసిద్ధిని సూచించేవి కదా!

పిదప శత్రువిజేత అయిన దిలీపుడు అరుంధతీవసిష్ఠులకు నమస్కరించి సాయంకాలానుష్ఠానం తీర్చుకొన్నాడు. పాలు పిదకటం పూర్తికాగానే విశ్రమించిన గోవును సేవించటానికి మళ్ళీ వెళ్ళాడు. దాని చెంత ఉపహారాలూ, దీపాలూ పెట్టి భార్యతో సహా కూర్చున్నాడు. అది నిద్రించగానే తానూ నిద్రించాడు. మరునాటి ప్రాతఃకాలాన అది మేల్కొనగానే తానూ మేల్కొన్నాడు.

ఇలా సంతానం కోరి అంచిత కీర్తిమంతుడూ, దీనజనోద్ధారకుడూ అయిన దిలీపుడు ధర్మపత్నితో కూడ క్రమం తప్పక వ్రతం అనుష్ఠించాడు. ఆ వ్రతం ఇరవైయొక్క దినాలు నిర్విఘ్నంగా కొనసాగింది.

# భక్తి పరీక్ష

తన్ను సేవిస్తున్న దిలీపుని భక్తిని పరీక్షించగోరి మునీంద్రుని హోమధేనువు ఆ మరునాడు గంగాప్రవాహం చెంత లేతపచ్చిక దట్టంగా పెరిగివున్న హిమాలయగుహలో ప్రవేశించింది. క్రూరమృగాలు ఆ గోవుపట్ల మనసులో కూడ కీడు తలపెట్టవన్న నమ్మకంతో రాజు ఒక క్షణకాలం అక్కడి ప్రకృతిదృశ్యంవైపు చూపు మళ్ళించాడు. ఇంతలో అతని కనుగప్పి ఒక సింహం హఠాత్తుగా అక్కడికి లంఘించి ఆవును బట్టి బలవంతంగా ఈడ్వసాగింది. నందిని ఆర్తనాదం చేసింది. దాని అఱపు అక్కడి గుహలలో మారుమ్రోగింది. ఆ శబ్దం వింటూనే దీనరక్షకుడైన రాజు తటాలున పగ్గంతో లాగినట్లు తన చూపును కొండవైపునుండి ఆవువైపు మరలించాడు. గైరికాదిధాతుమయమైన కొండపై పూచిన లొద్దుగు చెట్టులాగా ఎఱ్ఱని నందినీ ధేనువుపై తెల్లని జూలుగల సింహం ఆ విలుకానికి కనిపించింది.

సింహగమనుడూ, ఆర్తరక్షకుడూ, శత్రుసంహారకుడూ అయిన దిలీపమహారాజు తన ఏమరుపాటుకు అవమానపడ్డాడు. వెనువెంటనే అపరాధియైన సింహాన్ని చంపటానికై బాణం తీసికోవాలని అమ్ముల పొదిలోకి కుడిచేయి పోనిచ్చాడు. గోటికాంతులు ప్రసరించిన కంకపత్రాలు కల బాణపుపిడి కంటుకొని చేయి చిత్రంలో గీసిన బొమ్మలాగా కదలకుండా అలాగే స్తంభించిపోయింది. చెయ్యి కొయ్యబారిపోవటంతో రాజుకు కోపం ఇనుమడించింది. అయినా అతడు ఏమీ చెయ్యలేని అసహాయ స్థితిలో ఉండిపోయాడు. మంత్రౌషధాలతో కట్టుబడ్డ పాములాగా, ప్రక్కనేవున్న అపరాధిని అంటజాలని తన తేజస్సులతో తనలో తానే ఆ నరపాలుడు కుమిలిపోయాడు.

ఆర్యజనపక్షపాతీ, మనువంశకేతనుడూ, సింహపరాక్రముడూ, తన బాహువు అలా స్తంభించిపోయినందుకు ఆశ్చర్యపడుతున్నవాడూ అయిన



ఆ భూపాలుణ్ణి మరింత ఆశ్చర్యపరుస్తూ గోవును నిగ్రహించిన సింహం మనుష్యవాక్కులతో ఇలా అన్నది –

“రాజా! ఎందుకు వృథాగా శ్రమపడతావు? నీ అస్త్రం నాపైన ప్రయోగించినా వ్యర్థమే అవుతుంది. గాలి వేగం చెట్లను పెళ్ళగించగలదు గాని కొండను కదిలించగలుగుతుందా? ఇంతకూ నన్ను ఎవరనుకున్నావు? నేను శివుని కింకరుణ్ణి, నికుంభుడితో సమానుణ్ణి. నా పేరు కుంభోదరుడు. వెండికొండవంటి వృషభవాహనం అధిష్ఠించేటప్పుడు పరమేశ్వరుడు నా మూపుమీదనే కాలూని నన్ను పవిత్రుణ్ణి చేస్తుంటాడు. ఇదిగో, ఈ ఎదురుగా ఉండే దేవదారు వృక్షాన్ని చూడు, దీన్ని శంకరుడు పుత్రునిలా పెంచుకొన్నాడు. పార్వతీదేవి స్తన్యమిచ్చి కుమారస్వామిని పెంచినట్లే బంగారుకుండలతో నీళ్లుపోసి ఈ చెట్టును కూడా పెంచింది.

ఒకసారి ఒక అడవియేనుగు కపోలంమీది దురద తీర్చుకోవటానికై ఈ చెట్టును ఒరసికొన్నది. అందువల్ల దీని పట్ట కాస్తా వూడిపోయింది. అది చూచి పార్వతి రక్కసుల ఆయుధాలతో దెబ్బతిన్న కుమారుణ్ణి చూచి ఏడ్చినట్టు ఏడ్చింది. ఆనాటినుండి అడవి ఏనుగులకు భయం కల్గదానికై శూలపాణి నన్ను సింహరూపంతో ఈ కొండగుహలో కాపలా వుంచాడు. చెంతకు వచ్చిన జంతువులనే నాకు ఆహారంగా ఏర్పాటు చేశాడు. సరిగా నా భోజనవేళకే శివుని ప్రేరణతో ఈ యావు ఇక్కడికి వచ్చింది. రాహువునకు చంద్రుని అమృతంలాగా ఆకలిగొన్న నాకు గోరూపంలో వున్న రక్తభోజనం తృప్తి కల్గిస్తుంది. ఈ విషయంలో సిగ్గుపడకుండా నీదారిన నీవు తిరిగిపో, గురువుపట్ల నీవు శిష్యభక్తిని లెస్సగా నిరూపించుకొన్నావు. శస్త్రబలంతో కాపాడటానికి వీలుగాని దానిని కాపాడలేక పోవడంవల్ల శస్త్రధారుల కీర్తికి ఏంతమాత్రం లోపం లేదు”.

మృగరాజు పల్కిన ప్రౌఢమైన ఈ మాటలు దిలీప మహారాజు విన్నాడు. తన అస్త్రబలం కుంటువడటానికి శివుని ప్రభావం కారణమని గ్రహించాడు.

దానితో అతనిలోని అవమానభావం సడలిపోయింది. రాజుకు తన బాణప్రయోగప్రయత్నం విఫలం కావడం అదే మొదటిసారి. పూర్వం వజ్రాయుధప్రయోగానికి పూనుకొని ముక్కంటి కంటిచూపుతో స్తంభించిపోయిన ఇంద్రునిలా ఉన్నవాడై అతడు సింహంతో ఇలా బదులు చెప్పాడు.

"మృగరాజా! ఏమీ చేయలేని నిస్సహాయస్థితిలో వున్న నేను ఇప్పుడు ఏమి చెప్పినా అది హాస్యాస్పదమే. అయినా నీకు జీవుల మనోభావాలు తెలుసు కాబట్టి నీతో నా అభిప్రాయం చెబుతాను. సకల చరాచర ప్రాణికోట్ల సృష్టిస్థితిలయాలకు కర్త అయిన ఆ పరమేశ్వరుడు నాకు పూజ్యుడే. అయినా నా గురువుగారికి అగ్నిహోత్ర సాధనమైన గోవు నా ముందే నశిస్తుండగా చూస్తూ ఊరకుండడం నాకు ఎంతమాత్రం తగదు. నీవు నా శరీరాన్ని ఆహారంగా స్వీకరించి నీ ఆకలి తీర్చుకో. సాయంకాలం కాగానే దీని లేగదూడ అంగలారుస్తూ ఉంటుంది. అంతేకాక ఇది వసిష్ఠమహర్షి ధేనువు, కాబట్టి దయచేసి దీనిని వదలిపెట్టు".

అది విని సింహరూపుడైన శివసేవకుడు దంతకాంతులతో కొండ గుహలలోని చీకట్లు పటాపంచలయ్యేటట్టుగా ఇంచుక నవ్వి రాజుతో మరలా ఇలా అన్నాడు -

"మహారాజా! ఈ లోకంలో నీ దొరతనం తిరుగులేనిది. వయస్సు కొంగ్రొత్తది. శరీరం ఎంతో అందమైనది. ఇంచుక ఫలం ఆశించి ఇదంతా వదలుకోవా లనుకొంటున్నావు. నీవు కార్యాకార్యపర్యాలోచన లేని మూఢునిలా నాకు తోస్తున్నావు. ప్రజానాథా! నీకు జీవులమీద అంత దయ ఉంటే ఇది ఆలోచించుకో. నీ శరీరాన్ని నాకర్పిస్తే ఈ ఆవు ఒక్కటే క్షేమంగా ఉంటుంది. కాని నీవు బ్రదికి ఉంటే ఎందరో ప్రజలను తండ్రిలా కష్టాలనుండి కాపాడగలవు. ఒకవేళ నీ గురువు తనకున్న ఒకే ఒక్క గోవును పోగొట్టావని నిప్పులా మండిపడి శపిస్తాడని భయపడుతున్నావేమో! అలా భయపడవద్దు,



దీనికి బదులు కోట్లకొలది కుండపొదుగు గోవులను సమర్పించి ఆయన కోపం తొలగించవచ్చు. కాబట్టి నామాట విను. కల్యాణ పరంపరను అనుభవించే బలిష్ఠమైన నీ శరీరాన్ని కాపాడుకో. ఈ ఆవును ఉపేక్షిస్తే స్వర్గానికి దూరమై పోతానేమో అనే చింత కూడా నీకు వద్దు. సకల సంపదలతో కూడిన నీ రాజ్యం సామాన్య మైనది కాదు సుమా! అది నేలపై నెలకొన్న స్వర్గమే".

ఇలా చెప్పి సింహం మౌనం వహించింది. గుహనుండి వెలువడిన దానిమాటల ప్రతిధ్వని హిమవంతుడుగూడా ప్రేమతో దిలీపునికి మళ్ళీ అదే ఉపదేశం చేశాడా అన్నట్లు వినిపించింది. రాజు శివానుచరుని మాటలు విని భయపడిన కండ్లతో తన్ను చూస్తున్న గోవుపై చాలా కనికరం చూపుతూ మళ్ళీ సింహంతో ఇలా అన్నాడు -

"మృగరాజా! క్షతంనుండి (నాశంనుండి) రక్షించేవాడు అన్న వ్యుత్పత్తిని బట్టి రాజులకు శ్రేష్ఠమైన క్షత్త్రనామం ప్రసిద్ధమయింది. ఆ పేరుకు తగిన విధంగా నడచుకోలేనివారికి రాజ్య మెందుకు? లోకదూషణతో మలినమైపోయిన ప్రాణాలవల్ల ప్రయోజన మేమున్నది? ఈ గోవుకు బదులు వేవే పాడి ఆవుల నిచ్చి మహర్షిని సమాధానపెట్టడం ఎలా సాధ్యం? ఇది కామధేనువుకంటే తక్కువయింది కాదు సుమా! నీవు దీన్ని కొట్టగలిగావంటే దానికి కారణం శివుని ప్రభావమే గాని నీశక్తి గాదు. అందువల్ల నా శరీరాన్ని మూల్యంగా అర్పించి నీ బారినుండి గోవును రక్షించడం యుక్తమే. అలా చేస్తే నీ భుక్తికీ లోటుండదు. మహర్షి హోమకార్యమూ లోపం లేకుండా నెరవేరుతుంది.

నీవూ ఒక ప్రభువు కొలువులో ఉండేవాడివే కాబట్టి నీకీవిషయం తెలియనిది కాదు. ఈ దేవదారువృక్షాన్ని నీవు ఎంతో ప్రయత్నంతో కాపాడుతున్నావు కదా! కాపాడవలసిన దాన్ని నశింపజేసి తనకు ఏమాత్రం

దెబ్బ లేకుండా ప్రభువు ముందర సేవకుడు ఎలా నిలబడగలడు? కాబట్టి ప్రాణాలైనా ఇచ్చి మా గురువుగారి ధేనువును కాపాడడమే నా ధర్మం. నన్ను చంపగూడదని నీవు భావిస్తున్నావా? ఐతే ఈ భౌతిక కాయాన్ని భోజనంగా స్వీకరించి నా కీర్తికాయంపై దయజూపి కాపాడు. ఈ భౌతిక శరీరాలు ఎలాగూ నశించేవే కాబట్టి మాబోటివారికి వీటిపై అపేక్ష ఉండదు. పరస్పరం మాట లాడుకోవడమే స్నేహానికి కారణ మంటారు. మనకిద్దరికీ ఈ అడవిలో స్నేహం కుదిరింది. ఓ శివసేవకుడా! మిత్రుడనైన నా కోరికను భంగపరచడం నీకు తగదు".

దిలీపుని మాటలకు సమ్మతించి సింహం నందినీ ధేనువును వదలిపెట్టింది. వెంటనే అంతవరకూ స్తంభించివున్న భూపాలుని భుజం మళ్ళీ అతనికి స్వాధీన మయింది. అతడు ఆయుధాలు వదలి తన శరీరాన్ని మాంసపు ముద్దలాగా సింహాని కర్పించాడు. అధోముఖుడై పడివున్న తనపై మహోగ్రంగా సింహం దూకుతుందని ఎదురుచూస్తూ ఉన్న నరపాలుని మీద విద్యాధరులు పూలవాన కురిపించారు.

అపుడు రాజుకు "బాబూ! లే!" అన్న అమృతప్రాయమైన వాక్కు వినిపించింది. అతడు లేచి చూచేసరికి ఎదుట తల్లిలాగా పాలు చేపుతూ వున్న నందినీధేనువు కనిపించిందే కాని సింహం కనిపించలేదు. ఆ దృశ్యం చూచి అతడు ఆశ్చర్యపడ్డాడు. అప్పుడు గోవు ఇలా చెప్పింది –

"ఓ సద్గుణ శాలీ! నిన్ను పరీక్షించడానికే నేను ఈ మాయ కల్పించాను. ఋషిప్రభావంవల్ల యముడు గూడా నా జోలికి రాలేడు. ఇక ఇతర క్రూరమృగాల మాట చెప్పాలా? వత్సా! నీ గురుభక్తికీ, నాపై నీవు చూపిన దయకూ నేనెంతో సంతోషించాను. వరం కోరుకో, ఇస్తాను. నన్ను పాలుమాత్రం పిదికే ఆవుగా భావించవద్దు. అనుగ్రహం కల్గితే కోరిన కోర్కెలను అన్నింటినీ ఇస్తానని తెలుసుకో!"



పిమ్మట మహాదాతగానూ, మహావీరుడుగానూ ప్రసిద్ధి కెక్కిన దిలీప మహారాజు భక్తితో చేతులు జోడించుకొని శాశ్వతకీర్తి గల్గి వంశం నిల్పే కొడుకు సుదక్షిణకు కలిగేటట్లు అనుగ్రహించమని ధేనువును వేడుకున్నాడు. సంతానార్థి అయిన అతడు కోరిన వరం ప్రసాదించి ఆ గోవు "వత్సా! నా పాలను ఆకుదొప్పలో పిదికి త్రాగు" అని అతణ్ణి ఆదేశించింది.

"అమ్మా! దూడ త్రాగిన పిమ్మట హోమానికి వినియోగపడి మిగిలిన పాలు నా ఏలుబడిలోనున్న భూమండలినుండి ఆరవ భాగమునువలె గురువుగారి సెలవుతో స్వీకరించ గోరుతున్నాను'' అని రాజు విన్నవించుకొన్నాడు. ఆ విన్నపానికి నందిని చాలా సంతసించింది. అది రాజుతోగూడా హిమాద్రిగుహనుండి బయలుదేరి అనాయాసంగా తిరిగి ఆశ్రమం చేరుకొన్నది.

ప్రహర్ష చిహ్నంతో ముందుగనే ఊహించబడిన నందినీ ధేనువుయొక్క అనుగ్రహవృత్తాంతాన్ని ప్రసన్నవదనుడైన భూపాలుడు పునరుక్తం గావించాడా అన్నట్లు గురువునకు ముందు విన్నవించి పిదప సుదక్షిణాదేవికి తెలియజేశాడు. తర్వాత సాధువత్సలుడూ, పవిత్రచిత్తుడూ అయిన ఆ నరపాలుడు వసిష్ఠమునీంద్రుని అనుమతితో దూడకూ, హోమానికీ ఉపయోగపడి మిగిలిన నందినీక్షీరాన్ని రూపుదాల్చిన తన తెల్లని కీర్తిని త్రాగుతున్నాడా అన్నట్లు మిక్కిలి ఆశతో త్రాగాడు.

ఆ మరునాటి ఉదయం గోసేవా వ్రతపారణ పూర్తి కాగానే జితేంద్రియుడైన వసిష్ఠమహర్షి రాజదంపతులను ప్రయాణోచితరీతిగా ఆశీర్వదించి రాజధానికి సాగనంపాడు. భూపాలుడు హవిస్సుతో వెలుగుతున్న అగ్నినీ, వసిష్ఠుణ్ణీ, అరుంధతీదేవినీ, దూడతో సహా నందినీ ధేనువునూ వరుసగా ప్రదక్షిణీకరించి మంగళాచరణంతో అతిశయించిన ప్రభావం కలవాడై బయలుదేరాడు. రథం చెవుల కింపుగా ధ్వనిస్తూ ఉండగా

ధర్మపత్నితో గూడి సహనశీలుడైన ఆ రాజు ఒడుదొడుకులు లేని త్రోవలో సంపూర్ణమనోరథుడై హాయిగా ప్రయాణం కొనసాగించాడు.

చిరకాలం ప్రవాసంలో ఉండి వ్రతానుష్ఠానంవల్ల కృశించిన శరీరంతో మళ్ళీ నగరానికి తిరిగి వస్తున్న రాజును ప్రజలు అప్పుడే ఉదయించిన విదియనాటి చంద్రునిలా తనివిదీరని చూపులతో చూచారు. ఇంద్రునిలా ఐశ్వర్యసంపన్నుడైన అతణ్ణి వాళ్ళు వేనోళ్ల కొనియాడారు. ఎగురుతున్న జెండాలతో కళకళలాడే నగరం ప్రవేశించి దిలీపమహారాజు ఆదిశేషునిలా బలసంపన్నమైన తన భుజంపై మళ్ళీ రాజ్యభారాన్ని వహించాడు.

తర్వాత ఆకసం అత్రిమహర్షినేత్రసంభూతమైన జ్యోతినీ, (చంద్రుణ్ణీ), గంగానది అగ్ని విసర్జించిన ఈశ్వరతేజాన్నీ (కుమారస్వామినీ) ధరించిన విధంగా సుదక్షిణాదేవి దిలీపుని వంశానికి ఐశ్వర్యం పెంపొందేటట్లుగా, అష్టదిక్పాలకుల అంశాలతో కూడిన గర్భాన్ని ధరించింది.

* * *

## 3

దిలీపుని చిరకాల వాంఛితం నెరవేరుస్తూ ఇక్ష్వాకు వంశాన్ని నిలబెట్టే గర్భచిహ్నాలు సుదక్షిణాదేవిలో పొడసూపాయి. వెన్నెలలా కన్నులకు పండువు చేస్తున్న ఆ చిన్నెలను చూచి ఆమె సఖీమణులు సంతోషించారు. మేను సన్నగిల్లడంవల్ల పరిమితమైన నగలు ధరించి లొద్దుగ పువ్వులా పాలిపోయిన మొగంతో వున్న సుదక్షిణాదేవి ప్రభాతసమయంలో కొద్దిపాటి చుక్కలతోనూ, కాంతి తగ్గిన చంద్రునితోనూ గూడిన రాత్రిలాగా రాణించింది.

వేసవి చివర తొలిచినుకులతో తడిసిన అడవిలోని పడియను మూర్కొన్న ఏనుగులాగా మన్నుదిన్న ఆమె ముఖాన్ని ఏకాంతంలో ఎంతగా మూర్కొన్నా దిలీపుడికి తనివి తీరలేదు. ఇంద్రుడు స్వర్గం పాలించినట్లు తన కుమారుడు భూతలాన్ని ఎదురు లేకుండా ఏలనున్నాడని సూచించటానికి గాబోలు ఆమె రుచికరమైన ఇతర పదార్థాలు వదలిపెట్టి వట్టి మట్టి తినాలని అభిలషించింది.

మహారాజు మాటిమాటికీ ఆమె చెలికత్తెలతో "మీ చెలి తనకేమి కావాలో సిగ్గువల్ల నాతో చెప్పలేకపోతున్నది. ఆమెకు కావలసిన వస్తువేదో మీరే చెప్పండి తెప్పిస్తాను" అని మిక్కిలి ఆదరంతో అడుగుతూ వుండేవాడు. అది స్వర్గంలో వున్నా సరే మహాశూరుడైన ఆ భూపాలుడు కోరితే దొరకని వస్తువంటూ ఏదీ లేదు. అంచేత వేవిళ్ళతో వున్న సుదక్షిణాదేవి ఏమేమి కోరేదో, అదంతా క్షణంలో ఆమె ఎదుట ప్రత్యక్ష మయ్యేది. పిమ్మట కొన్నాళ్లకు ఆమెకు వేవిళ్లబాధ తీరిపోయింది. అవయవాలు పుష్టి చేకూర్చుకున్నాయి. అప్పుడామె పండుటాకులు రాలి క్రొత్తగా చిగిర్చిన తీవలా తేజరిల్లింది.

రోజులు గడుస్తుండగా మొనలు నల్లబడి బలిసిన ఆమె కుచద్వయం తుమ్మెదలు పైన వాలిన తామరమొగ్గల కాంతి నతిశయించింది. నరపాలుడు గర్భిణియైన తన పట్టమహిషిని రత్నగర్భ అయిన భూమిలాగానూ, అగ్నిగర్భ అయిన జమ్మిచెట్టు లాగానూ, అంతర్వాహిని అయిన సరస్వతీ నదిలాగానూ

భావించాడు. ఆమెపై తనకున్న ప్రేమకూ, ఔదార్యానికీ, ఐశ్వర్యానికీ, పుత్రుడు కలుగనున్నాడన్న సంతోషానికీ తగ్గట్టు మహావైభవంతో పుంసవనాది కర్మలు క్రమంగా జరిపించాడు. అతడు తనయింటికి వచ్చినప్పుడు ఆమె లోకపాలుర అంశాలు ప్రవేశించివున్న గర్భభారంవల్ల చాలా ఆయాసంతో ఆసనంనుండి లేచేది. ఉపచారాంజలి కావిస్తున్నప్పుడు ఆమె చేతులు అలసిపోయేవి. ఆ చంచలాక్షిని జూచి రాజు ఎంతగానో సంతసించేవాడు. బాలచికిత్సలో నేర్పరులైన ఆప్తవైద్యులు రాణిని కాపాడుతూ వచ్చారు. మబ్బులు గ్రమ్మి వర్షింపనున్న ఆకసంలాగా నెలలు నిండి ప్రసవానికి సిద్ధంగా ఉన్న భార్యను రాజు సంతుష్టిగా చూచాడు.

## రఘుజననం

పిమ్మట ఐదుగ్రహాలూ అస్తమించక తమ తమ ఉచ్ఛస్థానంలో వుండి జాతకుడు మహాభాగ్యశాలి అని సూచించే ఒక శుభలగ్నంలో శచీదేవితో సమానురాలైన సుదక్షిణాదేవి, సాధనత్రయంతో కూడిన శక్తి అక్షయమైన అర్థాన్ని ప్రసవించినట్లు పుత్రుణ్ణి ప్రసవించింది. పిల్లవాడు పుట్టగానే దిక్కులన్నీ ప్రసన్నమయ్యాయి. గాలి హాయిగా వీచింది. అగ్ని ప్రదక్షిణజ్వాలతో హవిస్సును స్వీకరించింది. సమస్తమూ మంగళప్రదంగా పరిణమించింది. మహాపురుషుల పుట్టుక లోకానికి శుభప్రదం కదా! ఆ బాలకుని దివ్యతేజం పురిటి పాన్పుచుట్టూ ప్రసరించింది. ఆ వెలుగుముందు రాత్రి దీపాలన్నీ చిత్రంలోని దివ్వెలలా వెల్వెలబోయాయి. అంతఃపుర పరిజనులు వెళ్ళి రాజుకు "కొడుకు పుట్టాడు" అన్న శుభవార్త అందజేశారు. ఆ మాట వింటూనే ఆనందాతిశయంతో భూపాలుడు ఛత్రచామరాలు తప్ప చేతికందిన వస్తువుల నెల్లా వారికి కానుకగా ఇచ్చివేశాడు. గాలి తగలని పద్మంలా నిశ్చలమైన నేత్రంతో మనోజ్ఞమైన పుత్రముఖం చూస్తూ చంద్రుణ్ణి చూచి సముద్రం పొంగినట్టు దిలీపుడు ఆనందంతో ఉప్పొంగిపోయాడు.



తపోవనంనుండి వచ్చి వసిష్ఠమహర్షి బిడ్డకు జాతకర్మలన్నీ నిర్వర్తించాడు. సానబట్టిన మణిలాగా సంస్కారంవల్ల అర్భకుడు అధికతేజంతో ప్రకాశించాడు. వేశ్యల నృత్యాలతో సహా మంగళవాద్య ధ్వనులు వీనులవిందుగా రాజమందిరంలో విస్తరిల్లాయి. గగనంలో గూడా అప్సరసల నృత్యాలూ, దేవదుందుభుల మ్రోతలూ విజృంభించాయి. ఆ సంతోష సమయంలో ఖైదునుండి విడిపించడానికి దిలీపుని రాజ్యంలో ఒక్క ఖైదీ గూడా లేడు. అందుచేత అతడు పితౄణమనే ఖైదునుండి తన్ను తానే విడిపించుకొన్నాడు.

అటు శాస్త్రంలోనూ, ఇటు శత్రువిజయంలోనూ తుదముట్టగలడని 'రఘి గతౌ' అనే ధాతువు ననుసరించి కుమారుడికి దిలీపుడు 'రఘువు' అనే అన్వర్థమైన నామకరణం చేశాడు.

సూర్యకిరణాలు సోకిన బాలచంద్రునిలా అన్నివిధాలా సంపన్నుడైన తండ్రి ప్రయత్నంవల్ల మనోజ్ఞమయిన అవయవాలతో బాలుడు దినదిన ప్రవర్ధమాను డయ్యాడు. కుమారస్వామిని చూచుకొని పార్వతీ పరమేశ్వరులూ, జయంతుణ్ణి చూచుకొని శచీ దేవేంద్రులూ ఆనందించినట్లే రఘువును చూచుకొని సుదక్షిణా దిలీపులు సంతసించారు. జక్కవకవ లాగా హృదయావర్జకమైన అన్యోన్యానురాగం కల రాజదంపతుల ప్రేమను ఏకైక సుతుడు పంచుకొన్నాడు. అయినా వారి అనురాగం దినదినానికీ పెరిగిందేకాని తరగలేదు.

దాది పలికిన మాటలు పలకడం, ఆమె చేయి పట్టుకొని నడవడం, ఆమె నేర్పినట్లు నమస్కరించడం లాంటి పనులు చేస్తున్న కొడుకును చూచి తండ్రి పమానందభరితు డయ్యాడు. వాణ్ణి తొడపై కూచోబెట్టుకొని అమృతం లాంటి ఆ స్పర్శతో మైమఱచి అర్ధనిమీలిత నేత్రుడై దిలీపుడు చిరకాలానికి సుతస్పర్శసుఖం అనుభవించాడు. బ్రహ్మ సత్త్వగుణ విశిష్టుడైన విష్ణువివల్ల తన సృష్టికి నిలకడ కలిగిందని తలంచినట్లే దిలీపుడు సద్గుణవంతుడైన

కుమారునివల్ల తన వంశం నిలబడిందని భావించాడు. చూడాకర్మ ముగిసిన పిదప రాకుమారుడు తన యీడువారైన మంత్రికుమారులతో గూడి ఏటిగుండా మకరాదులు సముద్రంలో ప్రవేశించినట్లు లిపిద్వారా సమస్త సారస్వతాన్నీ సాధించాడు. తండ్రి కుమారుడికి శాస్త్రవిధి ననుసరించి ఉపనయనం కావించాడు. పాండిత్యంలో ఆరితేరిన గురువులు అతడికి విద్యలన్నీ నేర్పారు. ఆ చదువులన్నీ అతడికి చక్కగా పట్టుపడ్డాయి. తగినచోట చేసిన ప్రయత్నం ఫలించక పోతుందా?

సూర్యుడు వడిగల గుఱ్ఱాలతో దిక్కులను దాటినట్లు మహాబుద్ధిమంతుడైన రాజకుమారుడు వాయువేగాన్ని మించిన బుద్ధిగుణాలతో చతుస్సముద్రాలను పోలిన ఆన్వీక్షకి మొదలైన విద్యలు నాల్గింటినీ దాటాడు. పవిత్రమైన దుప్పిచర్మం ధరించి అతడు తండ్రినుండే సమంత్రకంగా ఆగ్నేయాద్యస్త్రాలను నేర్చుకొన్నాడు. అతని తండ్రి రాజత్వంలోనే కాక ధనుర్విద్యలోకూడా సాటిలేనివాడే. కోడె మహావృషభమైనట్లూ, గున్నయేనుగు మదపుటేనుగుగా మారినట్లూ, రఘువు క్రమంగా బాల్యావస్థ గడచి యువకు డయ్యాడు. అప్పు డతని శరీరం గాంభీర్యంచేత మనోహరమై విలసిల్లింది.

దిలీపుడు పుత్రునికి కేశఖండన కర్మ పూర్తిచేసి వివాహం చేశాడు. దక్షుని పుత్రికలు చంద్రుణ్ణి చేరి ప్రకాశించినట్లు రాజకన్యకలు ఆ రాకుమారుణ్ణి మగనిగా పొంది శోభిల్లారు.

పొడవైన భుజాలూ, కండగల మూపులూ, విశాలమైన వక్షమూ, విపులమైన మెడా కలిగి రఘువు దేహసౌభాగ్యంలో తండ్రిని మించిపోయాడు. కాని వినయాతిశయంలో జనకుని చెంత స్వల్పుడుగానే కనిపించాడు.

పిమ్మట దిలీపమహారాజు బహుకాలంనుండీ తాను మోస్తూ వుండిన రాజ్యభారం తగ్గించుకోదలచి స్వభావంతోనూ, సంస్కారంతోనూ అణకువ గల్గివున్న కుమారుణ్ణి యువరాజుగా చేశాడు. సౌరభాది గుణాలను కోరే



లక్ష్మి కమలంనుండి క్రొత్తగా విరిసిన కలువలోనికి కొంతభాగం ప్రవేశించినట్లే, వినయాది గుణాలను కోరే రాజ్యలక్ష్మి దిలీపమహారాజునుండి కొంతభాగం కొంగ్రొత్త యువరాజుపై ప్రసరించింది. గాలితో గూడిన నిప్పులాగానూ, శరదృతువుతో చేరిన సూర్యుని మాదిరిగానూ, మదజలంతో కూడిన ఏనుగు రీతిగానూ, రఘువుతో గూడిన దిలీప మహారాజు సుదుస్సహమైన తేజంతో దీపించాడు.

తరువాత కొందరు రాకుమారులను తోడుగా ఇచ్చి ధనుర్ధారియైన యువరాజును హోమాశ్వాలకు రక్షకునిగా నియమించి మహారాజు తొంబైతొమ్మిది యాగాలు నిరాటంకంగా పూర్తి చేశాడు. ఆపై నూరవ యాగం తలపెట్టి అశ్వాన్ని వదిలాడు. విలుకాండ్రైన కాపరులు చూస్తూ వుండగానే ఇంద్రుడు అదృశ్యరూపుడై వచ్చి స్వేచ్ఛగా విహరిస్తున్న గుఱ్ఱాన్ని అపహరించాడు. అది చూచి రక్షకభటులు దిగులుపడి ఏమిచేయాలో దిక్కుతోచక ఆశ్చర్యచకితు లయ్యారు. ఇంతలో ప్రసిద్ధప్రభావంగల నందినీధేనువు హఠాత్తుగా వారియెదుట సాక్షాత్కరించింది.

సజ్జన శ్రేష్ఠుడైన రఘువు పవిత్రమైన నందినీమూత్రంతో కన్నులు కడుగుకొని తేరిపార జూచాడు. అప్పుడతనికి ఇంద్రియాతీతమైన పదార్థాలుగూడా స్పష్టంగా కనిపించాయి. తప్పించుకు పోవడానికి ప్రయత్నిస్తున్న హవనాశ్వాన్ని మాతలి (ఇంద్రునిసారథి) రథానికి కట్టివేయడమూ, అలా కట్టివేసిన దాన్ని ఇంద్రుడు తూర్పు దిక్కుకు మళ్ళించుకు పోవడమూ రఘువు కంటబడింది. ఱెప్పపాటులేని వందల కొలది నేత్రాలూ, పచ్చని గుఱ్ఱాలూ కల్గివున్న అశ్వాపహర్తను అతడు ఇంద్రుడని గుర్తించాడు. అతణ్ణి వెనక్కు మళ్ళించువానిలా మిన్నుముట్టే ధీరస్వరంతో ఇలా హెచ్చరించాడు –

“దేవేంద్రా! యజ్ఞభాగం చేపట్టేవారిలో నిన్నే మొదటివానిగా పెద్దలు చెబుతారు. అలాంటి నీవే యజ్ఞదీక్షితుడైన మా తండ్రి యజ్ఞం చెడగొట్టడాని

కెలా పూనుకొన్నావు? త్రిలోకాధిపతివైన నీవు యజ్ఞద్రోహులను దివ్యదృష్టితో కనిపెట్టి దండింపవలసిన వాడవు కదా! అట్టి నీవే ధర్మకర్మలకు అంతరాయం కలిగించబూనుకొంటే ఇక సత్కార్యాలన్నీ అంతరించినట్లే. మఘవన్! అశ్వమేధానికి ముఖ్యసాధనమైన మా గుఱ్ఱాన్ని మాకు వదలిపెట్టడం న్యాయం. ఇతరులకు మంచి నడవడి చూపించవలసిన పెద్దలు స్వయంగా చెడుత్రోవను అవలంబింపరు సుమా!"

ఇలా ప్రగల్భంగా పలికిన రఘువు మాట విని ఆశ్చర్యపడి దేవేంద్రుడు రథం మళ్ళించి అతని కిలా సమాధానం చెప్పాడు –

"రాజకుమారా! నీవు చెప్పినమాట నిజమే. అయినా కీర్తిమంతులు ఇతరులవల్ల తమ కీర్తికి హాని లేకుండా చూచుకోవాలి. జగత్ప్రసిద్ధమైన నా యశస్సును ఈ యాగంతో అపహరించటానికి మీ తండ్రి పూనుకొన్నాడు. విష్ణువు కొక్కడికి పురుషోత్తముడని ప్రసిద్ధి. త్రిలోచనుడికి మాత్రమే మహేశ్వరుడని పేరు గాని మరొకరికి లేదు. అలాగే మునీంద్రులు నన్నొక్కణ్ణే "శతాశ్వమేధకర్త' అంటున్నారు. ఈ పేరు ఇంకొకరికి రావటానికి వీలు లేదు. అందువల్ల నేనీ గుఱ్ఱాన్ని అపహరించాను. దీని జోలికి నీవు రావద్దు. వచ్చావంటే పూర్వం కపిలమహామునివల్ల సగరుని కొడుకులకు పట్టిన గతే నీకూ పట్టుంది".

ఆ మాటకు రఘువు నవ్వి నిర్భయంగా మళ్ళీ యిలా అన్నాడు –

"దేవేంద్రా! ఇదే నీ నిశ్చయమైతే శస్త్రం చేతికి తీసుకో. రఘువును జయించకుండా నీవు కృతకృత్యుడవు కాలేవు సుమా!"

మొగమెత్తి అలా ఇంద్రునితో పలికి రాజకుమారుడు వింట బాణం సంధించడానికై కుడికాలు ముందుబెట్టి ఎడమకాలు కుంచించుకొని శరీరౌన్నత్యంతో పరమేశ్వరుణ్ణి అనుకరిస్తూ నిలబడ్డాడు.



అతడు పలికిన తిరస్కారవచనం బాణంలా వచ్చి ఇంద్రుని గుండెల్లో గ్రుచ్చుకొన్నది. స్వర్గాధిపతి మిక్కిలి రోషించి క్రొత్త మబ్బులకు క్షణకాలం అలంకారమైన తన వింట అమోఘమైన శరం సంధించాడు. రక్కసుల నెత్తురు త్రావటాని కలవాటుపడ్డ ఆ బాణం దిలీపకుమారుని వక్షఃస్థలం ప్రవేశించి మునుపెన్నడూ తాను చవిచూడని మానవరక్తం ఎలా ఉంటుందో చూడాలన్న కోరికతో గాబోలు, అతడి రక్తం త్రాగింది. ఐరావతాన్ని తాటించడంవల్ల బిరుసెక్కిన వ్రేళ్ళు గల్గి, శచీదేవికి పత్రవిశేషకాలు రచించటాని కలవాటుపడిన మహేంద్రుని భుజంమీద పరాక్రమంలో కుమారస్వామికి దీటైన రఘువు కూడా తన పేరు చెక్కిన బాణం నాటాడు. వెంటనే నెమలి రెక్కలు గట్టిన మరొక వాడిశరం ప్రయోగించి దేవేంద్రుని పిడుగుటెక్కెం విరగగొట్టాడు. టెక్కెం విరగడం తన రాజ్యలక్ష్మికి తలవెంద్రుకలు గొరగడంగా భావించి సురలోకాధిపతి కోపంతో మండిపడ్డాడు.

అలా జయాభిలాషతో పోరాటానికి సిద్ధమైన వారిరువురికీ సంకుల సమరం జరిగింది. రెక్కలతోడి సర్పాల లాగా ఇంద్రుని బాణాలు క్రిందికీ, రఘువు బాణాలు మీదికీ మహాభయంకరంగా ప్రసరించాయి. ఆకసాన సిద్ధులూ, నేలపై సైనికులూ విస్మయావహమైన ఆ దృశ్యం చూస్తూ తటస్థంగా వుండిపోయారు.

ఇంద్రుడు రఘువుపై ఎడతెరపి లేకుండా అస్త్రవృష్టి కురిపించాడు. ఐనా తనలో నుండే పుట్టిన పిడుగును మబ్బు ఆర్పజాలనట్లు తన అంశంనుండే జనించి దుస్సహమైన తేజంతో వెలిగిపోతున్న రాజపుత్రుణ్ణి తెగటార్చలేకపోయాడు.

పిమ్మట మథించేటప్పుడు సముద్రం మ్రోగినట్లు హరిచందనాంకితమైన ఇంద్రుని ముంజేతిపై మ్రోగుతున్న అల్లెత్రాటిని రఘువు అర్ధచంద్రబాణంతో తెగనరికాడు. దానితో దేవేంద్రుని కోపం మేరమీరింది. అతడు ప్రబల

శత్రువును హతమార్చడానికి నిశ్చయించుకొని చేతనున్న విల్లు వదలి కొండల రెక్కలను తెగనరకడాని కుపయోగించే కాంతిమంతమైన వజ్రాయుధం చేబూని అతని వక్షంపై గురిచూచి కొట్టాడు. ఆ దెబ్బతో యువరాజు నేలగూలాడు. అతని సైనికులు భోరున ఏడువసాగారు. క్షణంలో రఘువు నొప్పి దులుపుకొని పైకి లేచాడు. సైనికులు ఆహ్లాదంతో సింహనాదాలు చేశారు. వజ్రాయుధపు దెబ్బకు సైతం తట్టుకొని తీవ్రవైరంతో మళ్ళీ పోరాటానికి తలపడ్డ రాజపుత్రుని పరాక్రమానికి ఇంద్రుడు మెచ్చుకొన్నాడు. పగవారైతేమాత్రం గుణవంతులను మెచ్చుకోకుండా వుంటారా?

ఆపై దేవేంద్రుడు రఘువును చూచి "కొండలను నరకడంలో గూడా అడ్డు లేనిది ఈ నా వజ్రాయుధం. నీవు దప్ప మరెవ్వడూ దీన్ని ఓర్చుకొన్నవాడు లేడు. నీ విక్రమాతిశయానికి నేనెంతో మెచ్చుకొన్నాను. ఈ గుఱ్ఱం తప్ప మరేమి అడుగుతావో, అడుగు. ఇస్తాను" అని స్పష్టంగా చెప్పాడు.

ఇంద్రు డలా ప్రియంగా పలికిన మాట విని అప్పుడే పొదినుండి పైకెత్తుతూ వుండిన బంగరు పిడికాంతులొలికించే శరాన్ని మళ్ళీ పొదిలోనే పెట్టి రఘువు ఆయనతో ప్రీతిగా ఇలా అన్నాడు –

"ప్రభూ! గుఱ్ఱాన్ని వదలడం వీలుగాని పక్షంలో అనవరత యాగదీక్షితుడైన మా తండ్రికి ఈ యాగం గూడా యథావిధిగా పూర్తి అయితే ఏ ఫలం కలుగుతుందో ఆ ఫలం ప్రసాదించండి! ఈ సంగతి ఇంటనున్న మా నాన్నగారికి మీ దూతద్వారానే తెలియ జేయండి! యజ్ఞదీక్షితుడై ముక్కంటిమూర్తి విశేషమై వున్న ఆయన చెంతకు ఈ స్థితిలో నేను పోవడం వీలు గాదు".

అతని అభ్యర్థన అంగీకరిస్తూ "అలాగే చేస్తాను" అని చెప్పి ఇంద్రుడు వచ్చినదారినే తిరిగివెళ్ళాడు. తన కోరిక నెరవేరినా గుఱ్ఱాన్ని పోగొట్టుకొన్నానన్న చింతతో ఎక్కువ సంతోషం లేకుండానే రఘువు



తండ్రివద్దకు తిరిగివచ్చాడు. అతడు సభామండపం చేరక ముందే ఇంద్రుని దూతద్వారా దిలీపమహారాజు జరిగిన సంగతి తెలుసుకొన్నాడు. కుమారుడు సమీపించగానే వజ్రాయుధపు దెబ్బతిని వున్న అతని దేహాన్ని చల్లని చేతితో మెల్లగా నిమురుతూ బుజ్జగించాడు.

ఇలా దిలీపుడు దేహపాతానంతరం స్వర్గానికి వెళ్ళటానికి మెట్లు కట్టుకొన్నాడా అన్నట్లు తొంబై తొమ్మిది అశ్వమేధయాగాలు పూర్తిచేశాడు. పిమ్మట అతడు విషయభోగాలపై విరక్తి చెంది రాజ్యభారం పూర్తిగా కుమారుడి కప్పగించి వానప్రస్థ వృత్తి నవలంబించి సుదక్షిణాదేవితో సహా తపోవనంలో నివసించాడు. వయసు చెల్లిన ఇక్ష్వాకు వంశస్థులకు అలా చేయడం కులవ్రతమే కదా!

* * *

# 4

# రఘుమహారాజు అభ్యుదయం

తండ్రి యిచ్చిన రాజ్యం స్వీకరించి సాయంసమయంలో సూర్యుడినుండి తేజస్సు గ్రహించిన అగ్నిలాగా రఘుమహారాజు జాజ్వల్యమానుడై ప్రకాశించాడు. దిలీపుడి కాలంలో శత్రురాజుల గుండెల్లో కుములుతూ వుండిన సంతాపాగ్ని రఘువు రాజైనాడని వినగానే మంటలు గ్రక్కుతూ పైకెగసింది.

జాతరలో నిలబెట్టిన ఇంద్రధ్వజాన్ని చూచినట్లు క్రొత్తగా రాజ్యంలో ప్రతిష్ఠితుడైన రఘుమహారాజు అభ్యుదయం కళ్లారా చూచి బిడ్డలతో సహా ప్రజలందరూ ఎంతో సంతోషించారు. గజగమనుడైన రఘువు తండ్రినుండి సంక్రమించిన సింహాసనంతోపాటు శత్రుమండలాన్ని గూడా ఆక్రమించాడు. అప్పుడు రాజ్యలక్ష్మి తాను కంటికి కనబడకనే తామరగొడుగు పట్టి అతణ్ణి సేవిస్తున్నదా అన్నట్లు అతనిలో ఒక వింత ఛాయ గోచరించింది. సరస్వతి స్తుతిపాఠకులలో నెలకొని ఉచితకాలాలలో స్తవనీయుడైన అతణ్ణి అర్థవంతమైన స్తుతులతో పూజించింది.

మనువు మొదలైన మహారాజు లెందరో పూర్వం భూమిని అనుభవించారు. అయినా రఘువును ఆమె మొట్టమొదటి పతిలాగా ప్రేమించింది. ఎక్కువ చలీ, ఎక్కువ వేడీ లేని మలయమారుతం లాగా, అతడు మిక్కిలి తీక్ష్ణమూ, మిక్కిలి మృదువూ కాని యుక్తదండం విధించడంవల్ల అందరి మనసులూ ఆకట్టుకొన్నాడు.

కాపు కనిపించిన తర్వాత మామిడి పూతమీద ఔత్సుక్యం తగ్గినట్లే గుణాధికుడైన రఘువు పరిపాలన చవిచూచిన తర్వాత ప్రజలకు అతని తండ్రిమీద ఔత్సుక్యం తగ్గిపోయింది. నీతివేత్తలైన అమాత్యులు అతనికి ధర్మయుద్ధం మొదలైన సత్పక్షాన్నీ, కూటయుద్ధం మొదలైన అసత్పక్షాన్నీ



రెండింటినీ బోధించారు. అందులో అతడు సత్పక్షాన్నే సదా అవలంబించేవాడు. అతని పరిపాలనలో పృథివి మొదలైన పంచభూతాలు మహోత్కృష్టంగా తమ గుణాలను పెంపొందించుకొన్నాయి. రాజు క్రొత్తవాడయ్యేసరికి ఆ రాజ్యంలో ప్రతిదీ క్రొత్తదిగానే గోచరించింది. ప్రజలను ఆహ్లాదపరచేవాడు కాబట్టి 'చంద్రుడు' అనే పేరు చంద్రుడికీ, తపింప జేసేవాడు కాబట్టి 'తపనుడు' అనే పేరు సూర్యుడికీ సార్థకమైనట్లే ప్రజలను రంజింపజేయటంవల్ల రఘువుకు 'రాజు' అనే పేరు సార్థకమైంది. చెవులవరకూ వ్యాపించిన సువిశాలమైన నేత్రాలున్నా సూక్ష్మాతి సూక్ష్మమైన కార్యమార్గాలను గమనించే శాస్త్రదృష్టే అతనికి ముఖ్యదృష్టిగా వుండేది.

అతడు రాజ్యంలో చక్కగా కుదురుకునే సరికి రెండవ రాజ్యలక్ష్మి లాగా పద్మచిహ్నాలతో శరదృతువు సంప్రాప్తమైంది. వానకారు మబ్బులు ఆకసంనుండి తొలగిపోగానే సూర్యప్రతాపంతో సహా జైత్రయాత్రకు బయలుదేరిన రఘుమహారాజు ప్రతాపం కూడా సహింపరానిదై దిక్కు లన్నిటా వ్యాపించింది. ఇంద్రుడు వర్షం కల్గించే తన ధనువు దించగానే రఘువు జయసాధనమైన తన ధనుస్సు పైకెత్తాడు. ఇద్దరూ ప్రజాక్షేమంకొరకు ధనుస్సులను ధరించేవారే కదా!

తెల్లదామర గొడుగుతోనూ, రెల్లుపూల వింజామరలతోనూ శరదృతువు రఘుమహారాజును అనుకరించిందే కాని అతని కాంతిని పొందలేకపోయింది. ప్రసన్నముఖుడైన రఘువునూ, నిర్మలకాంతి గల చంద్రుణ్ణీ ప్రజలు సమానానురక్తితో చూచి ఆనందించారు. రఘువుకీర్తి తమపై వ్యాపించి నందువల్ల కాబోలు హంసలూ, నక్షత్రాలూ, తెల్లగలువలతోడి నీళ్ళూ- తెల్లతెల్లగా ప్రకాశించాయి. పైరు కాపరి పడతులు చెఱకుతోటల నీడల్లో కూర్చొని రఘుమహారాజు బాల్యమాదిగా చేసిన ఇంద్రవిజయాది వీరకృత్యాలను పాటలుగా పాడారు. మహాతేజస్వి అగస్త్యుడు నక్షత్రరూపంలో ఉదయించగానే నీరు తేటపడింది. మహాపరాక్రమశాలి రఘువు అభ్యుదయం

పొందగానే శత్రురాజుల మనస్సు కలత జెందింది. గొప్ప మూపురాలు గలిగి ఏటిగట్టులు గోరాడే మదించిన ఆబోతులు ఆజానుబాహువై శత్రువులను చీల్చిచెండాడే రఘుమహారాజు పరాక్రమవిలాసాన్ని అనుకరించాయి. మదజల వాసన గల ఏడాకుల అరటిచెట్ల పూల తాకిడికి అసూయపడ్డాయా అన్నట్లు అతని ఏనుగులు తమ శరీరంలో ఏడుచోట్లనుండి మదజలం కార్చాయి.

## దిగ్విజయ యాత్ర

శరదృతువు రాగానే నదుల్లో లోతు తగ్గిపోయింది. దారిలో బురద ఎండిపోయింది. అంచేత రఘుమహారాజు దిగ్విజయయాత్రకు సిద్ధమయ్యాడు. అతడు గుఱ్ఱాల శాంతికై హోమం చేయించాడు. అప్పుడు అగ్నిదేవుడు తన చేతిమీదుగా అతనికి విజయం అందిస్తున్నాడా అన్నట్లుగా ప్రదక్షిణజ్వాలతో వెలిగాడు. యాత్రారంభంలో రఘువు పూజాదికాలు నిర్వర్తించాడు. రాజధానికీ, కోటకూ గట్టి కాపలా ఉంచాడు. ఆరు రకాల దండుతో జైత్రయాత్రకు బయలుదేరాడు. అప్పుడు నగరంలోని పెద్ద ముత్తైదువలు శుభసూచకంగా అతనిపై లాజలు చల్లారు. ఆ దృశ్యం మంథరాద్రిచే పాలసముద్రం చిలికినప్పుడు అందలి అలలు మహావిష్ణువుపై పాలతుంపరలు చల్లిన దృశ్యాన్ని స్మరింపజేసింది.

ఇంద్ర సమానుడైన ఆ రాజు అనుకూలమైన గాడ్పునకు రెపరెపలాడుతున్న జెండాలతో శత్రువులను బెదిరిస్తున్నాడా అన్నట్లు ముందు తూర్పుదిశగా పయనించాడు. అప్పుడు రథం రేపిన దుమ్ముతో నిండిన ఆకసం భూతలంగానూ, మేఘాలవంటి ఏనుగులతో నిండిన భూతలం ఆకాశంలాగానూ కనిపించాయి. ముందు ప్రతాపమూ, తర్వాత దండు కలకలమూ, ఆతర్వాత ధూళీ, దానితర్వాత రథగజాదులూ – ఈ విధంగా నాల్గు వ్యూహాలతో ఆ సైన్యం సాగిపోయినట్లుండింది.



మహాసమర్థుడైన రఘువు ప్రయాణానికి అనుకూలంగా ఎడారులలో నీటివసతి ఏర్పాటు చేశాడు. పడవలపై దాటవలసిన మహానదులను సులభంగా దాటే వీలు కలిగించాడు. అడవులు కొట్టించి బయళ్లు చేశాడు. తూర్పుసముద్రంవైపు పయనిస్తున్న మహాసేనను నడిపించుకుపోతున్న ఆ రాజు శివుని జడనుండి జారిన గంగను వెంటబెట్టుకొని పోతున్న భగీరథునిలా భాసించాడు. మదపుటేనుగు దారిలో కొన్ని చెట్ల కాయలు రాలుస్తూ, కొన్నింటిని పెకలిస్తూ, కొన్నింటి కొమ్మలు విరుస్తూ ఎలా సాగిపోతుందో, అలాగే రఘువు కొందరు రాజులనుండి లాభాలు స్వీకరిస్తూ, కొందరిని రాజ్యంనుండి తొలగిస్తూ, మరికొందర్ని ఓడిస్తూ నిరాటంకంగా ముందుకు సాగిపోయాడు.

ఈ విధంగా తూర్పు రాజ్యాలను ఆక్రమించి జయశీలుడైన రఘుమహారాజు తాటితోపులతో నల్లగా వున్న సముద్రతీరం చేరాడు. వంగని చెట్లను పెకలిస్తూ, వస్తున్న ఏటి ప్రవాహానికి తలవంచి ప్రబ్బలిచెట్లు ఆత్మరక్షణ చేసుకొంటాయి. అలాగే అడ్డు తగిలిన వారందరినీ హతమారుస్తూ వస్తున్న రఘువుకు లొంగిపోయి సుహ్మదేశస్థులు తమ్ము తాము కాపాడుకొన్నారు. ఓడలపై వచ్చి తనతో తలపడ్డ వంగదేశపు రాజులను ఓడించి రఘువు గంగలోని లంకలలో జయస్తంభాలను నాటాడు. ఓడినవాళ్లు అతని పాదాలకు తలలానించి నమస్కారాలు చేశారు. అప్పు దతడు మళ్ళీ వాళ్ళను తమ తమ స్థానాలలోనే నిలిపాడు. పెరికి నాటిన పైర్లులాగా వాళ్ళు అతనికి ధనరూపమైన ఫలసమృద్ధిని గల్గించారు.

తర్వాత అతడు ఏనుగులను వంతెనగా నిల్పి దాని మీదుగా దండుతో కపిశానది దాటి ఓఢ్రరాజులు చూపిన దారిలో కళింగదేశం చేరాడు. గంభీరవేది అనే మదపుటేనుగు తలపై మావటీడు చురుకైన అంకుశం నాటినట్లు, రఘువు మహేంద్రపర్వత శిఖరంమీద తీక్ష్ణమైన ప్రతాపం ప్రదర్శించాడు. ఱెక్కలు నరకటానికి ఉద్యుక్తుడైన ఇంద్రుణ్ణి రాళ్లవానతో

కొండ ఎదుర్కొన్నట్లు, ఏనుగుదండు మెండుగా వున్న కళింగరాజు అస్త్రప్రయోగంతో అతణ్ణి ఎదుర్కొన్నాడు. శత్రువులనుండి వచ్చే శరవర్షానికి ఓర్చుకొని రఘువు మంగళాభిషిక్తుడైన వానిలా జయలక్ష్మిని చేకొన్నాడు. మహేంద్రాద్రిలో అతని సైనికులు పానగోష్ఠికి తగినచోట్లు ఏర్పాటు చేసుకొని తములపాకు దొన్నెలలో శత్రువుల కీర్తిని పోలిన టెంకాయకల్లు త్రాగారు. ధర్మం పాటించే రఘుమహారాజు కళింగరాజు నోడించి పట్టుకొని మళ్ళీ వదిలేశాడు. అతడి సంపదను హరించాడే కాని భూమిని హరించలేదు.

తూర్పుదిక్కును జయించిన తర్వాత అతడు ఫలించిన పోకతోటలతో విలసిల్లుతున్న సముద్రతీరం వెంబడే నడిచి అప్రయత్నంగా విజయం పొందుతూ దక్షిణదిక్కుకు వెళ్లాడు. అతని సైన్యాలూ, గజాలూ అక్కడ కావేరీనదిలో స్నానంచేసి అంగరాగాలతోనూ, మదజలంతోనూ కలుషితమైన ఆ నదిమీద సముద్రుడికి సందేహం కలిగేట్టు చేశాయి. తర్వాత జయేచ్ఛుతో ముందుకు సాగుతున్న రఘుమహారాజు సైన్యాలు ఇంక కొంత ముందుకు వెళ్ళి మలయపర్వతం చెంత విడిశాయి. ఆ అలజడికి బెదిరి అక్కడి మిరియపుతోటలనుండి హారీతపక్షులు పైకెగిరిపోయాయి. అక్కడ గుఱ్ఱాల తొక్కిడికి నలిగిన ఏలకికాయలపొడి పైకెగిరి ఆలాంటి వాసనే కల మదపుటేనుగుల గండస్థలాలపై రాలింది. పాములు చుట్టుకోవటంవల్ల ఏర్పడ్డ చందనవృక్షాల నఱదలలో మెడగొలుసులను తగిలించి మదగజాలను కట్టివేశారు. కాలి గొలుసులను సైతం తెంపుకొనే ఆ యేనుగు లెంత లాగినా ఆ మెడకట్టులు సడలలేదు.

పాండ్యరాజు లుండే దక్షిణదిక్కుకు పోయినప్పుడు సూర్యుని తేజస్సుగూడా తగ్గిపోతుంది. ఆ దిక్కులోనే పాండ్యులు రఘుమహారాజు ప్రతాపం ముందర నిలబడలేకపోయారు. వాళ్లు అతనికి శరణాగతులయ్యారు. ఎంతో కాలంనుండి తామ్రపర్ణీ సాగరసంగమస్థలంలో తాము సంపాదించి



కూడబెట్టుకొన్న ముత్యాలరాశిని కీర్తిరాశిని సమర్పించినట్లు వారు రఘువుకు సమర్పించారు.

చందనవ్యాప్తాలై దక్షిణదిక్కు అనే అంగనకు పాలిండ్లులా వున్న మలయదర్దుర పర్వతాలను రఘుమహారాజు యథేచ్ఛగా అనుభవించాడు. తర్వాత దుస్సహపరాక్రముడై అతడు వలువ తొలగిన భూదేవి నితంబంలా సముద్రానికి దూరంగా వున్న సహ్యాద్రిని దాటి వెళ్ళాడు. అతని సైన్యాలు పడమటిదిక్కుగా వెళ్తూ సహ్యపర్వతానికీ, సముద్రానికీ మధ్య నడుస్తున్నప్పుడు సహ్యాద్రి పూర్వం పరశురామునిచే దూరీకరించబడిన సాగరంతో మళ్లీ సంగమించినట్లు కనిపించింది. మహోద్ధతంగా వస్తున్న ఆ సైన్యాలను చూచి భయపడి కేరళ స్త్రీలు ఆభరణాలు త్యజించి పారిపోయారు. ఐనా సేనల ధూళి వాళ్ళ ముంగురులపై బడి కుంకుమాలంకార శోభను కలిగించింది. మురళీనదినుండి వచ్చే గాలికి రేగిన మొగలి పూలధూళి సైనికుల కవచాలపై బడి అప్రయత్నంగా కల్గిన బుక్కాగా శోభిల్లింది. సాగిపోతున్న గుఱ్ఱపుదళాల కవచధ్వని అక్కడ గాలికి కదిలే తాటిచెట్ల చప్పుడును మించిపోయింది.

దండు విడిసిన చోట ఏనుగులను చిట్టీతచెట్లకు కట్టివేశారు. వెంటనే తుమ్మెదలు పొన్నపూలపైనుండి ఎగిరివచ్చి మదజలం కారుతున్న వాటి గండస్థలాలపై వ్రాలాయి. పూర్వం యాచిస్తే పరశురాముడికి సముద్రుడు చోటిచ్చాడు కాని రఘువుకు మాత్రం పడమటిరాజుల నెపంతో కిమ్మనకుండా కప్పం చెల్లించుకొన్నాడు. దండులోని ఏనుగులు త్రికూటపర్వతం మీద దంతాలతో గీసిన గీరలు రఘుపరాక్రమాన్ని ప్రకటించే అక్షరాలుగానూ, ఆ పర్వతం జయస్తంభంగానూ ఉపయోగపడ్డాయి.

తర్వాత ఇంద్రియా లనే శత్రువులను జయించడానికి యోగి తత్త్వజ్ఞానమార్గం అనుసరించినట్లు పారశీకులను జయించడానికి రఘుమహారాజు నేలబాటను అనుసరించాడు. అకాలంలో వచ్చిన మేఘం తామరలమీది లేతయెండను తొలగించినట్లే అతడు యవనులతో కయ్యానికి

తలపడి వాళ్ళ వనితల ముఖాలనుండి మధుమదాన్ని తొలగించాడు. మెండైన గుఱ్ఱపుదండుగల ఆ పడమటి దేశపురాజులతో పోరు ఘోరంగా జరిగింది. అప్పుడు రేగిన దుమ్ములో ఎదుటి శత్రువు లెవరికీ కనిపించలేదు. ధనుష్టంకారాల వినికిడినిబట్టి ఒకరిపై నొకరు బాణాలు ప్రయోగించుకొన్నారు. గడ్డాలూ, మీసాలూ దట్టంగా ఎదిగివున్న వారి తలలను రఘువు బల్లేలతో తెగవేశాడు. తెగి క్రిందపడ్డ ఆ తలలు తేనెటీగలు క్రమ్మిన తేనెపట్టుల్లా భూమిని క్రమ్మివేశాయి. చావు దప్పించుకొన్న మిగిలిన యవనులు శిరస్త్రాణాలను తొలగించుకొని ఆ మహారాజును శరణుజొచ్చారు. అతడు వాళ్లను మన్నించాడు. పెద్దల కోపం నమస్కారంతో శాంతిస్తుంది కదా!

రఘుమహారాజు సైనికులు అక్కడి ద్రాక్షతోటలో మేలైన చర్మాసనాలపై కూర్చొని మద్యం సేవిస్తూ అలసట తీర్చుకొన్నారు. తర్వాత సూర్యుడు కిరణాలతో నీరు పీల్చినట్లు బాణాలతో ఉత్తరదిక్కు రాజులను నిర్మూలిస్తూ రఘుమహారాజు పయనం సాగించాడు. అతని అశ్వాలు సింధునదీతీరంలో పొరలాడి మార్గాయాసం తీర్చుకొన్నాయి. పొరలాడేటప్పుడు స్కంధాల కంటుకొన్న కుంకుమపూరేకులను అవి వొళ్లు దులుపుకొని రాల్చివేశాయి. అక్కడ హూణదేశపు రాజులు అతనితో సమరానికి తలపడ్డారు. అతడు అవక్రవిక్రమంతో వాళ్లను తెగటార్చాడు. వారి అంతఃపుర స్త్రీలు మొగాలు ఎరుపెక్కేటట్లు బాదుకొంటూ రోదించారు. కాంభోజరాజులు రఘువు పరాక్రమానికి తట్టుకోలేక అతని యేనుగుల కాలికట్ల లాగుడుకు వంగిన ఊడుగుచెట్లలాగా వంగిపోయారు. వాళ్ళతనికి మేలైన గుఱ్ఱాలతో సహా ఎత్తైన బంగారురాసులను కానుకగా ఇచ్చారు. అయినా అత డందుకు గర్వపడలేదు.

తర్వాత అతడు అశ్వసహాయంతో హిమవత్పర్వతం ఎక్కాడు. అక్కడ గుఱ్ఱాలు లేపిన గైరికాది ధాతువుల ధూళి ఆ కొండశిఖరాలు



పైకెగురుతున్నాయా అన్న భ్రమను కల్గించింది. సైన్యం పెద్ద కలకలంతో ప్రక్కన వెళ్తున్నా గుహలలో పడుకొన్న సింహాలు బెదరకుండా మెడలు త్రిప్పి వెనక్కు చూచి సైనికులతో సమానమైన బలం తమకున్నదని వ్యక్తం చేశాయి. మిన్నేటి తుంపురులతో చల్లబడి మెల్లగా వీస్తున్న అక్కడి గాలి భూర్జవృక్షాలలో మర్మరధ్వనినీ, బొంగువెదుళ్ళలో మధురగానాన్నీ వెలయిస్తూ రఘుమహారాజును సేవించింది. సైనికులు సురపొన్నలక్రింద పడుకొన్న కస్తూరీమృగాల కస్తూరితో గుబాళించే శిలాతలాలపై విశ్రమించారు. రాత్రివేళల్లో సరళవృక్షాలకు కట్టివేసిన ఏనుగుల మెడ గొలుసులలో ప్రతిబింబించిన జ్యోతిష్మతీలతలు నూనెతో పనిలేని దీపాల్లా ఉపయోగపడ్డాయి. సైన్యం అక్కడినుండి వెళ్లిన తర్వాత ఏనుగుల మెడ గొలుసుల రాపిడితో ఎత్తున గుర్తులుపడ్డ దేవదారు వృక్షాలనుచూచి బోయవాళ్ళు ఆ గజాల దేహప్రమాణం ఊహించుకొని ఆశ్చర్యపడ్డారు.

అక్కడ రఘుమహారాజుకూ, ఉత్సవ సంకేతు లనబడే కొండరాజులకూ ఘోరమైన పోరాటం జరిగింది. అప్పుడు బాణాలూ, విసరివేసిన గుదియలూ, రాళ్లూ – వీటి రాపిడికి నిప్పులు కురిశాయి. చివరికి రఘువు శరపరంపర ప్రయోగించి వాళ్ళను జయించాడు. కిన్నరులు అతని విజయాన్ని ప్రశంసిస్తూ పాటలు పాడారు. ఆ పర్వతవాసులు అతనికి వెలలేని కానుక లర్పించారు. అప్పుడు మహాబలవంతులైన వాళ్లను ఓడించిన రఘుమహారాజుసారం హిమవంతుడికీ, అట్టి కానుకలకు నెలవైన హిమవంతుడిసారం రఘుమహారాజుకీ బోధపడింది. దిలీపసుతుడు అనంతమైన తన కీర్తిని హిమాద్రిపై ప్రతిష్ఠించాడు. పూర్వం రావణుడు ఉగ్రూత లూగించిన కైలాసంపై మళ్ళీ తాను దాడి జరపడం తగదని కాబోలు కైలాసాన్ని సిగ్గుపడజేసేవానిలా అక్కడినుండి క్రిందికి దిగివచ్చాడు.

తర్వాత అతడు లౌహిత్యానదిని దాటాడు. అప్పుడతని గజాలను కట్టివేసిన నల్ల అగరుచెట్లు వణికినట్లే ప్రాగ్జ్యోతిష రాజు గడగడ

వణకిపోయాడు. సూర్యుణ్ణి కనిపించనీకుండా మేఘం లాగా ఆకసమంతా క్రముకొన్న రఘువు రథాల ధూళిని చూచే అతడు భయపడ్డాడు. ఇక సైన్యాన్ని చూస్తే ఏమయ్యాడో వేతే చెప్పాలా? కామరూపదేశపురాజు ఇతర రాజులను జయించడంలో తనకు ముఖ్యంగా ఉపయోగపడే మదగజాలను ఇంద్రవిజేత అయిన రఘుమహారాజుకు కానుకగా సమర్పించుకొని శరణాగతి చెందాడు. బంగరుపీటమీద నెలకొన్న అతని పాదకాంతిని దేవతను పూజించినట్లు రత్నాలతో పూజించాడు.

ఇలా జయశీలుడైన రఘుమహారాజు నలుదిక్కులనూ జయించి ఛత్రశూన్యమైన నరపతుల సిగలలో రథాల ధూళిని విశ్రమింపజేస్తూ రాజధానికి తిరిగివచ్చాడు. ఆపైన సర్వస్వాన్నీ దక్షిణగా సమర్పించే విశ్వజిద్యాగం చేశాడు. మేఘాలలాగా సజ్జనులు పుచ్చుకోవడ మనేది సత్పాత్రులకు ఇచ్చుకోవడానికే కదా!

యాగం పూర్తి కాగానే యుద్ధంలో ఓడి తన వెంబడి వచ్చిన రాజుల నందరినీ గొప్ప సత్కారాలు చేసి సంతోషపెట్టాడు. ఆపై వాళ్ళ అంతఃపురకాంతల చిరవిరహం తీరేటట్లు వాళ్లు తమతమ నగరాలకు తిరిగి పోవటానికి అనుమతించాడు. రేఖాధ్వజాది సార్వభౌమ చిహ్నాలతో విలసిల్లే రఘుమహారాజు పాదయుగళానికి సిగపూదండలు సోకేటట్లుగా మ్రొక్కి ఆ రాజులందరూ తమ తమ పట్టణాలకు తరలి వెళ్లారు.

* * *

## 5

# రఘుమహారాజు ఔదార్యం

రఘుమహారాజు విశ్వజిద్యాగం నిర్వహించి అందులో తనకున్న సమస్త ధనరాసులూ దానం చేసి ధనహీనుడయ్యాడు. అప్పుడు వరతంతుముని వద్ద సర్వవిద్యలూ అభ్యసించిన కౌత్సుడనే శిష్యుడు గురువుకు సమర్పించవలసిన దక్షిణ యాచించడానికై రాజు దగ్గఱకు వచ్చాడు.

అతిథి సేవాపరాయణుడూ, కీర్తిమంతుడూ, సచ్ఛీలుడూ అయిన రఘువు తనవద్ద బంగారు పాత్రలు లేకపోవడంవల్ల మట్టిపాత్రలోనే పూజాద్రవ్యాలు పెట్టుకొని విద్యావంతుడైన అతిథికి ఎదురుగా వెళ్లాడు. శాస్త్రజ్ఞుడూ, మానధనులలో మొదటివాడూ, సత్కారవిధానం చక్కగా తెలిసినవాడూ అయిన ఆ నరేంద్రుడు కౌత్సుణ్ణి ఉచితాసనంపై కూర్చోబెట్టి శాస్త్రవిధి ప్రకారం పూజించాడు.

తరువాత అతని చెంత చేతులను జోడించుకొని ఇలా అన్నాడు –

“ఓకుశాగ్రమతీ! లోకానికి చైతన్యం కలిగించే సూర్యునిలాగా నీకు సమస్త జ్ఞానమూ కలిగించినవాడూ, మంత్రద్రష్టలైన ఋషులలో శ్రేష్ఠుడూ అయిన మీ గురువుకు కుశలమేనా? ఇంద్రుడు భయపడేటట్లుగా మనోవాక్కాయాలచే సదా మీ గురువు ఆచరిస్తున్న త్రివిధతపస్సులకూ ఎట్టి అంతరాయాలవల్లా నష్టం వాటిల్లడం లేదు గదా! పాదులు చేసి, నీళ్లుపోసి కన్నబిడ్డల లాగా ప్రేమతో మీరు పెంచగా పెరిగి మీ శ్రమ పోగొడ్తున్న ఆశ్రమవృక్షాలకు గాలి మొదలైన వాటివల్ల ఎట్టి ఉపద్రవమూ లేదు గదా! (రాజుకివ్వవలసిన) ఆరవపాలి పరిగధాన్యపు రాసుల గుర్తులు గల ఇసుక దిబ్బలచెంత మీనిత్యస్నానాలకూ, పితృతర్పణాలకూ ఉపయోగపడుతూ వున్న తీర్థజలాలకు లోటేమీ లేదుగదా!

ప్రేమాతిశయంతో మునులు అడ్డగించకపోవడంవల్ల వాళ్ళ అనుష్ఠానాని కుపయోగపడే దర్భలు మేసేవీ, ప్రసవానంతరం ప్రమాదనివారణకై బొడ్డుచేరులు ఊడిపడేవరకూ వాళ్ల ఒడిలోనే పెరిగేవీ అయిన జింకపిల్లలకు క్షేమమే గదా! అతిథులకు పెట్టడానికీ, మీ సొంత జీవనానికీ ఉపయోగపడే అడవి నివ్వరిధాన్యాలు మొదలైనవాటిని చుట్టుప్రక్కల గ్రామాలనుండి వచ్చే పశువులు మేసిపోవటం లేదుగదా!

ఇతరాశ్రమాల కన్నిటికీ ఉపకరించే గృహస్థాశ్రమంలో ప్రవేశించటానికి నీకిది తగిన సమయం కదా! ప్రసన్న చిత్తంతో వరతంతు మహాముని నీకు విద్యలన్నీ నేర్పి ప్రస్తుతం గృహస్థాశ్రమ స్వీకారానికి అనుమతి యిచ్చాడా? పూజ్యుడవైన నీవు నాచెంతకు వచ్చినంతమాత్రాన నాకు తృప్తి లేదు. నీ ఆదేశం నెరవేర్చటానికి నా మనస్సు ఉబలాటపడుతున్నది. అడవినుండి నన్ను గౌరవించడానికి ఇక్కడికి నీవు మీ గురువు గారి ఆజ్ఞ ననుసరించి వచ్చావా? లేక నీ అంతట నీవే వచ్చావా?"

మిక్కిలి ఉదారంగా "నీ ఆజ్ఞ నెరవేరుస్తాను" అన్న రఘువు మాట విని కూడ మట్టిపాత్రను చూచి అతడు త్యాగంవల్ల రిక్తుడై వున్నాడని గ్రహించిన కౌత్సుడు తన కోరిక నెరవేరుతుందనే ఆశ వదలుకొనే అతనితో ఇలా అన్నాడు–

"రాజా! మాకన్నివిధాలా క్షేమమే. నీ పరిపాలనలో ప్రజలకు కీడు ఎలా కల్గుతుంది? సూర్యుడు ప్రకాశిస్తూ వుండగా జనుల చూపును చీకట్లెలా ఆవరిస్తాయి? ఓ సార్వభౌముడా! పెద్దలపట్ల భక్తి చూపడం మీకు కులక్రమాగతమైన సంప్రదాయం. ఈ విషయంలో నీవు నీపూర్వులను సైతం మించిపోయావు. ఐనా నేను కాలం మించిన తర్వాత యాచించటానికి వచ్చానే అని చింతిస్తున్నాను.

నరేంద్రా! అడవిలో మునులు మొదలైన వాళ్లు ఫలం పరిగ్రహించిన పిమ్మట దంటు మాత్రం మిగిలిన నివ్వరిసస్యంలాగా పాత్రులైన వాళ్ళకు



ధనమంతా సమర్పించి నీవిప్పుడు శరీర మాత్రావశిష్టుడవై ప్రకాశిస్తున్నావు. భూమండలానికి ఏకచ్ఛత్రాధిపతివైన నీకు యాగంవల్ల కల్గిన ఈ పేదరికం యుక్తమే. వరుసగా దేవతలు అమృతపానం చేయడంవల్ల చంద్రుడి కళలు తరిగిపోవడ మనేది అవి పెరగడం కంటే ఎక్కువ శ్లాఘనీయం గదా! అందువల్ల గురుదక్షిణకోరి వచ్చిన నేను మరొక దాత నాశ్రయించి ఆ ధనం సంపాదించటానికి ప్రయత్నిస్తాను. నీకు శుభమగుగాక! కురిసి కురిసి వట్టిపోయిన శరత్కాలపు మబ్బును చాతకపక్షికూడా యాచించదుగదా!"

ఇలా చెప్పి అక్కడనుండి బయలుదేరడానికి సిద్ధమవుతున్న కౌత్సుణ్ణి రఘుమహారాజు ఆపి "ఓ విద్వాంసుడా! నీవు గురువుకు సమర్పించవలసిన వస్తువు ఏది? అది ఏపాటిది?" అని ప్రశ్నించాడు.

అంతట విధ్యుక్తవిధానంతో యాగాలు నిర్వహించినవాడూ, గర్వరహితుడూ, వర్ణాశ్రమ ధర్మపరిపాలకుడూ అయిన రఘుమహారాజుతో విద్వాంసుడైన ఆ బ్రహ్మచారి ఇలా చెప్పాడు –

"మహర్షివల్ల చదువులన్నీ నేర్చుకోవటం పూర్తికాగానే నేను ఆయన చెంతకు వెళ్లి గురుదక్షిణగా ఏమైనా స్వీకరించుమని వేడుకొన్నాను. ఆయనపట్ల నేను చూపిన దుష్కరమైన భక్తినే గురుదక్షిణగా భావించిన ఆ మహనీయుడు తనకు ఇంకేమీ దక్షిణ ఇవ్వనక్కరలేదని చెప్పాడు.

నేను అంతటితో ఊరకుండక తప్పక ఏదైనా గురుదక్షిణ స్వీకరించి తీరవలసిందే అని మొండిపట్టు పట్టాను. దానితో గురువు కోపించి నేను దరిద్రుడ నన్న సంగతి ఆలోచించకుండా తాను నేర్పిన పద్నాలుగు విద్యలకుగానూ పదునాలుగు కోట్ల ధనం దక్షిణగా తెచ్చి యిమ్మని ఆజ్ఞాపించాడు. అందువల్ల నేను నిన్ను ఆశ్రయించడానికి వచ్చాను. నీవు నాకు మట్టిపాత్రతో అర్ఘ్యమివ్వడం చూచి ధనమంతా దానం చేసి పేరుకుమాత్రం ప్రభువుగా మిగిలివున్నావని గ్రహించాను. నేను

చెల్లించవలసిన గురుదక్షిణ కొద్దిపాటిది కాదు. అందుచేత ఈ స్థితిలో నున్న నిన్ను ఇబ్బంది పెట్టడం నాకిష్టం లేదు."

వేదజ్ఞులలో శ్రేష్ఠుడైన కౌత్సుడు అలా చెప్పేసరికి చంద్రునివంటి కాంతిగలవాడూ, కాలుష్యం అంటనివాడూ, జగదేకప్రభువూ అయిన రఘుమహారాజు మళ్ళీ అతనితో ఇలా అన్నాడు.

"సకల శాస్త్రపారంగతు డొకడు గురుదక్షిణ కోరి రఘువు దగ్గరకు రావడమూ, అక్కడ తన కోరిక తీరక మరొక దాతను ఆశ్రయించడమూ అనే యింతకు మునుపు ఎన్నడూ లేని యీ అపవాదు నాకు కలుగకుండుగాక! నీవు పవిత్రమూ, ప్రసిద్ధమూ అయిన నా అగ్నిశాలలో త్రేతాగ్నులతో పాటు నాల్గవ అగ్నిలాగా వెలుగుతూ రెండు మూడు దినాలు ఓపికపట్టు. అంతలో నీపని నెరవేరుస్తాను."

అమోఘమైన ఆయన ప్రతిజ్ఞకు సంతోషించి బ్రాహ్మణుడు సరే అని అంగీకరించాడు. భూలోకంలోని ధనసంపదనంతా అంతకుముందే రాబట్టుకొని వుండడంవల్ల రఘువు కౌత్సుడికి కావలసిన ధనం కుబేరుని వద్దనుంచి తీసుకురావా లనుకున్నాడు. వసిష్ఠమహర్షి చల్లిన మంత్రజల ప్రభావంవల్ల రఘుమహారాజు రథానికి గాలి చెలికాడైన మేఘునికి లాగా సముద్రంలోగాని, ఆకాశంలోగాని, పర్వతాలలోగాని గమనాటంకం లేదుగదా! తర్వాత పరిశుద్ధుడూ, మహాధీరుడూ ఐన రఘువు కుబేరుణ్ణి ఒక రాజమాత్రునిగా భావించి పరాక్రమంతో జయించా లనుకున్నాడు. అస్త్రాలతో రథం సిద్ధంగా వుంచుకొని ప్రదోషసమయాన అందే శయనించాడు.

మరునాటి వేకువ రఘుమహారాజు సంగ్రామానికి బయలుదేరబోయే సమయంలో ఆశ్చర్యచకితులైన కోశాధికారులు వచ్చి రాత్రి ఆకాశంనుంచి కురిసిన బంగారు వానకు ధనాగారం నిండిపోయిందని తెలియజేశారు.



తన పైకి దండెత్తనున్న రఘువుకోసమే కుబేరు డీకనకవర్షం కురిపించాడు. వజ్రాయుధపు వ్రేటుకు చీలికూలిన మేరుగిరిశిఖరం మాదిరి గుట్టగా పడివున్న హేమరాశి నంతటినీ స్వీకరింపుమని రాజనగా గురుదక్షిణగా సమర్పింపవలసిన విత్తంకంటె కించిత్తు కూడా పెచ్చు వద్దని కౌత్సుడన్నాడు. అడిగినదానికంటే అధికంగా ఇస్తున్న దాతనూ, అవసరమైనదానికంటే ఎక్కువ వద్దంటున్న అర్థినీ అయోధ్యాపురవాసులందరూ ఎంతగానో అభినందించారు.

ఈ విధంగా సమర్పించిన ధనాన్ని నూర్లకొలది ఒంటెలమీదా, గోడిగలమీదా ఎక్కించి రఘువు మునిముందర నమ్రుడై నిలిచాడు. అందుకు ప్రీతిచెందిన కౌత్సుడు రాజును చేతితో నిమురుతూ ఇలా అన్నాడు –

"రాజా! నీవు రాచనడవడిని క్రమం తప్పక అనుసరిస్తున్నావు. అంచేత నీవు కోరిన అర్థాన్ని భూమి ప్రసవించడంలో ఆశ్చర్యం లేదు. ఆకసంగూడా నీ యిష్టార్థాన్ని పిదుకుతున్నదంటే నీ ప్రభావం ఊహించడానికే వీలు కావడం లేదు. సకల శ్రేయస్సంపన్నుడవైన నీకు మరొక శుభం చేకూరవలెనని ఆశీర్వదించడం అనవసరం. స్తవనీయుడవైన నిన్ను నీ తండ్రి కన్నట్లే నీవూ అనురూపుడూ, గుణవంతుడూ అయిన కుమారుణ్ణి పొందుదువుగాక!"

## అజమహారాజు

ఇలా కౌత్సుడు రఘువును ఆశీర్వదించి గురుని చెంతకు వెళ్లాడు. జీవలోకం సూర్యునినుండి వెలుగును పొందినట్లే రాజుకూడా అతని దీవనవల్ల శీఘ్రంగా సుపుత్రుణ్ణి కన్నాడు. ఒకనాటి బ్రహ్మముహూర్తాన పట్టపురాణి కుమారస్వామితో సమానుడైన కుమారుణ్ణి కనింది. అందుచేత రఘుమహారాజు బ్రహ్మకు మారుపేరైన అజశబ్దంతోనే కుమారుణ్ణి పిలిచాడు. దీపంనుండి పుట్టిన దీపం అన్నివిధాలా ఆ దీపాన్నే పోలివున్నట్లు కుమారుడు తేజోవంతమైన రూపంలోగాని, శౌర్యంలోగాని, సహజౌన్నత్యంలోగాని పూర్తిగా తండ్రినే పోలినాడు.

గురువులవద్ద సకల విద్యలూ నేర్చి యౌవనోదయంలో ఎంతో మనోహరుడైన అజునిపై తనకు కోరికవున్నా రాజ్యలక్ష్మి అతణ్ణి చేపట్టడానికి ధీరురాలైన కన్య తండ్రి అనుమతికై ప్రతీక్షించినట్లు రఘుమహారాజు అనుజ్ఞకై వేచివుండింది.

ఇది ఇలా వుండగా విదర్భరాజైన భోజుడు తన చెల్లెలు ఇందుమతికి స్వయంవరం ప్రకటించి అజుణ్ణి రప్పించడానికై ఆప్తుడైన దూతను రఘుమహారాజు వద్దకు పంపాడు. భోజరాజుతో తనకు వియ్యం అపేక్షణీయమనీ, కుమారునకు పెండ్లి యీడు వచ్చిందనీ భావించిన రఘుమహారాజు అజుణ్ణి సైన్యసమేతంగా సకలైశ్వర్య సంపన్నమైన విదర్భరాజధానికి పంపాడు.

అజమహారాజుకు మార్గమంతటా సకలోపచారాలతో కూడిన విడుదులు ఏర్పాటయ్యాయి. అక్కడ జానపదు లాయనకు పెక్కు కానుకలు సమర్పించారు. అంచేత అరణ్యంలో కూడా ఆయన బస చేసిన చోట్లు ఉద్యానవిహారస్థానాలుగానే ఉండినాయి. ఆయన చాలా దూరం పయనించేసరికి సైన్యం బాగా అలసిపోయింది. జెండాలన్నీ ధూళిధూసరితా లయ్యాయి. ఇంతలో నర్మదానది వారి కెదురయింది. నీటితుంపురులతో చల్లగా వీస్తున్న పిల్లగాలులు సోకి ఆ నదీతీరంలోని కానుగ చెట్లు నాట్యం చేస్తున్నట్లు కనిపించాయి. ఆ చోట అజుడు సైన్యాన్ని విడిది చేయించాడు.

## ప్రియంవద శాపవిమోచనం

ఆ నదిలో ఒకచోట నీటిపై తుమ్మెదలు గుంపుగా తిరుగాడుతున్నాయి. అందువల్ల ఆ నీళ్లలో ఒక మదగజం మునిగి వున్నదని తెలియవచ్చింది. పిమ్మట నీళ్లు మదజలాన్ని కడిగివేయటంవల్ల శుభ్రపడిన గోడలవంటి చెక్కిళ్లతో అడవియేనుగు నదిలోనుండి పైకి లేచింది. అది ఋక్షవత్పర్వతతటాలలో వప్రక్రీడ సలుపగా కోరలపై ఏర్పడిన గైరికాది



ధాతువుల గుర్తులు నీటి తాకిడికి కరిగిపోయాయి. అయినా ఆ కొండరాళ్ల తాకిడికి మొక్క వోయిన దంతాలూ, వాటిపై ఏర్పడ్డ నల్లని నిలువు గీతలూ దాని క్రీడను వ్యక్తం చేస్తూ వుండినాయి.

గజబంధనస్థానంలోని గడియప్రాకులను విరుస్తున్నదా అన్నట్లు మహావేగంగా తొండం ముడుచుకొంటూ, చాచుకొంటూ పెద్ద పెద్ద అలలను సశబ్దంగా పగులగొట్టూ ఆ యేనుగు నదీతీరంవైపు పయనించింది. అలా వస్తున్న కొండవంటి దాని శరీరవేగానికి ఏటిలోని నీళ్ళు ఉరవడిగా గట్టెక్కాయి. అంతట నాచుతీగల గుబుర్లను ఈడ్చుకొంటూ ఆ మత్తేభం తీరం చేరింది.

నీటిలో మునగడంవల్ల క్షణకాలం మదజలం ఆగిపోయిన ఆ ఏకాకి వనగజానికి అజుని సైన్యంలోని గ్రామ్యగజాలను చూడగానే మళ్ళీ గండస్థలంనుండి మదజలం స్రవించసాగింది. ఏడాకుల అరటిపాలవలె గుబాళిస్తున్న ఆ గజమదం సైన్యంలోని ఏనుగులకు సహింపరాని దయింది. ఆ మదం ఆఘ్రాణించి అవి మావటీంద్ర అదుపుతప్పి పెడమొగం పెట్టాయి. ఆ వనగజం ధాటికి తట్టుకోలేక గుఱ్ఱాలు కట్లు త్రెంచుకొని పారిపోయాయి. ఇరుసులు విరిగి రథాలు నేలగూలాయి. యోధులందరూ స్త్రీలను కాపాడటానికి తత్తరపడ్డారు. ఇలా సేనానివేశమంతా క్షణంలో అల్లకల్లోల మయింది.

అడవి యేనుగును చంపరాదన్న శాస్త్రవచనానుసారం మీదికి వస్తున్న గజాన్ని మరల్చటానికి అజమహారాజు అల్లెత్రాటిని మితంగా లాగి బాణంతో దాని కుంభస్థలాన్ని కొట్టాడు. దెబ్బ తగులగానే అది గజదేహం వదలి సైనికులు విస్తుపోయి చూస్తుండగా ధగధగలాడుతున్న కాంతిపుంజంతో ఆకాశగమనం కల మనోజ్ఞమైన దివ్యశరీరం ధరించింది. ఆపై తన ప్రభావంవల్ల ప్రాప్తించిన కల్పతరుకుసుమాలను రాకుమారునిపై చల్లి

దంతకాంతులతో ఎదలోని ముక్తాహారాల కాంతి నినుమడింప జేస్తూ మాట నేర్పరి అయిన ఆ దివ్యపురుషుడు ఇలా అన్నాడు –

"నేను ప్రియదర్శనుడనే గంధర్వరాజు కుమారుణ్ణి. నన్ను ప్రియంవదు డంటారు. నా గర్వానికి కోపించి మతంగమహర్షి ఏనుగవు కమ్మని నన్ను శపించాడు. పిమ్మట నేను ప్రణమిల్లి వేడుకోగా శాంతించి ఆ మహర్షి నాపై సహజమైన కనికరం చూపాడు. నీటికి నిప్పువల్లా, ఎండవల్లా వేడి కలుగుతుంది. అసలు దాని సహజస్వభావం చల్లదనమే కదా!

"ఇక్ష్వాకు వంశజుడైన అజుడు బాణంతో ఎప్పుడు నీ కుంభస్థలాన్ని చీలుస్తాడో, అప్పుడు ప్రభావ సంపన్నమైన నీ శరీరం నీకు తిరిగి వస్తుంది" అని చెప్పి ఆ తపోనిధి నన్ను అనుగ్రహించాడు. నేను చిరకాలంనుండి నీ దర్శనంకోసం ఎదురుచూస్తున్నాను. సత్త్వ సంపన్నుడవైన నీవు ఇప్పుడు నన్ను శాపంనుండి విముక్తుణ్ణి చేశావు. ఇందుకు తగిన ప్రత్యుపకారం నేను నీకు చేయకపోతే పూర్వస్థితి నాకు లభించడం వ్యర్థమే కదా!

మిత్రమా! నావద్ద 'సమ్మోహనం' అనే గంధర్వదేవతాకమైన అస్త్రం ఉంది. దాన్ని ప్రయోగించడానికీ, ఉపసంహరించడానికీ వినియోగపడే మంత్రా లున్నాయి. అది ప్రయోగించే వాడికి శత్రుహింస కలుగదు సరికదా, విజయం హస్తగతమై తీరుతుంది. అది నీకిస్తాను. పరిగ్రహించు, నన్ను కొట్టినందుకు నీవు సిగ్గుపడవద్దు. కొడుతూ గూడా నాపై ఒకించుక దయ చూపావు. నీ దెబ్బవల్ల నాకు మహోపకారమే జరిగింది. అందుచే నా ప్రార్థనను తిరస్కరించే పారుష్యం చూపవద్దు".

అస్త్రజ్ఞుడూ, పురుషశ్రేష్ఠుడూ అయిన అజమహారాజు అందుకంగీకరించి పవిత్రమైన నర్మదా జలంతో ఆచమనం చేశాడు. పిమ్మట ఉత్తరాభిముఖుడై శాపవిముక్తుడైన గంధర్వుని వలన సమ్మోహనాస్త్రాన్ని సమంత్రకంగా స్వీకరించాడు. ఇలా దైవయోగాన దారిలో వారిద్దరికీ కారణ



మూహింపరాని చెలిమి కలిగింది. పిమ్మట వారిలో ఒకడు కుబేరుని ఉద్యానమైన చైత్రరథానికి పోయాడు. మరొకడు మంచిరాజు ఏలుబడితో మనోజ్ఞమైన విదర్భదేశానికి వెళ్ళాడు.

అజమహారాజు నగరం పొలిమేరలో వచ్చి నిలువగానే అతని రాకకు ఎంతో హర్షించిన విదర్భరాజు అలలతో ఉప్పొంగే సముద్రుడు చంద్రుడి కెదురేగినట్లు అతని కెదురుగా వెళ్ళాడు. అలా వెళ్ళి వినయపూర్వకంగా అజుణ్ణి ఆహ్వానించి తాను ముందు నడుస్తూ పురప్రవేశం చేయించాడు. అతనికి పలు కానుక లర్పించి వివిధోపచారాలు చేశాడు. పట్టణం చేరిన జనులు ఆ ఉపచార పద్ధతులన్నీ చూచి అజుడే ఇంటి యజమానుడనీ, భోజుడే అతిథి అనీ భావించారు.

విదర్భరాజు నియోగించిన అధికారులు రఘుమహారాజుతో సమానుడైన అజమహారాజుకు నమస్కరించి తూర్పువాకిటి అరుగు మీద మంగళపూర్ణకలశం నిలిపిన విడిది యిల్లు చూపారు. మదనుడు యౌవనాన్ని ప్రాప్తించినట్లు అజుడు మనోజ్ఞమైన ఆ రాజభవనాన్ని అధిష్ఠించాడు.

అనేక దేశాలనుండి పలువురు రాజులు ఇందుమతీ స్వయంవరంలో పాల్గొనడానికి కరుదెంచారు. అజుడు కమనీయమైన ఆ కన్యారత్నాన్ని తనదానిగా చేసుకోగోరి ఆ తలంపులతోనే ఆ రాత్రి శయనించాడు. ప్రియుని తమకం తెలియనేరని ప్రేయసిలాగా చాలా సేపటికి గాని అతని కంటికి నిద్ర రాలేదు. బలిసివున్న అతని అంసతలంమీద తెల్లవారేసరికి కర్ణకుండలాలు ఒత్తుకొన్న గుర్తు లేర్పడ్డాయి. పాన్పుమీది వలువ ఒరపిడికి మైపూత చాలావరకూ రాలిపోయింది. ఆ ప్రజ్ఞావంతుణ్ణి ఉషఃకాలంలో సమవయస్కులూ, ప్రౌఢవచస్కులూ అయిన వైతాళికులు ఈ విధమైన స్తుతిపాఠాలతో మేల్కొలిపారు –

"బుద్ధిమంతులలో శ్రేష్ఠుడవైన ఓ అజమహారాజా! ఇదిగో తెల్లవారింది. పాన్పునుండి లెమ్ము! బ్రహ్మదేవుడు భూభారాన్ని మీ యిరువురికొరకై రెండు

సమభాగాలుగా విభజించాడు. అందులో ఒకభాగాన్ని మీ తండ్రి జాగరూకుడై వహిస్తున్నాడు. తక్కిన భాగాన్ని నీవు మోయవలసి వుంది. కాబట్టి మేలుకో! నీవు నిద్రాదేవి కధీనుడవు కావడంవల్ల లక్ష్మి నీపై యీసు వహించింది. ఖండిత నాయికలాగా ఆమె నీమీద అనురక్తి నుపేక్షించి నీవదనంతో పోలికగల చంద్రుడితోకూడి ఇప్పటిదాకా వినోదించింది. ఇప్పు డాచంద్రుడు కూడా పడమటి దిక్కుచేరి నీముఖకాంతిని కోల్పోయాడు.

ఇప్పుడే తమ్మిలోపల తుమ్మెద కదలుతున్నది. నీకంటిలోని కనుగ్రుడ్డుకూడా చలిస్తున్నది. ఇవిరెండూ ఒకేసారి వికాసం పొంది పరస్పర సామ్యానికి సమగ్రతను సమకూర్చుకొనుగాక! సహజసిద్ధమైన నీనిట్టూర్పు తావిని తాను కృత్రిమంగా ఇతర పదార్థాలనుండి సంపాదించుకొనగోరినదా అన్నట్లు ప్రభాతవాయువు చెట్ల తొడిమలనుండి సడలిన పూలను హరిస్తున్నది. ప్రొద్దుపొడుపున వికసించిన పద్మాలతో కలుస్తున్నది. పులు కడిగిన ముత్తెపు పూసలలాగా స్వచ్ఛమైన మంచునీరు చెట్ల చివుళ్ల ఎరుపైన లోపలిభాగంలో పడి ఉత్కర్ష పొంది దంతకాంతితో కూడి నీకెమ్మోవిపై నెలకొన్న చిరునవ్వులా విలసిల్లుతున్నది.

తేజోనిధి అయిన సూర్యుడు ఉదయించకముందే అనూరుడు చీకటి తొలగించాడు. కదనరంగంలో వీరుడవైన నీవు ముందుకు వెళ్ళుతూ వుంటే శత్రువులను మీతండ్రి తానుగా హతమారుస్తాడా? ఇరువైపులా పరుండి రాత్రి నిద్ర తీర్చుకొన్న నీయేనుగులు గలగలమనే గొలుసుల నీడ్చుకొంటూ పడక విడుస్తున్నాయి. బాలభానుని ఎఱ్ఱని కాంతి సోకిన వాటికోఱమొగ్గలు మనశ్శిలాది ధాతువులతోడి కొండగట్లతో గోరాడినవిలా ప్రకాశిస్తున్నాయి.

“పద్మాక్షుడా! పొడవైన గుడారపు సాలల్లో కట్టివేసిన వనాయుదేశపు గుఱ్ఱాలు నిద్రవీడి తమముందున్న సైంధవలవణ శకలాలను నోటివేడితో మలినం చేస్తున్నాయి. పూలు వాడిపోవడంవల్ల పూజామాలల కూర్పు సడలిపోయింది. దీపాలు క్రమంగా వెలవెల బారుతున్నాయి. నిన్ను



మేల్కొల్పడానికై మేము పాడుతున్న పాటలను మధురస్వరంతో ఈ నీ పంజరపు చిలక మాతో కలిసి పాడుతున్నది.”

పై విధంగా వైతాళికులు కావించిన స్తుతులకు వెంటనే నిద్ర మేల్కొని రాయంచల మదమధుర కూజితాలకు మేల్కొని సుప్రతీకమనే దిగ్గజం గాంగసైకతవేదికను వదలినట్లు రాకుమారుడు పాన్పు వదిలాడు. తర్వాత శాస్త్రోక్తమైన ప్రాతఃకాలానుష్ఠానం పూర్తి చేసుకొని నేర్పరులు కావించిన అనుకూలవేషంతో స్వయంవర మండపంలో ఉన్న రాజసమాజం చెంతకు వెళ్ళాడు.

* * *

## 6

# ఇందుమతీ స్వయంవరం

అజుడు స్వయంవరమండపానికి వచ్చేసరికి భూమండలంలోని రాజులందరూ అక్కడ చేరివున్నారు. అందంగా అలంకరించుకొని సమస్త రాజోపచారా లందుకొంటూ విహాయసంలో విమానాలపై సంచరించే దేవతలలాగా మంచెలమీది గద్దెలపై కూర్చొని వున్న ఆ భూపాలకుల నందరినీ అతడు చూచాడు.

రతీదేవి మొఱ ఆలకించి శివుడు మళ్ళీ మన్మథుడికి శరీరాన్ని ప్రసాదించాడా అన్నట్లు ప్రకాశిస్తున్న అజమహారాజును అవలోకించగానే ఆ రాకుమారులు ఇందుమతిపై ఆశ వదలుకొన్నారు. రాళ్లమీదుగా గిరిశిఖరమెక్కే సింగపు కొదమలాగా అజుడు మెట్లమీదుగా భోజరాజు చూపిన మంచె నధిష్ఠించాడు. అక్కడ రంగురంగుల కంబళ్లు పఱచివున్న రత్నఖచిత సింహాసనంపై కూర్చున్నప్పుడు అతడు నెమలి వీపుమీద నెలకొన్న కుమారస్వామిలాగా వెలిగాడు.

బారులు తీరివున్న భూపాల పుత్రులలో మేఘపంక్తులలోని మెఱుపుతీవలాగా వేయివిధాలుగా సంక్రమించిన కాంతి కళ్లకు మిరుమిట్లు గొలుపుతూ చూడ శక్యంగాని విధంగా ప్రకాశించింది. ఉజ్జ్వలంగా అలంకరించుకొని మేలి గద్దెలపై ఆసీనులైన నృపనందనుల నడుమ కల్పవృక్షాలమధ్య పారిజాతం మాదిరి అజు డొక్కడే మహాతేజస్సుతో వెలిగిపోయాడు. పూలచెట్లను వదలి తుమ్మెదలు మదించిన వనగజంమీద వాలినట్లే జనుల చూపులన్నీ ఆ రాజపుత్రులను వదలి అతనిపై వాలాయి.

అప్పుడు స్తుతిపాఠకులు సూర్యచంద్రవంశజులైన మహీపతుల నందరినీ స్తుతించారు. అగరుధూపం అంతటా వ్యాపించి చివరికి పతాకల మీదికి కూడా ఎగబ్రాకింది. శంఖనాదాలూ, మంగళవాద్యాల మ్రోతలూ మిన్ను



ముట్టాయి. ఆ ధ్వని విన్న నగరోద్యానంలోని నెమళ్లు ఉఱుము లన్న భ్రమతో నాట్యమాడసాగాయి.

ఇంతలో ఇందుమతి పెండ్లికూతురు వేషంతో పల్లకి నెక్కి వచ్చి పరిజనులు వెంట రాగా మంచెల మధ్యనున్న రాజవీథిని ప్రవేశించింది.

బ్రహ్మసృష్టిలో అపూర్వమై కనులపండువు గావిస్తున్న ఆ కన్యమీదనే రాజులందరి మనసులూ వ్రాలాయి. వాళ్ల శరీరాలు మాత్రమే ఆసనాలపై వుండిపోయాయి. ఇందుమతిపై అభిలాషగల ఆ రాజపుత్రులకు చెట్లకు చివుళ్లు అంకురించినట్లు ప్రణయదూతికలను బోలిన పెక్కు శృంగారచేష్టలు కలిగాయి.

ఒక భూపాలుడు లీలాకమలనాళం చేతులతో పట్టుకొని ఆ తమ్మిరేకులు తుమ్మెదలకు తగిలేటట్లుగానూ, పుప్పొడి గుడికట్టేటట్లుగానూ గిరగిర త్రిప్పాడు. మరొక విలాసశాలి భుజంపైనుండి జారి రత్నాలు చెక్కిన భుజకీర్తి కొనకు తగులుకొన్న హారాన్ని ముఖం అడ్డంగా త్రిప్పుతూ సవరించుకొన్నాడు. ఇంకొకడు చూపు కాస్త క్రిందికి వాల్చి నఖకాంతులు ప్రసరిస్తుండగా వంచిన కాలి కొనవ్రేళ్ళతో బంగారుపీఠాన్ని గీరాడు. మరొకడు గద్దెపై ఒక ప్రక్క ఎడమభుజం వూనుకొని ఎగుభుజం కలవాడై వెన్నుపై కంఠహారం జీరాడుతూ వుండగా ప్రక్కనేవున్న మిత్రుడితో ముచ్చట లాడసాగాడు. మరొక యువకుడు విలాసినులు చెవికమ్మగా ధరించే తెల్లని మొగలిరేకును కాంతానితంబాలపై అలవాటుపడ్డ తన కొనగోళ్లతో చీల్చాడు. మరొకడు ధ్వజరేఖలు గల్గి నూరురేకుల తామరలాగా ఎఱ్ఱనైన అరచేతితో రత్నపుటుంగరాల కాంతి ప్రసరిస్తుండగా పాచికలను విలాసంగా ఎత్తివేశాడు.

ఇంకొకడు తన తలమీది రత్నకిరీటం సరిగానే వున్నా జారిపోయినదాన్ని సవరించుకొన్నట్లుగా మణికాంతులు వ్రేళ్ల మధ్య ప్రసరిస్తుండగా చేతితో సవరించుకొన్నాడు.

పిమ్మట ఆ రాజుల చరిత్రలూ, వంశక్రమమూ తెలుసుకొన్నదీ, మాట నేర్పరీ అయిన సునంద అనే ద్వారపాలిక ఇందుమతిని మొదట మగధరాజు వద్దకు తీసుకువెళ్లి మగవానిలా గంభీరంగా ఇలా చెప్పింది –

"ఈ రాజు శరణు జొచ్చిన వాళ్లను కాపాడటంలో నిపుణుడు, మహాగంభీరస్వభావుడు, మగధదేశానికి అధిపతి, ప్రజలను రంజింప జేసి కీర్తిమంతుడైనాడు, శత్రువులను మాడ్చివేయడంవల్ల 'పరంతపు'డనే ఇతని పేరు సార్థకమయింది.

లోకంలో ఎంతమంది రాజులుంటేనేమి? ఈయన ఒక్కడివల్లనే భూమికి 'రాజన్వతి' (మంచిరాజు ఏలుబడిలో నున్నది) అనే పేరు వచ్చింది. వేలకొలది నక్షత్ర తారాగ్రహాలున్నా చంద్రు డొక్కడివల్లనే కదా రాత్రి 'జ్యోతిష్మతి' అవుతున్నది! ఈ మహారాజు ఎప్పుడూ యజ్ఞాలు చేస్తూ దేవేంద్రుణ్ణి ఆహ్వానిస్తూ వుంటాడు. అందువల్ల స్వర్గలోకంలోని శచీదేవికి చిరకాలం భర్తృవిరహబాధ తప్పడం లేదు. వరణీయుడైన ఈ నరవరుణ్ణి నీవు వరించావంటే పాటలీపురంలోని రాజభవనాల కిటికీలనుండి అంగనామణు లందరూ నిన్ను కన్నులపండువుగా కాంచి ఆనందిస్తారు."

సునంద ఇలా చెప్పేసరికి చేతిలోని పూలమాల కొంచెం జారుతూ వుండగా ఇందుమతి ఆ రాజుకు మౌనంగా వట్టి నమస్కారం చేసి అతణ్ణి పరిహరించింది. ఆమె అభిప్రాయం గ్రహించిన సునంద గాలికి రేగిన అలల వరుస మానస సరస్సులోని రాజహంసిని మరొక పద్మం వద్దకు చేర్చినట్లు ఇంకొక రాజువద్దకు తీసుకుపోయింది.

ఆమె మళ్ళీ ఇందుమతితో ఇలా అన్నది –

"ఈయన అంగదేశపురాజు. ఇంద్రుడికి సహాయపడటానికి స్వర్గలోకానికి వెళ్లినప్పుడు అక్కడి అప్సరసలు ఈయన జవ్వనపు సొంపు చూచి మరులు గొన్నారు. గజశాస్త్రకారులయిన సురమహర్షులే ఇతని



యేనుగులకు శిక్షణ యిచ్చేవారు. ఇలా ఈ మహారాజు భూలోకంలో వున్నా ఇంద్రైశ్వర్యం అనుభవిస్తున్నాడు. విగతభర్తృక లయిన ఇతని శత్రుభార్యలు జాలువార్చిన ముత్యాలవంటి పెద్ద పెద్ద కన్నీటిబొట్లు వాళ్ళ ఉరోజాలపై దారాలులేని హారాలా అన్నట్లు భాసించాయి. సహజంగా ఒకచోట కలిసి ఉండని లక్ష్మీసరస్వతు లిద్దరూ ఈ అంగరాజువద్ద విరోధం మాని ఏకంగా వున్నారు. కల్యాణీ! అందంతో అటు లక్ష్మికీ, సత్యవచనంతో ఇటు శారదకూ తగిన నెచ్చెలివైన నీవే ఈ నృపుని వద్ద మూడవదానివిగా ఉండటానికి యోగ్యురాలవు."

అంతట ఇందుమతి అంగరాజునుండి చూపు మరల్చి సునందను ముందుకు సాగమని హెచ్చరించింది. అతడు వరణీయుడు కాకపోలేదు. ఆమె వివేకదృష్టి లేనిదీ కాదు. అయినా లోకుల అభిరుచులు భిన్నభిన్నంగా వుంటాయి కదా!

పిమ్మట సునంద శత్రువులకు సహింపరానివాడూ, మిక్కిలి దర్శనీయుడూ అయిన మరొక రాజును అప్పుడే ఉదయిస్తున్న చంద్రునిలా ఇందుమతికి చూపుతూ ఈ విధంగా చెప్పింది –

"నిడుదలైన చేతులూ, వెడద ఱొమ్మూ, సన్నపాటి గుండ్రని నడుమూ కల యీతడు అవంతి దేశానికి భర్త. విశ్వకర్మచే సానబెట్టబడిన సూర్యునిలా ఇతడు ప్రకాశిస్తున్నాడు. సమగ్రశక్తి సంపన్నుడైన ఈ నృపాలుడు జైత్రయాత్రలు చేసేటప్పుడు సేనకు ముందు నడిచే గుర్రాలు రేపిన ధూళి శత్రురాజుల సిగలోని మాణిక్యాల వెలుగును అస్తమింపజేస్తుంది.

ఈ అవంతిదేశాధీశుడు మహాకాళక్షేత్రంలో నివసించే చంద్రమౌళికి సమీపంలోనే వున్నాడు. కనుక కృష్ణపక్షంలో గూడా ఇతడు కాంతాసమేతుడై వెన్నెలరేలను అనుభవిస్తూ వుంటాడు. సుందరీ! యువకుడైన ఈ రాజుతో గూడి శిప్రానది అలలమీది గాలికి కదిలే ఉద్యానవనశ్రేణులలో విహరించాలని అభిలషిస్తున్నావా?"

తామరలను వికసింప జేసేవాడూ, బురదను శుష్కింప జేసేవాడూ అయిన సూర్యునిపై తెల్లగలువతీగకు అభిలాష కలుగనట్లే మిత్రరంజకుడూ, శత్రుభంజకుడూ అయిన అవంతిరాజుపై ఆ కోమలాంగికి మనసు పోలేదు.

కమలోదరకాంతివంటి కాంతి గలదీ, రూపశీలాది గుణసంపన్నురాలూ, విధాతృని సుందరసృష్టి అయిన ఆ సుదతీమణిని అనూపరాజు ముందట నిలిపి సునంద ఇలా అన్నది –

"యుద్ధంలో వేయిచేతులతో విజృంభించేవాడూ, పదునెనిమిది దీవులలో యాగాలు చేసినవాడూ, సకల ప్రాణులను రంజింపజేయడంవల్లనే ఇతరుల కన్వయించని రాజశబ్దం పొందినవాడూ, బ్రహ్మవిద్యాసంపన్నుడూ అయిన కార్తవీర్యుడు అనే భూపాలుడు ఉండేవాడు గదా! ప్రజల్లో ఎవరైనా తప్పు చేయాలి అని అనుకొంటే చాలు. వెంటనే ఆ మహీపతి వాళ్ళ కట్టెదుట ధనుర్ధారియై సాక్షాత్కరించి వారి తలంపులను రూపుమాపేవాడు. ఇంద్రవిజేత అయిన రావణాసురుణ్ణి ఆ కార్తవీర్యుడు అల్లెత్రాటితో పెడరెక్కలు విరిచికట్టి చెరసాలలో పడవేశాడు. పదితలలతో బుసకొడుతూ లంకేశ్వరుడు ఆ రాజుకు అనుగ్రహం కలిగేటంతవరకూ అక్కడే పడివుండినాడు.

ఈ రాజు ఆ కార్తవీర్యార్జునుని వంశంలో పుట్టాడు. ఈయనపేరు ప్రతీపుడు. శాస్త్రవేత్తలయిన పెద్దలను ఇతడు సేవిస్తూ వుంటాడు. ఏ విధమైన దుర్వ్యసనాలూ ఇతనికి లేవు. అందువల్ల సిరి ఇతణ్ణి ఎప్పుడూ ఎడబాయక సేవిస్తూ 'సహజచపల' అనే అపకీర్తిని పోగొట్టుకొన్నది. యుద్ధంలో అగ్నిదేవుడు ఈ ప్రతీప మహారాజుకు తోడ్పడి విరోధులను దహించివేస్తాడు. అంచేత వాడియైన పరశురాముని కుఠారధారను ఇతడు కలువరేకులా పేలవమైనదిగా భావిస్తాడు. మాహిష్మతీనగరం ఈ రాజశేఖరునికి రాజధాని. ఆ పురలక్ష్మియొక్క ప్రాకారమనే నితంబానికి ఒడ్డాణంలా రేవానది చెంతనే ప్రవహిస్తూ వుంటుంది. అక్కడి మేడల గవాక్షాల నుండి ఆ నదీప్రవాహాన్ని చూడాలని నీకు కోరిక వుంటే ఆజానుబాహుడైన ఈ భూవల్లభుని వరించు."



శరదృతువులో మేఘావరణం తొలగిన పూర్ణచంద్రుడు తామరతీగకు నచ్చని విధంగానే ఎంతో అందగాడైనా ఆ నరపాలుడు ఇందుమతికి నచ్చలేదు.

లోకాంతరాలకు వ్యాపించిన కీర్తిగలవాడూ, ఆచారంతో పవిత్రమైన ఉభయవంశాలనూ దీపింపజేసినవాడూ, శూరసేన దేశానికి అధిపతీ అయిన సుషేణుడనే రాజును ఆ పిదప ఇందుమతికి చూపి ద్వారపాలిక ఇలా పలికింది –

"ఈ రాజు నీప వంశంలో జన్మించాడు. విధ్యుక్తంగా ఎన్నో యజ్ఞాలు చేశాడు. అన్యోన్యవిరోధులైన జంతువులు ప్రశాంతమైన తపోనిధుల ఆశ్రమంలో వైరం మాని ఒద్దికగా వున్నట్లే జ్ఞానం, మౌనం మొదలైన పరస్పర విరుద్ధగుణాలు ఇతణ్ణి ఆశ్రయించి తమ సహజవిద్వేషం వదలిపెట్టాయి. ఈ భూపాలుని శోభ తనవారికి చంద్రకాంతిలాగా కన్నులపండువు కాగా, ప్రచండమైన ఈతని పరాక్రమం శత్రురాజుల శూన్యనగరాలలో భరింపరానిదై మండుతున్నది. ఇతడు జలక్రీడ లాడేటప్పుడు అంతఃపురకాంతల స్తనచందనం కరిగి నీటిలో కలిసిపోవడంవల్ల తెల్లబడిన యమునానది మధురానగరంలోనే గంగానదితో సంగమించిందా అన్నట్లు కనిపిస్తున్నది.

పూర్వం గరుత్మంతుడికి భయపడి పారిపోయిన కాళియుడు మధురాపుర పాలకుల అనుమతితో యమునాప్రవాహంలో తలదాచుకొన్నాడు. అభయ మిచ్చిన ఈతని పూర్వులకు కృతజ్ఞతా సూచకంగా ఒక మణిని అతడు సమర్పించుకొన్నాడు. మహోజ్జ్వలమై వక్షఃస్థలంలో కాంతు లీనుతున్న ఆ మణిని ధరించిన ఈ సుషేణుడు కౌస్తుభధారి అయిన కృష్ణమూర్తిని సిగ్గిలజేయు నట్లున్నాడు. సుందరీ! ఎలప్రాయంలోవున్న ఈ రాజును చేపట్టి కుబేరుని ఉద్యానంతో దీటైన బృందావనంలో మెత్తని చివుళ్ళు పరచిన పూబాన్పుమీద యౌవన ఫలాన్ని అనుభవించు. అంతేకాదు, వర్షాకాలంలో నీటిచుక్కలు పడటంవల్ల శిలాజిత్తు తావి యీనుతున్న రాతిబండపై కూర్చొని అందమైన గోవర్ధనగిరి గుహల్లో నృత్యం చేసే నెమళ్ళను చూడు."

సముద్రంవైపు పయనించే నది మార్గమధ్యంలో వచ్చిన కొండను ఎలా తప్పుకొని పోతుందో, అలాగే నీటి సుడిలా అందమైన పొక్కిలి గల యిందుమతి మరొకని భార్య కానున్నదై ఆ సుషేణమహారాజును దాటుకొని వెళ్లింది.

పిమ్మట సునంద కేయూరాలు ధరించినవాడూ, శత్రువులను నురుమాడినవాడూ, కళింగదేశాధీశ్వరుడూ అయిన హేమాంగదుడనే క్షితిపతిని సమీపించిన ఆ పూర్ణచంద్రముఖితో ఇలా అన్నది –

"ఈ రాజు మహేంద్రగిరితో సమానమైన బలం కలవాడు. ఇతనికి మహేంద్రమే గిరిదుర్గం; మహాసముద్రమే జలదుర్గం. ఇతడు జైత్రయాత్రలు చేసేటప్పుడు ముందు నడిచే సేనాగజ సమూహాన్ని చూస్తే మహేంద్రపర్వతమే ముందు నడుస్తున్నదా అనిపిస్తుంది. విలుకాండ్రలో శ్రేష్ఠుడయిన ఈ బాహుశాలి సవ్యసాచి, అందువల్ల ఈయన రెండు బాహువులమీద ఏర్పడ్డ అల్లెత్రాటిదెబ్బల నల్లగీరలు ఇతడు బలాత్కరించి బందీలుగా పట్టుకొని తెచ్చిన శత్రులక్ష్ముల కాటుక కన్నీటి దారులా అన్నట్లున్నాయి. ఈ భూపాలుని గృహగవాక్షాలనుండి అలలు కనిపించు నంతటి చేరువలోనే సాగరు దున్నాడు. అతడు గంభీరమైన తరంగ ఘోషలతో జాముజామునా మ్రోగే తూర్యధ్వనులతో పనిలేకుండా ఆయనను అనునిత్యమూ నిద్రనుండి మేల్కొలుపుతూ వుంటాడు. ద్వీపాంతరాలనుండి లవంగ కుసుమాలను మోసుకువచ్చే తెమ్మెరలతో నీ చెమట తడి ఆర్చుకొంటూ తాటితోపుల మర్మరధ్వనితో గూడిన అక్కడి సముద్రతీరాలలో ఈ రాకుమారునితో కలిసి హాయిగా విహరించు."

అందాన్ని అభినందించే ఇందుమతి సునంద అలా తన్ను ప్రోత్సహించి నప్పటికీ ప్రయత్నంతో దవ్వులనుండి కొనివచ్చిన సిరి పుణ్యహీనుడికి దూరమైనట్లు ఆ హేమాంగదుణ్ణి వరించకనే ఆవలికి వెళ్లిపోయింది.



పిమ్మట సునంద దేవసమానుడైన నాగపురాధీశ్వరుణ్ణి సమీపించి "చకోరాక్షీ! ఇటు చూడు" మంటూ ఇందుమతిని హెచ్చరించి ఇలా నుడివింది–

"అంసతలంనుండి హారాలు వ్రేలాడుతూ వుండగా హరిచందనం అంగరాగంగా అలదుకొన్న ఈ పాండ్యరాజు లేత యెండతో ఎఱ్ఱబడ్డ చరియలు గలిగి సెలయేళ్ళ జాలులతో విలసిల్లే పర్వతరాజంలా ప్రకాశిస్తున్నాడు. వింధ్యమహాపర్వతాన్ని స్తంభింపజేసినవాడూ, సముద్రపు నీటినంతా త్రాగి ఉమిసినవాడూ ఐన అగస్త్యమహర్షి అశ్వమేధావభృథం పూర్తి కాగానే ఈ నరపాలుణ్ణి నీకు సుఖంగా స్నానం అయినదా! అని ప్రశ్నిస్తూ వుంటాడు.

పూర్వం ఇంద్రుణ్ణి జయించాలన్న ఉద్దేశంతో స్వర్గంమీదికి దండెత్తిన రావణాసురుడు దుర్లభమైన బ్రహ్మశిరో నామకాస్త్రాన్ని శివునినుండి పొందిన ఈ పాండ్యరాజు ఎక్కడ జనస్థానాన్ని ఆక్రమిస్తాడో అని జంకి ఇతనితో సంధి చేసుకొన్నాడు. రాకుమారీ! మేటివంశానికి చెందిన ఈ మహారాజును యథావిధిగా పెండ్లాడి నీవు గొప్పదయిన భూదేవిలాగా రత్నాకరమే ఒడ్డాణముగా గల దక్షిణదిక్కుకు సవతివి కమ్ము. తములపు తీగలు చుట్టుకొన్న పోకచెట్లు, ఏలకి తీగ లల్లుకొన్న గంధపుమ్రాకులు, తమాలపత్రపు పఱపులు గల అక్కడి మలయపర్వత స్థలాలలో తఱచుగా క్రీడించటానికి సమ్మతించు. ఈ రాజు నల్లగలువవలె చామనచాయవాడు. నీవు గోరోచనంలా పచ్చనిదానవు. మీ యిరువురి కలయిక మేఘము, మెఱుపు కలయిక లాగా పరస్పరశోభను ఇనుమడింపజేస్తుంది."

సూర్యదర్శనం లేకపోవడంవల్ల ముడుచుకొన్న పద్మంలోకి చంద్రకిరణం ప్రవేశించనట్లే సునంద చేసిన ఉపదేశం ఇందుమతి మనస్సులో దూరలేదు.

దీపజ్వాల రాజవీథిలో ముందుకు సాగిపోతున్నప్పుడు వెనుకబడిన కోటబురుజు చీకటిలో మునిగినట్లే స్వయంవరమండపంలో ఇందుమతి ఏయే రాజును దాటివెళ్లిందో ఆ రాజు తన ముఖవికాసం కోల్పోయాడు.

అజమహారాజు కూడా ఇందుమతి తన చెంతకు రాగానే తన్నామె వరిస్తుందో లేదో అని సంశయించాడు. ఇంతలో శుభసూచకంగా కేయూరబంధానికి నెలవైన కుడిభుజం అదిరేసరికి ఆయన సంశయం తొలగిపోయింది.

సర్వావయవ శోభితు డయిన అజుణ్ణి సమీపించి ఇందుమతి మరొకని వద్దకు వెళ్లాలనే తలంపు వదలుకొన్నది. నిండారా వికసించిన తియ్య మామిడిచెట్టును చేరిన తుమ్మెదల బారు మరొక చెట్టును కోరదుగదా! చంద్రుని వంటి కాంతిగలదీ, అజునిపై మనసుంచినదీ అయిన ఇందుమతిని చూచి మాటల పొందిక తెలిసిన సునంద ఇలా అన్నది –

"పూర్వం ఇక్ష్వాకువంశంలో మహాగుణవంతు డయిన 'కకుత్థ్సుడు' అనే రాజశ్రేష్ఠుడొక డుండేవాడు. ఆయన సంతతికి చెందిన ఉత్తర కోసల రాజులందరూ ఔన్నత్యం కోరి సుప్రసిద్ధమైన కాకుత్థ్సనామం వహిస్తున్నారు. నందివాహను డయిన శివునిలా ఆ కకుత్థ్సుడు ఆబోతురూపం దాల్చిన మహేంద్రుణ్ణి అధిష్ఠించి శరప్రయోగంతో అసురాంగనల చెక్కిళ్ళమీది మకరికాపత్రాలను చెఱిపివేశాడు. అంతేకాదు, ఆయన ఐరావత గజాస్ఫాలనం వల్ల సడలిన బాహుపురి గలవాడూ, నిజరూపధారీ అయిన దేవేంద్రుని బాహుపురితో తన బాహుపురిని ఒరసికొంటూ అతని అర్ధాసనం అధిష్ఠించాడు.

ఆ కకుత్థ్సునివంశంలో గొప్ప కీర్తిమంతుడూ, కులదీపకుడూ అయిన దిలీపుడనే మహారాజు జన్మించాడు. ఆ నరేంద్రుడు తొంబై తొమ్మిది యాగాలు చేసి నూరవ యాగాన్ని ఇంద్రుని ప్రీతికొఱకై మానివేశాడు. ఆ ధర్మాత్ముని పరిపాలనలో విహారార్థం వెళుతూ నడిదారిలో కైపెక్కి నిద్రించిన చెలువల వలువలను గాలికూడా కదిలించేది కాదు. ఇక అతని యేలుబడిలో దొంగతనానికి పాల్పడేవా డెవడు?



ఇప్పుడు ఆ దిలీపుని రాజ్యాన్ని అతని కుమారుడయిన రఘుమహారాజు ఏలుతున్నాడు. నేలనాలుగు చెరగులనుండీ తెచ్చిన ధనరాసులన్నీ ఆయన విశ్వజిద్యాగంలో దక్షిణగా సమర్పించి మట్టిముంతతో మిగిలిపోయాడు. అనంతమయిన ఆ రఘుమహారాజు కీర్తి కొండలెక్కింది. సముద్రాలు దాటింది. పాతాళం ప్రవేశించింది. ఊర్ధ్వలోకాలకు ఎగబ్రాకింది. అది యీ పాటిదని చెప్ప శక్యం కాదు.

దేవేంద్రునికి జయంతునిలా ఆ రఘుమహారాజుకు ఈ అజమహారాజనే కుమారుడు జన్మించాడు. ఈయన ఇంకా శిక్షణ అందుకొనే దశలోనే ఉన్నా తండ్రితోపాటు తానుగూడా మహాభూభారం వహిస్తున్నాడు. కులం, రూపం, నవయౌవనం, వినయాది సకలగుణాలు, ఇన్నిటితో నీకు అన్ని విధాలా తగిన ఈ రాకుమారుణ్ణి వరించు. రత్నం సువర్ణంతో జతగూడి వెలుగొందు గాక!"

సునంద మాటలు పూర్తి కాగానే ఇందుమతి సిగ్గు కొంచెం తొలగించుకొని స్వయంవర మాలికతో వలె ప్రసాదనిర్మలమైన దృష్టితో ఆ రాకుమారుణ్ణి అంగీకరించింది. ఆమె ఆ తరుణునిపై తనకు గల అనురాగాన్ని దిట్ట కానందువల్ల చెప్పలేకపోయింది. అయినా ఆ ప్రేమ పులకలమిషతో ఆ కుటిలకుంతల శరీరంనుండి వెలికి వచ్చింది.

ఇందుమతి అలా అయ్యేసరికి ఆమె వాలకం గమనించిన సునంద ఎగతాళిగా "అమ్మా! మరొక రాజుచెంతకు పోదాం, పద" అని అన్నది. అందుకామె సునందను అసూయతో కుటిలంగా చూచింది. పిమ్మట రాకుమారి కుంకుమపొడితో ఎఱ్ఱనైన సంవరణమాలికను మూర్తీభవించిన అనురాగాన్ని వలె సునందచేతుల మీదుగా రఘునందనుని కంఠానికి తగిలింపజేసింది.

తన వెడదఱొమ్మున వ్రేలాడే ఆ మంగళ పుష్పమాలికను చూచుకొని వరణీయుడయిన అజమహారాజు ఇందుమతి బాహుపాశాలతో తన మెడను

కౌగిలించికొని వ్రేలాడుతున్నట్లుగా భావించాడు. వారిద్దరి కలయికకూ మెచ్చిన పురజనులు "వెన్నెల మబ్బు విడిచిన శరచ్చంద్రుణ్ణి పొందింది, గంగానది అనురూపుడయిన సముద్రుణ్ణి చేరింది" అని ఒకేమాటగా అన్నారు. ఆ మాట ఇతరరాజుల చెవులకు చేదుగా వుండింది.

ఒక ప్రక్క వరుని పక్షానికి చెందిన రాజలోకం ఎంతో సంతోషిస్తే, మరోప్రక్క తక్కిన రాజవర్గమంతా ముఖం ముడుచుకుంది. ఆ దృశ్యం ఉషఃకాలంలో ఒక ప్రక్క వికసించిన పద్మాలతోనూ, మరొక ప్రక్క ముకుళించిన కలువలతోనూ కూడిన మడువులా కనిపించింది.

* * *

# 7

# ఇందుమతి పెండ్లి

అన్ని విధాలా తనకు తగిన వరుడు లభించడంవల్ల ఇందుమతి కుమారస్వామితో కూడిన దేవసేన లాగా శోభిల్లింది. ఆ వధూవరులను వెంటబెట్టుకొని భోజమహారాజు నగర ప్రవేశం చేయటానికి ఉద్యుక్తుడయ్యాడు.

ఆ భోజమహారాజుయొక్క చెల్లెలిపట్ల నిరాశులైన నరాధిపులు తమ రూపాన్నీ, వేషాన్నీ నిందించుకున్నారు. ప్రాతఃకాలంలోని గ్రహాలలాగా వెలవెలపోయిన ఆ రాజులందరూ తమతమ శిబిరాలకు తరలిపోయారు. అజునిపట్ల వారందరికీ మాత్సర్యం పెల్లుబికింది. అయినా సన్నిధిలో ఇంద్రాణి వుండడంవల్ల వాళ్ళు స్వయంవరానికి విఘ్నం కలిగించలేకపోయారు[1].

వధూసమేతుడైన అజమహారాజు రాజమార్గం ప్రవేశించాడు. మార్గమంతా పూలతోనూ, చిగురుటాకులతోనూ అలంకృత మయింది. అందలి తోరణాలు ఇంద్రధనుస్సుల్లాగా వివిధకాంతులతో విరాజిల్లాయి. దట్టమైన పతాకల నీడలు సోకి దారి చల్లబడింది.

బంగరు కిటికీల మేడలలోని సుందరీమణులు అన్ని పనులూ మానుకొని అజమహారాజును దర్శించాలని ఉబలాటపడ్డారు. రాజదర్శనానికై ఒకతె పరుగిడుతూ వచ్చింది. ఆ తొందరలో ఆమె కొప్పు కాస్తా సడలి పూలు జారిపోయాయి. వీడిన కొప్పు చేతపుచ్చుకొని అలాగే వచ్చింది. కాని దాన్ని ముడివేసుకోవాలన్న భావం ఆమెకు కలగనే లేదు. లత్తుక అద్దుతున్న చెలికత్తెనుండి తటాలున తన కాలు లాక్కొని అడుగుమోపిన చోట గుర్తులేర్పడుతూ వుండగా మరొకతె జాలకం చెంతకు చెకచెకా నడిచింది.

(శచీదేవి చెంత అంతరాయం కలిగించేవారు వినాశానికి గురి అవుతారని శాస్త్రం. అందుకే వివాహంలో శచిని పూజించాలని పెద్దల నిర్ణయం.)

ఇంకొకతె కుడికంటికి కాటుక పెట్టుకొని ఎడమకంటికి పెట్టుకోకుండానే కాటుకపుల్ల చేతబట్టి అలాగే కిటికీ చెంతకు పరుగుతీసింది. వేరొకతె తొందర నడకవల్ల జారిపోయిన పోకముడి బిగించకనే కరకంకణ కాంతులు బొడ్డును క్రమ్ముకోగా చీర చేతబట్టి గవాక్షం నుంచి వెలుపలికి చూస్తూ నిలిచిపోయింది. ఒకానొకతె సగం మాత్రమే మణులు గ్రుచ్చిన మొలనూలు కేలనుంచుకొని చివాలున సౌధవాతాయనం వద్దకు నడిచింది. అంతవరకూ గ్రుచ్చిన మణులన్నీ అడుగడుగునా జారిపోగా చివరి కామెచేత దారం మాత్రమే మిగిలింది.

రాజసందర్శనానికై ఎంతో ఉబలాట పడుతున్న ఆ కోమలాంగులు భవనవాతాయనాల వద్ద నిలబడి అదేపనిగా చూడసాగారు. ఆసవ గంధంతోనూ, కదలే కన్ను లనే తుమ్మెదలతోనూ కూడిన ఆ వనితల వదనాలు గవాక్షాల నలంకరించే కమలాల లాగా కనిపించాయి. రాకుమారుణ్ణి నిలువెల్లా కనులై తదేక దృష్టితో చూస్తున్న ఆ సుదతీ లలామలు ఇతర విషయాలను పూర్తిగా విస్మరించారు. తక్కిన ఇంద్రియ వ్యాపారాలన్నీ అప్పుడు వారి చక్షురింద్రియాన్నే ప్రవేశించినట్లయింది.

"పరోక్షంగా ఎందరో రాకుమారులు ఇందుమతిని అర్థించారు. అయినా ఆమె స్వయంవరమే మేలని భావించింది. అది యుక్తమే. అలా కాకపోతే రమాదేవి మాధవుని పొందినట్లు ఆమె తన కనురూపుడైన పతినెలా పొందగలిగేది? బ్రహ్మదేవుడు అందాలరాశియైన ఈ జంటనిలా కూర్చి ఉండకపోతే అతని ఈ సౌందర్య సృష్టిప్రయాస వ్యర్థమై వుండేది. రతిమన్మథులే ఇలా దంపతులై అవతరించారు. ఇందులో సందేహం లేదు. వేలకొలది రాజపుత్రులలో ఈ చిన్నది తనతో సమానుడైన ఇతణ్ణే వరించింది. మనస్సు జన్మాంతర సంగతిని గ్రహిస్తుంది కదా!"

ఇలా పౌరకాంతలు వీనుల కింపుగా మాట్లాడుకోవడం వింటూ రాజకుమారుడు మంగళ సంపన్నమై శోభిల్లుతున్న భోజమహీపతి గృహం



చేరుకున్నాడు. ఏనుగు పైనుండి దిగి కామరూప భూపాలుడు తనచేయి పట్టుకొని నడిపిస్తుండగా భోజుడు చూపిన విడిదిలో చెలువల చిత్తాలలోకి ప్రవేశించినట్లు అజుడు ప్రవేశించాడు. అక్కడ మహోన్నతమైన సింహాసనం అధిష్ఠించాడు. భోజవిభుడు రత్నాలతోనూ, మధుపర్కంతోనూ కూడిన అర్ఘ్యమూ, పట్టువస్త్రాలూ సమర్పించి అతణ్ణి పూజించాడు. ఆభూపాలు డిచ్చిన గౌరవాన్ని కాంతాకటాక్షాలతో సహా అజుడు పరిగ్రహించాడు.

నురుగులు గ్రక్కుతున్న సాగరుణ్ణి చంద్రమయూఖాలు తీరభూమిచెంతకు తీసుకుపోయినట్లు అంతఃపురాధికారులు దుకూల వస్త్రధారియైన అజుణ్ణి వధువు పొంతకు కొనిపోయారు. అక్కడ అగ్నితుల్యుడైన భోజుని పురోహితుడు నేయి మొదలైన ద్రవ్యాలతో హోమం పూర్తిచేసి అగ్నిసాక్షికంగా ఆ వధూవరు లిరువురినీ కలిపాడు. వరుడు, వధువు హస్తాన్ని తన హస్తంతో పరిగ్రహించి అశోక లతాపల్లవాన్ని తన పల్లవంతో స్పృశించిన గున్నమామిడి చెట్టులాగా భాసించాడు. అతని ముంజేయి గగుర్పాటు చెందింది. ఆమె వ్రేళ్లు చెమటతో చెమ్మగిల్లాయి. అప్పుడు మన్మథుడు వధూవరు లిరువురిలోనూ అనురాగస్థితిని సమంగా విభజించాడా అన్నట్లు గోచరించింది.

పరస్పర సందర్శనాభిలాషతో వధూవరులు కడగంటి చూపులను ప్రసరింపజేశారు. ఇరువురి చూపులూ కలిసిపోగానే సిగ్గు అడ్డుదగిలి వాటిని వెనక్కు మళ్ళించింది. ఉజ్జ్వలమైన అగ్నికి ప్రదక్షిణంగా నడుస్తున్నప్పుడు ఆ దంపతులు మేరుపర్వతం చుట్టూ జంటగా పరిభ్రమించే రేబవళ్ళలాగా ప్రకాశించారు. విపులమైన పిరుదులూ, మత్తచకోరాలవంటి నేత్రాలూ కల ఆ లజ్జావతి యగు ఇందుమతి బ్రహ్మతుల్యుడైన గురుని ప్రేరణతో హోమాగ్నియందు లాజలను విసర్జించింది. హవిస్సు, జమ్మి చివుళ్ళు, లాజలు – వీటిగంధంతో నిండి పవిత్రమైన హోమధూమం పైకెగసింది. అది ఇందుమతి చెక్కిళ్ళపై ప్రసరించినపుడు క్షణకాలం ఆమెకు కర్ణోత్పలమై

విలసిల్లింది. ఆ హోమధూమం క్రమ్ముకోవడంవల్ల ఆమె కాటుకకళ్ళు చెమ్మగిల్లాయి. కర్ణపూరమైన యవాంకురం వాడబారింది. కపోలాలు ఎరుపెక్కాయి. స్నాతకులూ, బంధుసమేతుడైన భోజరాజూ, సుమంగళులైన పురస్త్రీలూ వరుసగా బంగారు పీటలమీద కూర్చున్న ఆ వధూవరులపై ఆర్ద్రాక్షతలు చల్లారు.

ఈ రీతిగా భోజమహారాజు చెల్లెలి పెళ్ళి పూర్తిచేశాడు. ఆపైన రాజులందరినీ వేర్వేరుగా సత్కరించవలసిందని అధికారుల నాదేశించాడు. కానుకల నెపంతో భోజుడు కావించిన సత్కారాలకు బదులు సమర్పించుకుని తెచ్చుకోలు సంతసంతో తమ మానసిక వికారాన్ని కప్పిపుచ్చుకొని లోపల మొసళ్ళతో నిండి పైకి నిర్మలంగా కనిపించే మడుగుల్లాగా వున్న ఆ నరపతులు ఆయనతో వెళ్ళివస్తామని చెప్పి కదిలారు. ఆ రాజులందరూ ఎలాగయినా సమయం చూచి, ఇందుమతిని హరించాలని ముందుగానే సంకేతం చేసుకొన్నారు. అందుల కనుగుణంగా అజుడు తిరిగిపోవలసిన మార్గానికి అడ్డంగా నిలబడ్డారు.

భోజరాజు చెల్లెలిపెళ్ళి పూర్తిచేసి ఆమెకు తగిన అరణం సమర్పించాడు. వధూసమేతంగా అల్లుణ్ణి సాగనంపుతూ తానూ అతనివెంట నడిచాడు. అలా మార్గంలో మూడు రాత్రులు లోకవిఖ్యాతుడైన అజునితో ఉండి అమావాస్య పోగానే చంద్రుడు సూర్యుణ్ణి వదలినట్లు అతణ్ణి వదలి కుండిన నగరానికి మరలాడు.

దిగ్విజయకాలంలో తమ సంపదలు కొల్లగొట్టాడన్న కారణంగా రాజులంతా ముందే రఘుమహారాజు మీద మిక్కిలి కినుక వహించి ఉండినారు. అందువల్లనే అతని కుమారుడు స్త్రీరత్నాన్ని చేజిక్కించుకోవడం వాళ్ళు సహించలేకపోయారు. పూర్వం బలిచక్రవర్తి సమర్పించిన సిరిని స్వీకరిస్తున్న త్రివిక్రముని పాదాన్ని ప్రహ్లాదుడు నిరోధించినట్లు ఇందుమతిని



గైకొని వెళుతూన్న అజుణ్ణి ఆ రాజవర్గం నిరోధించింది. అప్పుడు రాకుమారుడు వధూరక్షణకై పెక్కుమంది భటులతో కూడిన ఆప్తసచివుణ్ణి నియోగించాడు. గంగా ప్రవాహాన్ని ఎగసిపడే అలలుగల శోణనదం ఎదుర్కొన్నట్లు ఆ రాజుల సేనను తాను ఎదుర్కొన్నాడు.

ఇంతలో ఇరు సైన్యాలలోనూ కాలిబంటు కాలిబంటుతోనూ, రథికుడు రథికుడితోనూ, రౌతు రౌతుతోనూ, గజస్థుడు గజస్థుడితోనూ తలపడినారు. ఇలా సమస్కంధులతో ప్రారంభమయిన పోరు ఘోరంగా కొనసాగింది. తూర్యాల రవళిలో ఒకరిమాట ఒకరికి వినిపించలేదు. అందుచేత సైనికులు తమ కులనామాలను పేర్కొనకుండా సంకుల సమరం సాగించారు. అయినా, ఆ విలుకాండ్రు పరస్పరం ప్రయోగించుకున్న బాణాల మీది నామాక్షరాలే వారివారి పేరు ప్రఖ్యాతలు చాటినాయి.

గుఱ్ఱపు గిట్టల తాకిడికి పైకెగసిన ధూళి రథచక్రాల సంచలనంతో మరీ దట్టమయింది. ఏనుగు చెవుల గాలికి అది మరీ విస్తరించి వస్త్రంలాగా సూర్యుణ్ణి కప్పివేసింది. ఆ సేనాపరాగాన్ని గాలికి విచ్చుకున్న నోళ్ళతో గ్రహిస్తున్న మత్స్యధ్వజాలు కలుషిత జలాలను త్రాగే అచ్చమైన చేపల్లాగా భాసిల్లినాయి. దుమ్ము దట్టంగా క్రమ్ముకోవడంవల్ల కంటికి ఏమీ కనిపించలేదు. అప్పుడు స్వామి నామోచ్చరణను బట్టి తమవారినీ, పెరవారినీ సైనికులు గుర్తించి కయ్యం కొనసాగించగలిగారు.

అలా యుద్ధభూమిలో కంటి చూపును నిరోధిస్తూ పరాగమనే చీకటి విజృంభించింది. ఆ పైన శస్త్రాల దెబ్బలకు గురైన గుఱ్ఱాలు, ఏనుగులు, సైనికులనుంచి ప్రవహించిన రక్తం ఆ చీకటి పాలిటికి బాలభాను డయింది. నెత్తురు పారడంవల్ల నేలతో సంబంధం గోల్పోయిన ధూళి గాలికి పైకెగిరింది. అప్పుడది నిప్పు కణికలు మాత్రమే నిలిచి అంతకు మునుపే పైకెగసిన పొగలాగా భాసించింది.

దెబ్బ తిని మూర్ఛిల్లిన రథికులు మూర్ఛనుండి తేరుకోగానే రథాలను శత్రువుల బారినుండి తొలగించిన సారథులను అధిక్షేపించారు. పిమ్మట తొల్లిటి ధ్వజచిహ్నాలతో గుర్తించి తమ్ము కొట్టిన వారిమీదనే మళ్ళీ శరప్రయోగం చేశారు. నిపుణులైన విలుకాండ్రు ప్రయోగించిన బాణాలు మార్గమధ్యంలో శత్రుబాణాలకు తగిలి నడిమికి విరిగిపోయాయి. అయినా, వాటి పూర్వభాగాలు మాత్రం వేగాతిశయంతో ముందుకు దూసుకుపోయి లక్ష్యాలను భేదించాయి.

గజయుద్ధంలో తీక్ష్ణ చక్రప్రయోగంతో ఖండింపబడ్డ గజారోహకుల శిరస్సులు డేగల గోళ్ళలో తలవెంట్రుకలు తగులు కోవడంవల్ల చాలా సేపటికి గాని నేల బడలేదు. దెబ్బ తిని మూర్ఛిల్లి గుఱ్ఱం మూపుపై ఒరిగిన శత్రువుమీద అతడు తేరుకుని తిరిగి తనతో తలపడే వరకూ మొదటివాడు శస్త్రప్రయోగం చేయనేలేదు. కవచధారులైన సైనికులు శరీరాలపై మమకారం వదలి ఒరనుండి పెరికిన ఖడ్గాలతో గజాల పెనుదంతాలపై తీవ్రంగా ప్రహరించారు. ఆ దెబ్బకు భయపడ్డ ఏనుగులు తొండాలనుంచి చిమ్మిన నీటి తుంపరలు ఆ సంఘర్షణవల్ల జనించిన అగ్నిని ఆర్పివేశాయి.

శరాలతో ఛేదింపబడి నేలవ్రాలిన శిరస్సు లనే ఫలాలతోనూ, శిరస్త్రాణా లనే పానపాత్రలతోనూ, నెత్తు రనే మద్యప్రవాహంతోనూ నిండిన కదనభూమి మృత్యుదేవతయొక్క పానభూమిలా ప్రకాశించింది. పక్షులు ఇరువైపులా పీక్కు తింటున్న ఒక భుజఖండాన్ని నక్క బలవంతంగా లాక్కున్నది. కాని బాహుపురుల కొనలు తగిలి దవడలు గాయమయ్యే సరికి మాంసంమీద ప్రీతి ఉన్నప్పటికీ అది దాన్ని వదిలేసింది. శత్రు ఖడ్గప్రహారాలతో తలతెగిన ఒక వీరుడు వెంటనే సురలోకంలో విమాన ప్రభువు అయ్యాడు. అక్కడ ఎడమ తొడపై సురాంగనను కూచోబెట్టుకొని విహరిస్తూ రణరంగంలో నృత్యం సల్పుతున్న తన మొండెమును చూచాడు.



ఇరువురు రథికులు ఒండొరులతో తలపడినారు. సారథులు నిహతులు కాగా, తామే రథాలు నడుపుకుంటూ సమరం సాగించారు. గుఱ్ఱాలుకూడా చచ్చేసరికి గదాయుద్ధానికి ఉపక్రమించారు. గదలు సైతం విరిగిపోయాయి. ఆపై బాహుయుద్ధానికి ఉద్యమించారు. ఇరువురు భటులు ఒకరితో నొకరు తీవ్రంగా పోరాడి ఒకే క్షణంలో అసువులు వీడి దేవత్వాన్ని పొందినారు. దేవలోకంలో కూడా ఒకే అప్సరసను అభిలషించిన వారిరువురికీ వివాదం తప్పలేదు. ఈ విధంగా ఇరుపక్షాల సేనలు క్రమంగా వెనుకకూ, ముందుకూ వీచే గాడ్పులకు చెలరేగిన రెండు మహాసముద్రపుటలల చందంగా అవ్యవస్థితమైన జయాపజయాలు పొందినాయి.

చివరకు శత్రుబలాల తాకిడికి అజుడి సైన్యం చెల్లాచెదురైపోయింది. అయినా మహాపరాక్రమశాలి అయిన ఆ రాజపుత్రుడు తానొక్కడే రిపుసైన్యాన్ని ఎదుర్కొన్నాడు. గాలికి పొగవెనక్కు మళ్ళినా అగ్నిమాత్రం గడ్డి కుప్ప వైపే ప్రసరిస్తుంది కదా! కవచాన్నీ, ధనుర్బాణాలనూ ధరించి రథస్థుడైన ఆ అసహాయశూరుడు రణగర్వితుడై ముందు కురికాడు. కల్పాంతంలో ఆదివరాహం ఉద్వేలమైన సముద్రజలాన్ని కలచివేసినట్లు రాజవర్గాన్ని కలచివేశాడు. సంగ్రామరంగంలో అతడు కుడిచేతిని గానీ, ఎడమచేతినిగానీ, అమ్ములపొదిలో ప్రవేశింపజేసిన దృశ్యం కనిపించనే లేదు. ఆ మహాయోధుడు ఒక్కసారి ఆకర్ణాంతం లాగిన అల్లెత్రాడు శత్రువులను నురుమాడే శరపరంపరను తనకు తానే సృష్టించిందా అన్నట్లు గోచరించింది.

అజుని శరప్రవాహంలో కంఠాలనుండి తెగిపడ్డ శత్రుశిరస్సులు రోషంతో కొఱకడంవల్ల మిక్కిలిగా ఎఱ్ఱవారిన పెదవులతోనూ, స్పష్టంగా కనిపించే ఊర్ధ్వరేఖలు గల బొమముడులతోనూ, హుంకారాలతోనూ ఒప్పారి రణక్షోణినంతా కప్పివేశాయి. అప్పు డాశత్రువు లందరూ కూడుకొని రథగజతురగాది సకలసేనాంగాలతోనూ, కవచాలను చీల్చివేసే సమస్తాయుధాలతోనూ, సర్వప్రయత్నాలతోనూ ఒక్కుమ్మడిగా అజుణ్ణి

ప్రహరించటానికి పూనుకొన్నారు. విరోధులు ప్రయోగించిన బాణాలు అజుని అరదాన్ని కప్పివేశాయి. అంతటా మంచు క్రమ్ముకొన్నప్పుడు కొద్దిపాటి వెలుగులు విరజిమ్మే ప్రభాకరునివల్ల ప్రాతఃకాలాన్ని గుర్తించినట్లు కేవలం ధ్వజాగ్రాన్నిబట్టి అజుడి ఉనికి గుర్తింపబడింది.

అప్పుడు మారసుందరుడూ, మహోజాగరూకుడూ అయిన అజమహారాజు ప్రియంవదు డిచ్చిన ప్రస్వాపన మనే గాంధర్వాస్త్రాన్ని పగతురపై ప్రయోగించాడు. ఆ అస్త్రప్రభావంవల్ల వాళ్ళ హస్తాలు ధనురాకర్షణ చేయజాలక స్తంభించిపోయాయి. శిరస్త్రాణాలు ఒకప్రక్క, భుజంవైపుగా ఒరిగిపోయాయి. దేహాలు ధ్వజస్తంభాలకు చేరగిలబడ్డాయి. అలా శాత్రవసైన్యమంతా గాఢనిద్రలో మునిగిపోయింది.

పిమ్మట అజుడు తన విజయం సూచిస్తూ శంఖం పూరించాడు. ఇందుమతి చవిచూచిన అతని క్రింది పెదవివద్ద నిల్పిన ఆ శంఖాన్ని అవలోకించినప్పుడు ఆ మహావీరుడు స్వహస్తాలతో ఆర్జించిన మూర్తిమంతమైన కీర్తిని పానం చేస్తున్నాడా అనిపించింది. భండనభూమినుండి పరుగిడిపోయిన అతని సైనికులు శంఖారావం గుర్తించి తిరిగివచ్చారు. ముకుళించుకొన్న పద్మాల నడుమ భాసిల్లే ప్రతిబింబ చంద్రునిలాగా నిద్రించే శత్రువులమధ్య వున్న తమ ప్రభువును వారు తిలకించారు.

“ఇప్పుడు రాఘవుడు మీకీర్తినే హరించాడు గాని కృపతో మీజీవితాన్ని హరించలేదు” అన్న వాక్యాన్ని అజుడు రక్తసిక్తమైన బాణాగ్రాలతో ఆ నరపతుల ధ్వజాలపై వ్రాయించాడు. పిదప శిరస్త్రాణం తొలగించడంవల్ల సడలిన కేశబంధంతోనూ, నుదుట గ్రమ్మిన చెమట బొట్లతోనూ చెలువారుతూ ఆ రాకుమారుడు భీతిల్లిన ఇందుమతి చెంతకు జేరి వింటికొప్పున ఒకచేయి నిల్పి ఇలా అన్నాడు.



“వైదర్భీ! ఇదుగో అనుమతి నిస్తున్నాను. ఈ వైరి నరపతులను చూడు. ఇప్పుడు వీరినుంచి అర్భకులు సైతం ఆయుధాలను లాగివేయవచ్చు. ఈ పాటి యుద్ధచేష్టతో వీరు నా చేతినుండి నిన్ను అపహరించుకుపోవాలని ఆశించారు.”

ప్రత్యర్థుల భయంవల్ల కల్గిన విషాదం వీడి పోగానే ఆమె నెమ్మోము నిట్టూర్పుల ఆవిరి తొలగి సహజ నైర్మల్యం సంతరించుకొన్న అద్దంలాగా అలరారింది. ఆమె ప్రియుని పౌరుషానికి ఎంతో సంతోషించింది. అయినా సిగ్గువల్ల తనకు తానే పతిని అభినందించలేకపోయింది. తొలకరి చినుకులకు తడిసిన నేల నెమలికేకలతో మేఘబృందాన్ని అభినందించినట్లు ఆమె చెలికత్తెల పలుకులతో ప్రాణప్రియుడికి అభినందన లందించింది.

ఇలా నిర్దోషుడైన అజనృపాలుడు రాజుల శిరస్సుపై ఎడమ పాదముంచి అనవద్య చరిత్ర అయిన ఇందుమతిని పరిగ్రహించాడు. రథాశ్వాలు రేపిన ధరాధూళితో ముంగురులు బిరుసెక్కిన ఆ వధూమణి మూర్తీభవించిన సమర విజయలక్ష్మి అయింది.

అజుడు రాకముందే రఘుమహారాజు కుమారుని విజయవార్త విన్నాడు. తగిన పత్నితో కూడి పురానికి తిరిగివచ్చిన పుత్రుణ్ణి అభినందించాడు. సంసారభారాన్ని అతని కప్పగించాడు. శాంతిమార్గంలో ఔత్సుక్యం వహించాడు. అది యుక్తమే. కులధురంధరుడు ఉండగా రవివంశజులైన రాజులు, గృహస్థాశ్రమంలో కొనసాగరు కదా!

* * *

# 8

# అజుని పట్టాభిషేకం

పిమ్మట రఘుమహారాజు ఇంకా వైవాహిక కౌతుకం వదలని అజుడికి మరొక ఇందుమతిని సమకూర్చాడా అన్నట్లు రాజ్యలక్ష్మిని గూడా సమర్పించాడు. సాధారణంగా రాజపుత్రులు దుష్కృతాలైనా చేసి రాజ్యాన్ని స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నిస్తారు. కాని అప్రయత్నంగా లభించిన ఆ రాజ్యాన్ని అజుడు తండ్రి ఆనతి అన్న భావంతో స్వీకరించాడే కాని భోగతృష్ణతో పరిగ్రహించలేదు. వసిష్ఠమహర్షి పోసిన జలాలతో అజునితో పాటు అభిషేకింపబడ్డ భూకాంత విశదమైన ఉచ్ఛ్వాసంద్వారా (తెల్లటి ఆవిరి ద్వారా) తన కృతార్థతను ప్రకటించిందా అన్నట్లయింది.

ఆథర్వవేదాభిజ్ఞుడైన వసిష్ఠమహర్షి అజుడికి అభిషేక సంస్కారం నిర్వర్తించాడు. ఆ తేజోమహిమవల్ల అరివీరు లతనిని తేరిపార జూడలేకపోయారు. బ్రహ్మక్షత్ర తేజస్సుల కలయిక పవనాగ్నుల కలయిక వంటిదిగదా! నూతనంగా పట్టాభిషిక్తుడైన అజుణ్ణి ప్రజలు మళ్ళీ యౌవనం పొందిన రఘుమహారాజే అని భావించారు. తండ్రినుంచి రాజ్యసంపదను మాత్రమే కాక అతడు గుణాల నన్నింటినీ పుణికి పుచ్చుకొన్నాడు. జనకునినుండి సంక్రమించిన రాజ్యం అజుని వల్లా, అజుని నవయౌవనం వినయంవల్లా – ఇలా ఈ రెంటివల్లా ఆ రెండూ ఎంతగానో శోభిల్లాయి. అప్పుడే చేతికి వచ్చిన రాజ్యరమను బలాత్కరిస్తే ఉద్వేగం పొందుతుందని ఆ మహాభుజుడు నవవధువు ననుభవించినట్లు మృదువుగా అనుభవించాడు.

తన చెంతకు వచ్చే వందలకొలది నదుల్లో ఏ నదినీ సముద్రుడు అవమానింపడు. అలాగే అజమహారాజు తన రాజ్యంలో ఎవరినీ తిరస్కరించలేదు. అందువల్ల ప్రజలలో ప్రతివాడూ 'ఈ రాజుకు నేనంటేనే ఇష్టం!' అని భావించేవాడు. అతడు పరిపాలనలో మరీ కఠినంగానూ, మరీ మెత్తగానూ ప్రవర్తించలేదు. మధ్యమ పద్ధతి నవలంబించి గాలి చెట్లను



పెళ్ళగించకుండానే వంచినట్లు విరోధులను నిర్మూలించకనే లోగొనేవాడు. సత్త్వబలంతో పుత్రుడు ప్రజల్లో దృఢంగా పాతుకోవడం రఘుమహారాజు గమనించాడు. ఇక లౌకిక సుఖాలపైనే కాక అశాశ్వతాలైన స్వర్గసుఖాలపై కూడా ఆయనకు కోరిక లేకుండా పోయింది.

దిలీపుని వంశంలోని వారందరూ వార్ధకంలో గుణవంతులైన కుమారులకు రాజ్య మప్పగించి నియమవంతులై నారచీరలు దాల్చిన మౌనుల మార్గాన్నే అనుసరించేవారు. రఘుమహారాజు ఆ పద్ధతిలోనే నడవా లనుకొన్నాడు. అడవికి వెళ్ళడానికి సిద్ధమవుతున్న తండ్రి పాదాలకు ఉష్ణీషంతో ఒప్పారే శిరస్సుతో ప్రణమిల్లి అజుడు తన్ను వదలిపోవద్దని ప్రార్థించాడు. కంట తడిపెట్టిన కుమారుని కోరికను పుత్రప్రీతిగల తండ్రి కాదనలేకపోయాడు. కాని విడిచిన కుబుసాన్ని పాము తిరిగి ధరించనట్లు వదలిన సిరిని మాత్రం అతడు మళ్ళీ తన దరికి చేరనీయలేదు. ఆ రఘుమహారాజు సన్న్యాసం స్వీకరించి నగరానికి వెలుపల నివసించాడు. కుమారు డనుభవిస్తున్న రాజ్యలక్ష్మి ఆ మహామహునికి కోడలులాగా శుశ్రూష చేసింది.

ముందటిరాజు ప్రశాంతస్థితిలో వున్నాడు. క్రొత్తరాజు అభ్యుదయ పథంలో పురోగమిస్తున్నాడు. అప్పు డారాజకులం అస్తమించే చంద్రుడూ, ఉదయించే సూర్యుడూ కల అంబరంతో సామ్యం వహించింది. రఘువు కాషాయాదులనూ, అజుడు ఛత్రచామరాదులనూ ధరించారు. నివర్తకమైన మోక్షధర్మమూ, ప్రవర్తకమైన అభ్యుదయ ధర్మమూ అలా తమతమ అంశాలతో అవనీమండలంలో అవతరించాయా అన్నట్లు ప్రజలు వారిరువురినీ చూచారు. అజుడు ఓటమిలేని పదవి నధిష్ఠించడానికై మంత్రులతో కూడాడు. రఘువు మోక్షప్రాప్తికై ఆప్తులైన యోగులతో చేరాడు. తరుణనృపతి ప్రజాపరిరక్షణకై ధర్మాసనం అధిష్ఠించాడు. వృద్ధనృపతి చిత్తైకాగ్రతకై ఏకాంతంలో దర్భాసనం స్వీకరించాడు. ఒకడు ప్రక్కరాజులను ప్రభుశక్తితో

స్వాధీనం చేసుకొన్నాడు. మరొకడు సమాధి యోగంతో శరీరంలోని ప్రాణాది పంచవాయువులను  వశపరచుకొన్నాడు.

అజుడు శత్రువుల ప్రయత్నాలను ఫలితాలతో సహా బుగ్గిచేశాడు. రఘువు జ్ఞానాగ్నితో తన కర్మలను భస్మీకరించటానికి ఉద్యుక్తు డయ్యాడు. రాఘవుడు ఫలవంతా లయ్యేటట్లుగా ఆలోచించి సంధి మొదలైన షడ్గుణాలను ప్రయోగించాడు. మట్టినీ, బంగారాన్నీ తుల్యంగా భావించే రఘువు సత్త్వాది త్రిగుణాలను వికారానికి లోనుగాకుండా నిగ్రహించాడు. కర్మనిష్ఠుడైన నూతన ప్రభువు ఫలసిద్ధి కలిగే వరకూ కర్మనుండి విరమించ లేదు. స్థిరబుద్ధి అయిన వృద్ధభూపతి పరమాత్మ సాక్షాత్కరించేవరకూ యోగానుసంధానం వదలలేదు. ఇలా జాగరూకుడై శత్రువుల నరికట్టి అజుడు అభ్యుదయ రూపమైన సిద్ధిని పొందాడు. అప్రమత్తుడై ఇంద్రియాలను నిగ్రహించి రఘువు మోక్షరూపమైన ఫలాన్ని చూరగొన్నాడు.

సమదృష్టి సంపన్నుడైన రఘుమహారాజు అజుని కోరికమేరకు కొన్ని సంవత్సరాలు అక్కడే గడిపాడు. ఆపై యోగసమాధితో మాయ కతీతుడైన పరమాత్మను చేరుకొన్నాడు. తండ్రి దేహత్యాగం చేశాడని విని అజుడు చిరకాలం కన్నీరు కార్చాడు. పరివ్రాజకులతో కూడి తండ్రికి అగ్నిసంస్కార రహితమైన అంత్యకర్మ నిర్వర్తించాడు. శ్రాద్ధవిధిని చక్కగా గ్రహించిన అజమహారాజు కేవలం పితృభక్తితోనే జనకుని శ్రాద్ధకర్మ అనుష్ఠించాడు. యోగమార్గంలో శరీరం త్యజించినవారు తనయులిచ్చే పిండాన్ని కోరరుగదా!

“మీ తండ్రి ముక్తి పొందాడు, అతనికై శోకింపవద్దు” అన్న తత్త్వజ్ఞుల ఉపదేశంతో క్రమంగా అజుని మనోవ్యథ శాంతించింది. అతడు ధనువు చేపట్టి ఏమాత్రం ఎదురు లేకుండా రాజ్యపాలన కొనసాగించాడు.

మహాపరాక్రమశాలి అయిన అజమహారాజుకు క్షితి, ఇందుమతి అనే ఇరువురూ దేవేరు లయ్యారు. వారిలో క్షితి అనేక రత్నాలను ప్రసవించగా, ఇందుమతి వీరుడైన కుమారుణ్ణి కనింది. ఆ యిందుమతీ సుతుడే



సూర్యసమతేజుడూ, దశదిశలా యశస్సుచే ప్రసిద్ధుడూ, రామచంద్రుని జనకుడూ అయిన దశరథ మహారాజుగా తరువాత ప్రశస్తి వహించాడు.

అధ్యయనంతో ఋషిఋణాన్నీ, యజ్ఞాలతో దేవఋణాన్నీ, సంతానంతో పితౄణాన్నీ తీర్చుకొని అజుడు పరివేష విముక్తుడైన భానునిలా భాసించాడు. అతని బలం ఆర్తుల భయాన్ని తొలగించడానికీ, చదువు విద్వాంసుల సత్కారానికీ వినియోగపడింది. అలా ఆ నరపాలుని ధనమే కాక గుణం కూడా పరుల కెంతగానో ఉపకరించింది.

ప్రజారక్షణలో ఏమాత్రం ఏమరుపాటు చూపని ఆ భూపాలుడు ఒకనాడు ఇందుమతితో పాటు నగరోద్యానంలో శచీసమేతుడై నందనవనంలో విహరించే దేవేంద్రునిలాగా వాహ్యాళి సలుపసాగాడు. దక్షిణసాగర తీరంలోని గోకర్ణ క్షేత్రాన్ని అధిష్ఠించి వున్న పరమశివుని చెంత వీణాగానం చేయడానికై నారదుడు అదే సమయంలో ఆకాశమార్గాన పయనించాడు. ఆ దేవముని వీణాశిరస్సునందు అలంకరించివున్న దివ్యకుసుమమాల పరిమళాలు విరజిమ్ముతూ వున్నది. ఆ వాసనమీది అభిలాషతో కాబోలు అమితవేగంగా వీస్తూ వచ్చిన గాలి ఆ విరిదండను కాస్తా అపహరించుకుపోయింది. ఆ పువ్వుల వెంట పయనిస్తున్న తుమ్మెదలు వీణను వదలి తామూ క్రిందికి దిగాయి. పవనుని అధిక్షేపానికి గురి అయిన వీణ కాటుకతో కలుషితమైన కన్నీరు కారుస్తున్నదో అన్నట్లు ఆ తుమ్మెదలబారు అగుపించింది.

## ఇందుమతి మరణం

ఆ దివ్యమాల మకరందంతోనూ, సౌరభంతోనూ నేలమీది తీగల మధుగంధసంపదను పరాభవిస్తూ దిగివచ్చి ఇందుమతీదేవి చనుమొనలపై వ్రాలింది. అలా క్షణకాలం అందమైన తన స్తనాలతో చెలిమిచేసిన ఆ మాలను చూడగానే ఇందుమతి వివశురాలై రాహువు గ్రసించిన చంద్రుని వెన్నెలలాగా అసువులు బాసింది. ఇంద్రియ శూన్యమైన శరీరంతో నేల

వ్రాలుతూ ఆమె తనతోపాటు తనభర్తను గూడా నేల వ్రాల్చింది. దీపజ్వాల తైలబిందువును వదలి తానొక్కటే నేలపై జారిపడదుగదా!

అపు డాదంపతుల పరిజనులు దుఃఖార్తులై బిగ్గరగా ఆక్రందనం చేశారు. ఆ ధ్వనికి కలవరపడిన అక్కడి మడుగులోని పక్షులు తాము వారి ఖేదంలో పాలుపంచుకొన్నవా అన్నట్లు ఆక్రోశించాయి. అజుడు వీజనాది పరిచర్యలవల్ల మూర్ఛనుండి తేరుకొన్నాడు. కాని ఇందుమతి మాత్రం అలాగే వుండిపోయింది. ఆయుస్సు మిగిలి వుంటేగదా చికిత్స ఫలించేది! అసువులు వీడడంవల్ల తంత్రులు తెగిన వీణలాగా మూగవోయిన ఇందుమతిని ప్రేమమూర్తి అయిన అజుడు ఒడిలోకి తీసుకొన్నాడు. ఇంద్రియాలు తొలగిపోవడంవల్ల కాంతి గోల్పడిన కాంతను తొడపై నిడుకొన్న అజుడు ఉషఃకాలంలో మలినమైన మృగరేఖను దాల్చిన చంద్రునిలా కనిపించాడు.

## అజవిలాపం

అతడు సహజధైర్యాన్ని సైతం కోల్పోయి కన్నీరు విడుస్తూ గద్గదకంఠుడై విలపించాడు. తాపానికి లోనైనప్పుడు ఇనుమైనా మెత్తబడుతుంది. ఇక శరీరధారులను గురించి చెప్పేదేముంది?

“ఔరా! పూలు గూడా ఒడలంటగానే ఆయుస్సును హరిస్తాయా? అయితే ప్రాణాలు తీయదలచుకొన్న విధికి మతేది సాధనం కాదు? ఒకవేళ కాలుడు మృదువస్తువును మృదువస్తువుతోనే హతమార్చడానికి పూనుకుంటాడేమో! ఇందుకు ప్రథమోదాహరణం మంచుబిందువుతో విపత్తినొందే తామరతీగే. ఈ దండ అసువులు హరించేదే అయితే నాయెదపై వుంచుకొన్నప్పుడు నన్నెందుకు చంపదు? ఈశ్వరేచ్ఛవల్ల ఒకచోట విషం అమృతంగానూ, అమృతం విషంగానూ పరిణమిస్తాయి. నాదురదృష్టం వల్ల విధాత ఈ పిడుగుపాటును కల్పించాడు. ఇది చెట్టును పడగొట్టక దాని కొమ్మ నాశ్రయించిన తీగను ధ్వంసం చేసింది.



ప్రేయసీ! నే నెన్ని తప్పులు చేసినా నన్నెప్పుడూ నీవు తిరస్కరించి యెరుగవు గదా! ఇప్పుడు నిరపరాధి నయిన నన్ను పలకరించగూడదని ఎందుకు భావిస్తున్నావు? నిజంగా నీవు నన్ను కపటప్రేమికుడనీ, శఠుడనీ అనుకొంటున్నావు. లేకపోతే ఇక్కడినుంచి నాతో చెప్పకనే తిరిగిరాని పరలోకానికి వెళతావా? ఈ నా పాడుబ్రతుకు నిజంగా నీవెంబడి వచ్చే వుంటే నిన్ను వదలి మళ్లీ ఎలా తిరిగివస్తుంది? తాను చేసిన తప్పుకు తగిన ప్రతిఫలం ఇప్పుడది అనుభవించనీ!

సురత శ్రమవల్ల కలిగిన చెమటబొట్టు ఇంకా నీముఖంలో ఆరిపోనే లేదు. ఇంతలో నీవు అంతరించిపోయావు. ఛీ! ఏమి ఈ దేహధారుల అస్థిరత్వం? మనస్సులో కూడా నీకు ఎప్పుడూ అప్రియం చేసి ఎరుగనే! మరి నన్ను ఎందుకు వదలి వెళ్ళావు? పేరుకు నేను క్షితిపతినే కాని నా పంచప్రాణాలూ నీ ఆధీనాలే కదా! సుందరీ! విరులు చెరివిన తుమ్మెదలవంటి నీ కుటిలాలకాలను కదిలిస్తున్న ఈ గాలి నీవు మళ్ళీ తిరిగి వస్తావేమో అన్న ఆశను నాలో రేకెత్తిస్తున్నది. ప్రియురాలా! జ్యోతిర్లత రాత్రివేళ వెలుగుతో హిమాద్రిగుహలోని చీకటిని పోగొట్టినట్టు వెంటనే మేల్కొని నాలోని విషాదం తొలగించు. ముంగురులు చలిస్తున్నా మూగవోయిన నీమోము రొదలేని తుమ్మెదతో గూడిన ముకుళిత పద్మంలాగా నన్ను బాధిస్తున్నది.

ఎడబాటు ఏర్పడినా, నిశికీ శశికీ మళ్ళీ సంయోగం కల్గుతుంది. చక్రవాకి చక్రవాకముతో విడివడినా మళ్ళీ దాన్ని చేరుకొంటుంది. అందువల్లనే చంద్రుడూ, చక్రవాకమూ విరహావధిని ఓర్చుకొంటాయి. కానీ నిన్ను మళ్ళీ కలుసుకొనే అవకాశం నాకు లేదు. నావ్యథ తీరేదెలా? కోమలమైన నీ శరీరం కొంగ్రొత్త చివుళ్ల పడకమీదకూడా పరితాపానికి పాత్రమయేది. అలాంటిది కాష్ఠాధిరోహణాన్ని ఎలా సహించగలదో చెప్పు. నీ మొదటి ఏకాంత సఖి అయిన మొలనూలు గమనవిలాసం లేకపోవడంవల్ల మూగవోయినదై దీర్ఘనిద్ర చెందిన నీతో అనుమరణం పొందిన ట్లగుపిస్తున్నది.

స్వర్గానికి వెళుతూ నేను నీ విరహం సహించలేనని భావించి నీవు కోకిలల్లో నీకలభాషణాన్నీ, కలహంసల్లో అలసగమనాన్నీ, జింకలలో బిత్తరచూపులనూ, గాలికి కదిలే తీవల్లో విలాసాన్నీ – ఇలా ఆయా గుణాలను ఆయా చోట్ల వుంచి వెళ్ళిపోయావు. ఇది నిజం. అయినా నీవియోగంతో వేగిపోతున్న నన్ను ఇవేవీ ఓదార్చలేకున్నాయి.

ప్రియంగులతకూ, సహకార వృక్షానికీ నీవు జంట కలిపావు. వీటికి పెళ్ళి చేయకుండానే వెళ్ళడం నీకు తగునా? నీవు పోషించిన అశోక తరువు పూచే పుష్పం ఇంతవరకూ నీకు అలకాభరణం అయ్యేది. దాని నిప్పుడు నేనెలా నివాపమాల్యంగా వాడేది? సుగాత్రీ! అన్యదుర్లభమైన అందెల రవళితోటి నీ పాదతాడనాన్ని తలపునకు తెచ్చుకొని కాబోలు ఈ అశోకవృక్షం కుసుమాశ్రువులు రాలుస్తూ శోకిస్తున్నది. ఓ కిన్నరకంఠీ! నీ నిట్టూర్పువంటి వాసనగల పొగడపూలతో నేను సగం గ్రుచ్చిన ఈ విలాసమేఖల పూర్తికాక ముందే ఇలా నిద్రించడం నీకు తగునా?

ఈ చెలికత్తెలు నీ సుఖదుఃఖాలలో పాలు పంచుకొన్నవారు. ఈ పిల్లవాడు పాడ్యమినాటి చందమామలా వున్నాడు. నేను సమానురాగం కలవాడిని, అయినా నీవు మమ్మల్ని ఎందుకు వదలిపోయావో ఊహకు అందడం లేదు. నేడు నా ధృతి నశించింది. నా ఆట ఆగిపోయింది. పాట మూగవోయింది. ఋతువు వేడుక లేనిదయింది. ఆభరణాల అక్కర తొలగింది. పాన్పు శూన్యమయింది. నాకు గృహిణీ, మంత్రీ, నర్మసచివుడూ, లలితకళా ప్రయోగంలో ప్రియశిష్యురాలూ అంతా నీవే కదా! ఇలాంటి నిన్నే హరించిన నిర్దయమైన మృత్యువు ఇక నాకు మిగిలించిం దేమున్నది?

మదిరాక్షీ! నోటితో నే నందించే రసవత్తరమైన మధువు గ్రోలడాని కలవాటుపడ్డ నీవు ఇప్పుడు పరలోకానికి పంపిన అశ్రుకలుషితమైన జలాంజలి నెలా త్రాగగలవు? ఎంత ఐశ్వర్యమున్నా నీవు లేనప్పుడు అజు



డనుభవించదగ్గ సుఖమంటూ ఇక నేమీ లేదు. నాసర్వస్వమూ నీవే. వేఱే విషయసుఖాలు నన్ను లోగొనలేవు".

కోసలాధిపు డిలా కరుణార్ధ గర్భితంగా ఇందుమతి నుద్దేశించి విలపించాడు. అది విని అక్కడ ఉన్న చెట్లు కూడా మకరంద బాష్పాలు వదిలాయి. పిమ్మట బంధుజనులు అతని ఒడినుండి కష్టంమీద ఆమెను తొలగించారు. ఆ దివ్యసుమమాలే చివరి అలంకారమైన ఆ సుందరిని అగురుచందన కాష్ఠాలతో ప్రజ్వరిల్లే చితిపై చేర్చారు. రాజై యుండికూడా శోకగ్రస్తుడై ఆడుదానితో అనుమరణం చెందాడన్న అపవాదు కల్గుతుందని అతడు ఆమెతో అగ్నిప్రవేశం చేయలేదే కాని జీవితేచ్ఛతో మాత్రం కాదు.

ఆపై దశాహం తర్వాత అజుడు గుణశేషురాలైన దేవి నుద్దేశించి చేయవలసిన విధు లన్నింటినీ ఉద్యానవనంలోనే సమగ్రంగా చేశాడు. పిమ్మట పౌరకాంతల కన్నీటి జాలులో తన దుఃఖప్రవాహాన్ని చూస్తున్నాడా అన్నట్లు ఇందుమతి చెంత లేకుండా పట్టణం ప్రవేశిస్తున్న భూపాలుడు రేయి కడచన్న చంద్రునిలా కనిపించాడు.

## వసిష్ఠుని సందేశం

యాగదీక్షితుడైన వసిష్ఠమహర్షి తన ఆశ్రమంలో వుంటూనే ధ్యానదృష్టితో రాజు దుఃఖమోహితు డయ్యాడని గ్రహించాడు. శిష్యుని ద్వారా ఈ క్రిందివిధంగా అతనికి సందేశం పంపాడు.

"రాజా! నీ దుఃఖ కారణం వసిష్ఠమునీంద్రులకు తెలుసు. అయినా వారి క్రతువు పూర్తి కాలేదు కాబట్టి నిన్ను ఓదార్చటానికి స్వయంగా రాలేకపోయారు. సదాచార సంపన్నుడా! నాద్వారా వారు కొన్ని సందేశవచనాలు పంపారు. ధీరమూర్తీ! గురువుగారి సందేశాన్ని సావధానంగా విని హృదయంలో నిల్పుకో! త్రిలోకాలలోనూ భూతభవిష్యద్వర్తమానాలను వసిష్ఠమునీంద్రులు ప్రతిబంధ రహితమైన జ్ఞానదృష్టితో చూడగలరు.

పూర్వం తృణబిందువనే మహర్షి తీవ్రతపస్సుకు పూనుకొన్నాడు. అందుకు భయపడి ఇంద్రుడు ఆయన తపస్సును చెరచడానికై హరిణి అనే అప్సరసను పంపాడు. ఆమె అతని యెదుట హావభావాది విలాసాలను ప్రదర్శించింది. తపోవిఘ్నం జరిగినందుకు మునీంద్రుడు శాంతి కోల్పోయి ఆగ్రహోదగ్రు డయ్యాడు. భూలోకంలో మనుష్యస్త్రీగా పుట్టుమని హరిణిని శపించాడు.

"భగవన్, నేను పరాధీనురాలిని. నా తప్పు దయతో మన్నించండి" అంటూ ఆమె ఆయన్ను శరణు వేడింది. మునీంద్రుడు దివ్యపుష్ప దర్శనాన్ని ఆమెకు శాపాంతంగా అనుగ్రహించాడు. ఆ దేవవనిత క్రథకైశిక వంశంలో జన్మించి నీకు పట్టమహిషి అయింది. బహుకాలానికి శాపం తొలగించే పూమాలను చూచి అసువులు వీడింది. ఆమె మృతికి చింతించవద్దు. పుట్టినవారు గిట్టక తప్పదు. ఈ వసుంధరను చక్కగా ఏలుకో. రాజులకు నిక్కమైన కళత్రం వసుమతే కదా! ఎంత అభ్యుదయం కల్గినా నీవు పూర్వం మదమత్తచిత్తుడవు కాలేదు. వికారానికి లోను కాకుండా మనసు నిగ్రహించుకొని నీ శాస్త్రజ్ఞతను ప్రకటించావు. మనోజ్వరం కలిగిన ఈ సందర్భంలో కూడా కాతరుడివి కాకుండా ఆ విజ్ఞానాన్నే ప్రదర్శించు. నీవు అనుమరణం చెందినా ఇపుడు నీకామె లభించదు. మరి ఏడిస్తే చేజిక్కుతుందా? పరలోకం చేరిన ప్రాణుల గతులు వారివారి కర్మననుసరించి భిన్న భిన్నంగానే వుంటాయి. శోకం మాని పిండోదకాదులతో నీధర్మపత్నికి తృప్తి కలిగించు. ఎడతెగని బంధవుల కన్నీరు ప్రేతాన్ని కాల్చివేస్తుందని పెద్దలంటారు.

శరీర ధారులకు మరణం స్వభావం. జీవితం యాదృచ్ఛికమని బుధులంటారు. అందువల్ల ప్రాణి క్షణకాలం పాటు జీవించినా లాభమే. మూఢుడు ప్రియనాశాన్ని ఎదలో గ్రుచ్చిన శల్యంగా భావిస్తాడు. బుద్ధిమంతుడు అది మోక్షోపాయం కావడంవల్ల దాన్నే పెరికి వైచిన శల్యంగా తలపోస్తాడు. తన దేహాత్మలకే సంయోగ వియోగాలు తప్పవని గ్రహించిన



పండితుణ్ణి పుత్రకళత్రాదులతోడి వియోగం బాధిస్తుందా? జితేంద్రియులలో శ్రేష్ఠుడవైన అజమహారాజా! పామరునిలా నీవు శోకించవద్దు. గాలి వీచినపుడు చెట్లతో పాటు కొండలు కూడా చలిస్తే ఇక వాటికీ వీటికీ తేడా ఏముంది?"

అజుడు ఉదారమతియైన వసిష్ఠుని వచనాన్ని అలాగే అని అంగీకరించి ఆయన శిష్యుణ్ణి పంపివేశాడు. కానీ ఆ ఉపదేశం దుఃఖసాంద్రమైన అతని హృదయంలో ప్రవేశించలేక ఆ గురువు చెంతకే తిరిగి వెళ్ళింది కాబోలు!

## అజమహారాజు అస్తమయం

తన పుత్రుడింకా రాజ్యపాలన సామర్థ్యం చాలని బాలుడు కావడంవల్ల అజుడు అతనిలో ఇందుమతీ సామ్యాన్నీ, ఆమె చిత్రాన్నీ చూస్తూ స్వప్నాలలో ఆమెతోడి క్షణిక సమాగమాలవల్ల ఆనందిస్తూ, ఎలాగో కష్టంమీద ఎనిమిదేండ్లు గడిపాడు. జువ్విమొలక సౌధతలాన్ని భేదించినట్లు శోక శంకువు అతని హృదయాన్ని బలాత్కారంగా భేదించింది. వైద్యుల కసాధ్యమై మరణ కారణమైనప్పటికీ, ఆ శోకశల్యాన్ని అతడు ప్రియురాలిని త్వరగా కలుసుకోవాలన్న ఔత్సుక్యంవల్ల లాభంగానే భావించాడు.

ఆపై ఆ భూపాలుడు సంస్కారవినీతుడూ, కవచధారణకు తగిన ప్రాయం కలవాడూ అయిన కుమారుణ్ణి శాస్త్రవిధి ననుసరించి ప్రజారక్షణకై నియోగించాడు. రోగపీడితమైన శరీరం వదలదలచుకొని ప్రాయోపవేశానికి పూనుకున్నాడు.

అలా అతడు గంగాసరయూ సంగమతీర్థంలో దేహం త్యజించాడు. వెంటనే దేవతలతో ఒకడై స్వర్గం చేరుకున్నాడు. అక్కడ మునుపటికంటె ఎక్కువ అందంతో మెరసిపోతున్న తన కాంతను కలుసుకున్నాడు. నందనవనంలోని క్రీడాగారాలలో ఆమెతో కూడి మళ్ళీ క్రీడించాడు.

* * *

## 9

# దశరథమహారాజు

మహారథుడైన దశరథుడు సంయమంతో ఇంద్రియాలను జయించి అటు మునులలోనూ, ఇటు క్షత్రియులలోనూ అగ్రేసరు డయ్యాడు. తండ్రి తర్వాత అతడు ఉత్తర కోసల దేశానికి ఆధిపత్యం వహించాడు. ఆ మహారాజు పరంపరా ప్రాప్తమైన పౌరజానపదప్రజానీకాన్ని శాస్త్రవిధి ననుసరించి పరిపాలించాడు. అందువల్ల పరాక్రమంలో క్రౌంచపర్వతాన్ని భేదించిన కుమారస్వామిని పోలిన అతనిపట్ల ప్రజలు మిక్కిలి అనురక్తు లయ్యారు. తగు సమయంలో జలాన్నీ, ధనాన్నీ వర్షించి కర్మకారుల శ్రమను పోగొట్టే వారు ఇంద్రదశరథు లిరువురే అని నాటి పండితులు ప్రశంసించేవారు. శాంతిపరుడూ, దివ్యతేజస్వీ అయిన అజుని కుమారుడు రాజ్యం పాలిస్తూ ఉండగా భూమి ఫలవంత మయింది. దేశంలో వ్యాధి ఎక్కడా అడుగు మోపనే లేదు. ఇక విరోధుల దురాక్రమణకు తావేది?

దశదిశలూ జయించిన రఘుమహారాజూ, అతని పుత్రుడైన అజమహారాజూ ఏలే సమయంలో లాగానే మహాపరాక్రమవంతుడైన దశరథుని పరిపాలనకాలంలో గూడా భూమి సిరిసంపదలకు నెలవై శోభిల్లింది. ఆ నరాధిపుడు సమత్వంలో యమధర్మరాజునూ, ధనవృష్టిలో కుబేరుణ్ణీ, దుష్టనిగ్రహంలో వరుణుణ్ణీ, తేజస్సులో సూర్యుణ్ణీ అనుకరించాడు. అభ్యుదయానికై పాటుపడుతున్న దశరథుడు వేట, జూదం, పానం, స్త్రీ – అనే వ్యసనాలకు లోబడలేదు. ప్రభువైన ఇంద్రుని చెంతకూడా అతడు దీనమైన పలుకు పలకలేదు. పరిహాస ప్రసంగంలో కూడా అతని నోట వ్యర్థమైన మాట వెలువడలేదు. రోషశూన్యుడైన ఆ భూపాలుడు శత్రువులపట్ల కూడా పరుష వచనాలు పలికినవాడు కాదు.

రాజు లతనినుండి వృద్ధి వినాశాలను రెండింటినీ చవిచూచారు. అతడు తన మాట పాటించేవారి పట్ల మిత్రుడుగా, తిరస్కరించే వారిపట్ల కఠినుడుగా



ప్రవర్తించాడు. ధనువు చేపట్టి రథ మధిష్ఠించిన ఆ భూపతి తానొక్కడే సముద్ర పర్యంతమైన భూవలయాన్ని జయించాడు. గజతురగయుక్తమైన అతని సేన కేవల మాతని విజయాన్ని మాత్రమే ఘోషించింది. సంపదలో కుబేరునితో సమానుడూ, సురక్షితమైన ఏకరథంతో భూమిని జయించినవాడూ, ధనుర్ధారీ అయిన ఆ దశరథునికి సముద్రఘోషలే విజయ దుందుభుల మ్రోతలయ్యాయి. ఇంద్రుడు వజ్రాయుధంతో పర్వతపక్ష బలాన్ని రూపుమాపాడు. అభినవ కమలాననుడైన దశరథుడు ధ్వనిస్తూ శరాలను వర్షించే ధనుస్సుతో శత్రుపక్షబలాన్ని శమింపజేశాడు. దేవతలు దేవేంద్రుని పాదాలకు ప్రణమిల్లినట్లే పృథివీపతులు మహాపౌరుషవంతుడైన ఆ దశరథుని చరణాలకు అతని నఖకాంతితో వర్ధిల్లిన మకుటమాణిక్య కాంతులుగల తమ శిరస్సులతో మోకరిల్లారు. రణ నిహతులైన శత్రురాజుల కళత్రాల ప్రేరణతో వారి మంత్రులు బాలురైన రాజపుత్రులచేత దశరథమహారాజుకు అంజలి ఘటింపజేశారు. అలక సంస్కారానికి నోచుకోని ఆ నృపసతుల పట్ల దయబూని అతడు సముద్రతీరంనుండి అలకానగరం వంటి అయోధ్యానగరానికి మరలి వచ్చాడు.

దశరథునిలా శ్వేతచ్ఛత్రం ధరించగల మహీపతి మరొకడు లేడు. అగ్ని చంద్రులతో సమాన తేజం కల్గిన ఆ ధరిత్రీపతి ద్వాదశ రాజమండలానికి ప్రధానుడై చక్రవర్తి పదాన్ని అధిష్ఠించాడు. అయినా ఇంకా జయించవలసిన మహీమండలం ఉన్నదో అన్నట్లు అతడెంతో జాగరూకుడై మెలిగాడు. యాచకుల మనోరథాలను పూరించేవాడూ, కకుత్థ్సకులోద్భవుడూ అయిన దశరథమహారాజునూ, మహావిష్ణువునూ తప్ప పతివ్రత అయిన కమలాదేవి మరొక భూపతిని సేవించి యెరుగదు. పర్వతాలనుండి ప్రభవించిన నదులు సాగరం చేరినట్లు పతివ్రతలైన మగధ కోసల కేకయ రాజపుత్రికలు అమిత్రులను నిగ్రహించిన దశరథుణ్ణి భర్తగా బడసినారు. అరాతులను హతమార్చే ఉపాయాలలో దిట్ట అయిన ఆ భూపాలుడు ముప్పురు దేవేరులతో

కూడుకొని ప్రజాపాలనాభిలాషతో మూడు శక్తులతో గూడి అవని కవతరించిన అమరేంద్రునిలా భాసించాడు. ఆ మహారథుడు సంగ్రామరంగంలో ఇంద్రునికి సాయపడ్డాడు. అతని బాణాలవల్ల భయరహితలైన సురవనితలు ప్రకృష్టమైన అతని భుజపరాక్రమాన్ని గానం చేశారు. బాహుబలంతో దిగంత సంపద లార్జించినవాడూ, తమోగుణ రహితుడూ అయిన ఆ ధరావల్లభుడు తలనుండి కిరీటం దించి యాగదీక్షితుడై ఎన్నో అశ్వమేధా లాచరించాడు. అతడు నాటించిన కనక యూపాల కాంతులతో తమసా సరయూ నదుల తటాలు ఎంతగానో శోభిల్లాయి.

కృష్ణాజినం, దండం, దర్భమేఖల ధరించి జింకకొమ్ము చేపట్టి మౌనవ్రతంతో దశరథుడు అధ్వరదీక్ష వహించాడు. అప్పుడతని శరీరం అనుపమ కాంతితో విరాజిల్లింది. ఆ తనువు నధిష్ఠించి పరమేశ్వరుడు దాన్ని ఇంకా ఎంతో దీప్తిమంతం చేశాడు. అవభృథస్నానం చేత పవిత్రుడూ, ఇంద్రియవిజేతా, దేవసభను అధిష్ఠించే యోగ్యత గలవాడూ అయిన ఆ నరపాలుడు సమున్నతమైన తన మస్తకాన్ని జలాన్ని వర్షించే పురుహూతుని యెదుట తప్ప మరొకరి చెంత వంచినవాడు కాడు. ఏకరథుడూ, బలవంతుడూ, ధానుష్కుడూ అయిన దశరథుడు పలుసార్లు కదనభూమిలో పురందరునికి ముందు పయనించేవాడు, అప్పుడతడు సూర్యుని కభిముఖంగా లేచిన ధూళిని రక్కసుల రక్తధారలతో నివారించేవాడు.

ఇంతలో తన దక్షిణయాత్ర పూర్తిచేసుకొన్న సూర్యుడు ఉత్తర దిశకు పయనించదలచి సారథిచేత సప్తాశ్వాలను మళ్లింపజేశాడు. మంచును తొలగించి ప్రభాతవేళలను పరిశుభ్రం చేస్తూ మలయాచలాన్ని పరిత్యజించాడు. యమ కుబేర వరుణేంద్రులతో సమస్కంధుడూ, అంచిత పరాక్రమవంతుడూ, సార్వభౌముడూ అయిన ఆ దశరథుని సేవించడానికో అన్నట్లు కొంగ్రొత్త కుసుమాలు చేతపట్టుకొని వసంతుడు విచ్చేశాడు.



## వసంతవర్ణన

మంచుతో మలినమైన చందనపు చివుళ్లతో నిండిన మలయాద్రిని వదలి దినకరుడు రాత్రివిరహంతో వేగే చక్రవాకాలమీద దయగొన్నాడా అన్నట్లు ఉత్తరాభిముఖుడై మెల్లగా పయనం సాగించాడు. మొగ్గలు తొడగడం, చివురించడం, తుమ్మెదల రొద, కోయిల కూతలు – ఇలా క్రమపరిణామం గల పాదపాలతో నిండిన వనస్థలి కవతరించి వసంతుడు నిండురూపంతో కన్నులపండువుగా ప్రత్యక్షమయ్యాడు. నీతితోనూ, శౌర్యాదిగుణాలతోనూ వర్ధిల్లి సజ్జనులకు ఉపకరించే, దశరథుని సంపదకై అర్థులు అరుదెంచినట్లే చైత్రుని రాకతో వృద్ధిబొందిన సరోవరాలలోని సరోజినికై షట్పదాలు, జలవిహంగాలూ వచ్చి చేరాయి. ఋతుధర్మానుసారం అప్పుడే కుసుమించిన అశోక పుష్పమే కాక చెలువలు చెవిలో చెరివిన చివుళ్లుగూడా కాముకులకు కామోద్దీపకా లయ్యాయి. వసంతుడు ఉద్యానవనలక్ష్మికి కావించిన కొంగ్రొత్త పత్రరచనల్లా వున్న గోరంటలు కొదమతుమ్మెదలకు తనివిదీరా మకరందపు విందులు పెట్టి వాటిచేత ఝుంకారం చేయించాయి.

కాంతలు తమ ముఖమద్యంతో వకుళవృక్షానికి దోహదం కల్పించారు. మద్యసదృశమైన సుగంధం వెదజల్లుతూ ఆ చెట్టు పూతపూసింది. మధువు నాశించి వచ్చి తండోపతండాలుగా మూగిన మధుకరశ్రేణులు ఆ మ్రాకును చీకాకుపరచాయి. వసంతలక్ష్మి మోదుగుపై వెలయించిన మొగ్గలు మదాతిరేకంతో సిగ్గు విడిచిన ప్రేయసి ప్రియునిపై తీర్చిన దంతక్షతాలం కరణాల్లాగా విలసిల్లాయి. దంతక్షతాలవల్ల దుర్భరమైన అధరాలతో మగువలు మంచును సహించలేకపోయారు. చలివల్ల జఘనస్థలాలనుండి మేఖలలు గూడా తొలగించారు. సూర్యుడు ఆ నీహారాన్ని కాస్తా తగ్గించగలిగాడే గాని బొత్తిగా తొలగించలేకపోయాడు. మొగ్గ తొడిగిన చూతలత మలయమారుతానికి తన చివుళ్లు కదులుతూ వుండగా అభినయం అభ్యసించే నర్తకిలా రాగద్వేషాలు జయించిన యోగుల చిత్తాలను గూడా మదింప

జేసింది. పూలతో నిండి పరిమళం వెదజల్లే ఆ వనపంక్తులలో మొదటిసారిగా పికములు ఆలపించిన పరిమితాలాపాలు విరళమైన ముగుదల పలుకుల్లా వినిపించాయి. వీనులవిందు గొల్పే మధుకరాల ఝంకారా లనే పాటలతోనూ, కుసుమా లనే కోమలరదన కాంతులతోనూ ఒప్పారిన ఉద్యానలతలు గాలితాకిడికి అభినయంతో కదిలే చిగురుటాకు లనే చేతులతో వెలుగొందాయి.

వకుళసౌరభాన్ని మించిన సౌరభం కల్గి లలితవిలాసాలకు కారణమై మదనోద్దీపకమైన మధువును మగలతో పాట మగువలు అనురాగంతో ఆస్వాదించారు. విప్పారిన పద్మాలతోనూ, మదించి మధుర ధ్వనులు గావించే హంసాది శకుంతాలతోనూ సొబగారే నడబావులు చిరునవ్వులతో అందాలు చిందే మోములు, ముఖరించే మొలనూళ్లుగల రమణులలాగా రాజిల్లాయి. ఆ మధుమాసంలో జాబిల్లితో శోభిల్లే రాత్రి అలసులయిన బాటసారులు హాయిగా ప్రొద్దుపుచ్చలేరని వారిపై దయగొన్నదో అన్నట్లు కుంచించుకు పోయింది. వసంతుని వల్ల కురుచబారి చంద్రోదయంతో తెల్లబోయిన కాంతిగల రజనీవధువు ప్రియసమాగమసుఖం కరువైన ప్రేయసి మాదిరి కృశించిపోయింది. తిలకవృక్షాల ఉపరితలా లనే ఉప్పరిగల మీద కూర్చుండి, పూదేనెలతోడి సంపర్కంతో సౌరభాలు వెదజల్లుతూ, మదనావేశానికి లోనైన మధుపా లనే పెక్కుమంది విలాసవంతులు తమతమ విలాసినులతో గూడి మధురంగా గానం చేశారు. మంచు విరిసిపోవడంవల్ల విమలకాంతు లీనుతూ సురతశ్రమ నివారించే తన కిరణాలతో చంద్రుడు మకరధ్వజం పైకెగుర వేసిన మన్మథుణ్ణి ఉద్దీపింపజేశాడు.

కలకూజితం కావించే కోయిలతో కూడినదై కమలధూళితో నిండిన గాలికి కదలుతూ, పువ్వుల బరువుతో వంగిన అశోకలత వేదనతో పరితపిస్తున్న విరహిణుల చిత్తాన్ని అగ్ని కధీనం చేసింది. నిర్మలమైన శశికిరణాలు, సుఖావహమైన వాయువు, పూచిన చెట్లు, మదించిన కోకిలలు



– వీటితో నిండి భోగప్రచురమైన ఆ వసంతఋతువు అమృత ప్రాయమై అలరారింది. ఆజ్యంతో ప్రజ్వరిల్లే అనలంవంటి కాంతి కలిగి వనేందిరకు కనకాభరణ ప్రతినిధియై, అతిసుకుమారమైన రేకులు, కింజల్కాలతో విలసిల్లే కొండగోగు పూలను వల్లభులు అందీయగా కాంతలు కుంతలాలలో ధరించారు. కాటుక చుక్కల్లా కమనీయాలై, పూగుత్తులపై తుమ్మెదలతో గూడిన తిలకవృక్షం వనితకు తిలకంలాగా ఆ వనస్థలికి శోభ సమకూర్చింది. వృక్ష మనే పురుషునికి సుందరియైన నవమాలికావల్లిక మధుగంధంతో కూడి చివురుటధరం మీద వ్యాపించిన కుసుమ సంభృతమైన చిరునగవుతో చూపరుల చిత్తాన్ని మత్తిల్లజేసింది.

అరుణరాగాన్ని పోలిన అంశుకాలు, చెవికెక్కిన యవాంకురాలు, కోకిలాలాపాలు – అనే మన్మథ సైన్యాలు విలాసవంతులను అబలలకు అధీనం చేశాయి. ధవళపరాగాలతో పరిపుష్టమై భ్రమర నికరాలతో గూడిన తిలక మంజరి నీలాలకలలోని ముక్తాజాలకంలా భాసిల్లింది. ధనుర్ధారి అయిన మదనునికి పతాకయైనదీ, వసంతలక్ష్మికి ముఖాలంకార చూర్ణమైనదీ, గాలికి కదిలే ఉద్యానవనంనుండి పైకెగిరినదీ అయిన ప్రసవరాగం వెంట తుమ్మెద బారులు పరుగులు దీశాయి. ఉవిదలు నవవసంతోత్సవంలో ఊయెల లూగుతూ తమకు నైపుణ్యమున్నా ప్రియుల కంఠం కౌగిలించుకోవాలన్న కాంక్షతో ఊయెలత్రాడు పట్టు సడలించారు.

"ఓ అతివలారా! ఆగ్రహం మానండి. పగ విడవండి. గతించిన జవ్వనం తిరిగిరాదు" అని కోయిలలు మదనుని మతాన్ని ప్రచారం చేసేసరికి వధూటులు ప్రణయకలహం మాని రమణులతో రమింపసాగారు.

విష్ణువుతోనూ, వసంతునితోనూ, మన్మథునితోనూ సమానుడైన ఆ దశరథమహారాజు విలాసవతులతో కూడి వసంతోత్సవం అనుభవించాడు. పిమ్మట వేటకు వెళ్లాలనుకున్నాడు. వేటవల్ల కదిలే లక్ష్యాన్ని పడగొట్టడంలో నేర్పు అలవడుతుంది. భయక్రోధాలకు గురిఅయిన మృగాల చిత్తవికారం

అవగతమవుతుంది. శ్రమను జయించడంవల్ల శరీరానికి లాఘవం కలుగుతుంది. అందుచేత అమాత్యుల అనుమతితో అతడు వేటకు బయలుదేరాడు.

## దశరథుడు వేటాడుట

ఆ పురుష శ్రేష్ఠుడు అడవిలో సంచరించడానికి తగిన వేషం ధరించాడు. వెడదమెడపై శరాసనం తగిలించుకొన్నాడు. గుఱ్ఱపుగిట్టల ధూళితో ఆకసానికి మేలుకట్లు అమర్చాడు. వనమాల సిగకు చుట్టుకున్నాడు. అకుపచ్చని కవచం తొడిగాడు. గుఱ్ఱపు దౌడువల్ల కుండలాలు కదలుతూ వుండగా మృగాలు సంచరించే భూముల్లో అతడు విహరించాడు. సుందరనయనుడూ, నీతివైభవంతో కోసల దేశాన్ని సంతోష పఱచినవాడూ అయిన ఆ నరపాలుడు దారిలో పయనిస్తుండగా లతాశరీరలైన వనదేవతలు తుమ్మెద లనే చూపులతో అతణ్ణి తిలకించారు.

జాగిలపు వేటగాండ్లూ, వలల వేటగాండ్లూ ముందుగానే అడవిలో ప్రవేశించారు. అక్కడ కార్చిచ్చు, దొంగల బెడద లేకుండా చేశారు. అశ్వసంచార యోగ్యమై, ఎడనెడా జలాశయాలు కలిగి మెకాలు, పిట్టలు, గురుపోతులూ గుంపులు గుంపులుగా వున్న కాననంలో దశరథుడు ప్రవేశించాడు.

భాద్రపదం మెఱపుతో గూడిన ఇంద్రచాపాన్ని పూనినట్లు మనోవ్యథారహితుడైన ఆ రాజు కనకవర్ణమైన అల్లెత్రాడుగల ధనుస్సు చేపట్టాడు. అతని ధనుష్టంకారధ్వని విని సింహాలు కినుక వహించాయి. ఆ నరపాలుని ముందట దర్భలు నమలుతూ ఒక పెద్ద జింకలమంద పొడకట్టింది. మదించిన ఒక నల్లయిర్రి ఆ మందముందు నడుస్తున్నది. పాలకోసం తహతహలాడుతున్న జింకపిల్లలు మాటిమాటికీ తల్లుల నడకను నిరోధిస్తుండగా ఆ మంద మందంగా ముందుకు సాగిపోతున్నది.



వడిగల వారువాన్ని అధిష్ఠించిన రాజు పొదినుండి బాణం చేబూని లేళ్ళ గుంపుకు ఎదురుగా వెళ్ళేసరికి అది చెల్లాచెద రయింది. కన్నీట తడిసిన ఆ జింకల బెదరుచూపులు గాలికి చెదరిన కలువరేకుల్లాగా అడవి నంతటినీ నలుపు చేశాయి. వెన్నునిలా విక్రమవంతుడైన ఆ విలుకాడు ఒక కురంగాన్ని గుఱిపెట్టి కొట్టబోయాడు. ఇంతలో ఆడులేడి తన సహచరున కడ్డుగా నిలవడం చూచాడు. తానూ కాముకుడే కాన కరుణార్ద్రచిత్తుడై చెవివరకూ లాగిన బాణాన్ని ఉపసంహరించుకొన్నాడు. ఇతర మృగాలపై శరసంధానం చేసినప్పుడు కూడా భయచంచలమైన వాటికళ్ళు చతురకామినుల చంచల నయన విలాసాలను గుర్తుకు దెచ్చే సరికి అతడు బిగించిన పిడికిలి సడలించక తప్పలేదు.

పిమ్మట బురద గుంటనుండి లేచి సగం నమలిన తుంగముస్తెలను జారవిడుస్తూ అప్పుడే పరువిడిపోయిన పందులమంద జాడవెంట ఆ దశరథుడు పయనించాడు. గుఱ్ఱం పైనుండి కొంచెం ముందుకు వంగి తమ్ము కొట్టబోతున్న రాజును మార్కొని ఆ పందులు ఎదురుదెబ్బ తీయాలనుకొన్నాయి. కాని అంతలో అలుగులు గ్రుచ్చుకొన్న తమ శరీరాలు ఆధారవృక్షాలకు అతుక్కుపోవడాన్ని అవి గుర్తించలేక పోయాయి.

పైబడటానికి ఉద్యమిస్తున్న ఒక అడవిదున్న కంటిని గురిచేసి దశరథుడు బాణం లాగి వదిలాడు. ఆ బాణం పిడికినెత్తు రంటకుండానే దాని దేహంలోంచి ముందుకు దూసుకు వెళ్ళి మహిషాన్ని ముందు నేలకూల్చి, తర్వాత తాను క్రింద పడింది. అతడు వాడి అయిన అర్ధ చంద్రబాణాలతో ఖడ్గమృగాలకు శృంగభంగం కలిగించి వాటితల బరువు దించివేశాడు. దుష్టనిగ్రహ ప్రవీణుడైన ఆ నృపాలుడు శత్రువుల తలబిరుసుతనాన్ని సహించలేదు గాని వాళ్ళ దీర్ఘజీవితంపట్ల అతనికి సహనం లేకపోలేదు. గాలికి విరిగి పైబడు పూచిన వేగిస కొమ్మలవలె, ఆకస్మికంగా గుహలనుండి

పైకి దుముక వచ్చిన పులుల నోట అదరు బెదరు లేక అతడు అభ్యాసబలంతో క్షణంలో శరపరంపరను గుప్పించి వాటిని అమ్ముల పొదులుగా మార్చివేశాడు.

'మృగరాజ' నామంలో పరాక్రమ సూచకమైన రాజశబ్దంపట్ల అతడు అసూయ వహించాడు కాబోలు! అందుకే పొదలలో దాగివున్న సింహాలను చంపదలచి పిడుగుపాటును బోలిన ధనుష్టంకారంతో వాటిని కలతబెట్టాడు. ఏనుగుల యెడ ఎడతెగని వైరం పూని వాటి కుంభస్థలాలను చీల్చి చెండాడే సింగాలను చంపి అతడు రణరంగంలో తనకెంతో సాయపడే గజాల ఋణాన్ని తీర్చుకొన్నట్లు భావించాడు.

మరొకచో చమరమృగాల చుట్టూ అశ్వాన్ని దౌడు దీయించాడు. చెవివరకూ లాగిన శరాలను వర్షించాడు. నరపతులకు చేసినట్లే ఆ మృగాలకు కూడా ధవళచామరాలు లేకుండా చేసి శాంతించాడు. దశరథుని సైంధవానికి చేరువలోనే ఒక నెమలి ఎగురుతూ వెళ్ళింది. అందమైన దాని పురిని చూడగానే అతడికి చిత్రమాల్యాలంకృతమై రతివేళలో ముడివీడిన తన ప్రేయసి కేశపాశం గుర్తుకు వచ్చింది. అందుకే అత డామయూరంపై సాయకం ప్రయోగించలేకపోయాడు.

తీవ్రంగా శ్రమపడటంవల్ల అతని ముఖాన చెమట బిందువులు పొటమరించాయి. చివురు దొన్నెలు చీల్చుకుంటూ మంచు తుంపరలతో గూడి వచ్చిన అడవిగాలి ఆ స్వేదకణాలను హరించింది. అలా ఆ భూపాలుడు తక్కిన పనులన్నీ మరచి రాజ్యభారం మంత్రులపై వుంచి వేటపై తరగని అనురక్తి పెంచుకొన్నాడు. గడుసరి పడుచులాగా వేటకూడా అతణ్ణి తన వశం చేసుకొన్నది. ఓషధు లనే దీపాలు వెలుగుతుండగా, అందమైన పూలూ, చివుళ్ళూ అమర్చిన పాన్పుపై ఆ నరపతి పరిజనులను దూరంగా వుంచి రాత్రులు గడిపేవాడు. ప్రాతఃకాలంలో పటహ శబ్దాన్ని పోలిన గజముల



కర్ణతాళధ్వనికి నిద్రనుండి మేల్కొనేవాడు. మధురమైన పక్షుల కిలకిలారావ మనే వందిమాగధ మంగళ గీతాలు వింటూ ఆనందించేవాడు.

## శాపప్రాప్తి

అత డొకనాడు అడవిలో ఒకదుప్పిని వెంబడించాడు. సేవకజనం కంటపడకుండా నురుగులు గ్రక్కుతున్న గుఱ్ఱంపై దౌడుతీసి మునిజనులు సేవించే తమసానదిని చేరుకొన్నాడు. ఆ నదిలో కుండను ముంచుతున్న ఒక పెద్ద బుడబుడశబ్దం వినిపించింది. అది గజబృంహితం అనుకొని అతడు ఆ వైపు శబ్దవేధి శరాన్ని ప్రయోగించాడు. నిజానికి ఆ పని రాజు చేయవలసింది కాదు. (యుద్ధంలో తప్ప గజవధ చేయకూడదు) అయినా దశరథుడు మర్యాద మీరి ప్రవర్తించాడు. పండితులు సైతం రజోగుణం పైకొన్నప్పుడు తప్పుదారిలో అడుగుపెడతారు గదా!

వెంటనే "హా! నాన్నా!" అనే ఆక్రందనం వినిపించింది. రాజు విషాదగ్రస్తుడై ప్రబ్బలి తీవపొదలమాటుననుండి వచ్చిన ఆ శబ్దానికి కారణం అన్వేషిస్తూ వెళ్ళాడు. అక్కడ కుండ చేపట్టి బాణవిద్ధుడై పడివున్న ఒక మునికుమారుణ్ణి చూచాడు. దుఃఖంవల్ల ఆ భూపాలుడు కూడా శల్యం గ్రుచ్చుకొన్న వానిలా అయిపోయాడు. ఆ దశరథుడు గుఱ్ఱంనుండి దిగి అతణ్ణి 'నువ్వు ఎవరివాడవు' అని ప్రశ్నించాడు. జలకుంభంపై శరీరం ఊనుకొనివున్న ఆ మునిసుతుడు తొట్రుపడుతున్న మాటలతో తాను ద్విజేతరుడైన ఒక తపస్వి కుమారుడనని చెప్పాడు. తండ్రివద్దకు తన్ను చేర్చమని అతడు రాజును అర్థించాడు. బాణం తీసి వేయకుండానే నృపుడు అతణ్ణి అంధులైన తల్లిదండ్రులవద్దకు తీసుకుపోయాడు. వారి ఏకైక పుత్రునిపట్ల గజభ్రాంతితో తాను కావించిన తప్పిదాన్ని తెలియపరిచాడు. ఆ వృద్ధదంపతులు ఎంతగానో విలపించారు. వారి అనుమతితో రాజు ఆ మునిపుత్రుని హృదయంనుండి వాడి ములికి వెలికి తీశాడు. వెంటనే ఆ బిడ్డ చనిపోయాడు.

ఆ వృద్ధతపస్వి చేతపట్టిన కన్నీటితోనే "ఓ రాజా! నీవుకూడా నా మాదిరే వార్ధకంలో పుత్రశోకంతో మరణిస్తావు" అని దశరథుణ్ణి శపించాడు. తోకద్రొక్కిన పిదప కాటువేసిన కాలసర్పంలా వున్న ఆ జడదారితో ప్రథమాపరాధి అయిన దశరథుడిలా అన్నాడు –

"భగవన్! పుత్రముఖపద్మ దర్శనానికి నోచుకోని నాకు మీరిచ్చిన ఈ శాపం ఒక విధంగా వరమే. రగులుతున్న అగ్ని దున్నవలసిన పొలాన్ని కాల్చినా విత్తనాలు మొలకెత్తడానికి అనువుగా చేస్తుంది కదా! నిర్దయుడూ, వధార్హుడూ అయిన వీడు ఇక ఇప్పుడేమి చెయ్యాలో సెలవివ్వండి!"

ఆ వృద్ధముని మరణించిన పుత్రునితో భార్యాసమేతంగా అనుమరణం చెందడానికి నిశ్చయించుకొన్నాడు. రగిలే చితిని ఏర్పాటు చేయుమని రాజు నడిగాడు. ఇంతలో అక్కడికి చేరిన అనుచరుల ద్వారా వెంటనే దశరథుడు ఆ పని నెరవేర్చాడు. చేసిన పాపంవల్ల అతడు చింతతో ఉత్సాహం కోల్పోయాడు. బడబాగ్నిని దాల్చిన సాగరం లాగా ఆత్మవినాశ కారణమైన శాపం వహించినవాడై అతడు పురికి మరలివచ్చాడు.

* * *

# 10

ఇంద్రతేజుడూ, మహైశ్వర్యవంతుడూ అయిన దశరథుడు పిమ్మట కొంచెం తక్కువగా పదివేల సంవత్సరాలు రాజ్యపాలన కావించాడు. పితౄణాన్ని తీర్చి పితృశోక తమస్సును వెంటనే తొలగించగల సుతుడనే జ్యోతి అతనికి లభించలేదు. మథనానికి ముందు రత్నాలు పొడసూపని సముద్రుని లాగా ఉత్పత్తి కారణాన్ని అపేక్షిస్తున్న సంతతికై ప్రతీక్షిస్తూ కొంతకాలం అతడు అలాగే ఉండిపోయాడు. సంతాన మభిలషిస్తున్న ఆ రాజుకొరకు ఋష్య శృంగాదులైన ఋత్విజులు నియతాత్ములై పుత్రకామేష్టిని ప్రారంభించారు.

అదే సమయంలో రావణుని పీడకు గురి అయిన దేవతలు వేసవిలో ఆతురులైన బాటసారులు ఛాయావృక్షాన్ని ఆశ్రయించినట్లు శ్రీమహావిష్ణువు నాశ్రయించారు. సరిగా వాళ్ళు సముద్రం చేరిన సమయానికే పురాణ పురుషుడు యోగనిద్రను త్యజించాడు. పెద్దల ఆభిముఖ్యం కలుగనున్న కార్యసిద్ధికి సూచకం కదా!

అప్పుడు శ్రీహరి ఆదిశేషుని శరీరంపై ఆసీనుడై ఉన్నాడు. శేషుని ఫణామండల మందలి మణికాంతులతో తన శరీరం ప్రకాశిస్తూ వుండగా ఆయన దేవతలకు కనిపించాడు. పద్మంపై కూర్చున్న శ్రీదేవి ఒడిమీది ఒడ్డాణాన్ని దుకూలంతో కప్పి అందుపై చివుళ్ళ వంటి చేతులు చాచింది. వాటిమీద భగవానుడు తన చరణాలు చాపి వున్నాడు. ఆయన కన్నులు వికసించిన తెల్ల తామరల్లా వున్నాయి. అలంకరించిన పీతాంబరం బాలాతపాన్ని పోలి వున్నది. యోగులకు సులభదర్శనుడైన ఆ దేవుడు పద్మనేత్రాలతో, బాలాతపవస్త్రంతో ఉదయవేళ దర్శనీయమైన శరదృతువులోని దివసం లాగా వున్నాడు. ఆయన విశాల వక్షఃస్థలంలో ధరించిన కౌస్తుభమణి శ్రీవత్సలాంఛనాన్ని తనకాంతిపుంజంతో అనురంజితం కావిస్తూ లక్ష్మీదేవికి విలాసదర్పణమై విలసిల్లింది.

దివ్యాలంకారశోభితాలై కొమ్మల బోలిన బాహువులతో ఆయన జలమధ్యంలో ఆవిర్భవించిన అపరపారిజాతం లాగా వున్నాడు. అసురాంగనల చెక్కిళ్ళపై గల మదరాగాన్ని మాయం చేసే సజీవమైన ఆయుధాలు జయఘోషలతో ఆయనను ఉపాసిస్తున్నాయి. వజ్రాయుధపు దెబ్బల గుర్తులు గల గరుడుడు శేషునితో వైరం విడనాడి అంజలి ఘటించి వినీతుడై ఆ దేవుని భజిస్తున్నాడు. ఆ యోగనిద్రావసాన కాలంలో భృగువు మొదలైన మహర్షులు "సుఖంగా శయనించారా?" అని ఆ పరమాత్ముని అడిగారు. ప్రసన్నపావనాలైన చూడ్కులతో ఆయన వారిని అనుగ్రహించాడు.

అసుర వినాశకుడైన ఆ మహావిష్ణువు ముందట దేవతలు మోకరిల్లారు. స్తవనీయుడూ, అవాఙ్మానస గోచరుడూ అయిన ఆ మాధవుని వారు ఇలా స్తుతించారు.

## మహావిష్ణుస్తుతి

"ఆదిలో విశ్వాన్ని సృష్టించి, పిదప పోషించి, కడపట సంహరిస్తూ సృష్టి స్థితి లయకర్తగా మూడు మూర్తులతో ప్రకాశిస్తున్న ఓ దేవా! నీకు ప్రణామాలు. సహజంగా మధురమైన వర్షోదకం ఆయాప్రదేశాలలో పడి వేరు వేరు రసాలను పొందుతుంది. అలాగే నిర్వికారుడవైన నీవు సత్త్వాదులైన ఉపాధులతో కూడి సృష్టికర్తృత్వం మొదలైన అవస్థలను పొందుతున్నావు. జపాకుసుమం మున్నగు రాగద్రవ్యాలతోడి కలయికవల్ల స్ఫటికం నానావర్ణాలు పొందుతుంది, అదే రీతిగా ఉపాధిసంయోగం వల్ల ఏకరూపుడవైన నీవు వివిధావస్థలు పొందుతున్నావు. దేవా! నీవు అపరిచ్ఛిన్నుడవు, పరిచ్ఛిన్న లోకుడవు. కోరికలు లేనివాడవు, కోరికలు తీర్చువాడవు. జయింపబడరానివాడవు, జయశీలుడవు, సూక్ష్మరూపుడవు, స్థూలజగత్తుకు కారణమైన వాడవు.

భగవన్! నీవు హృదయగతుడవైనా దూరస్థుడవు, నిష్కాముడవైనా తపోనిష్ఠుడవు, దయామయుడవైనా దుఃఖరహితుడవు. పురాణపురుషుడవైనా



అక్షరుడవు. నీవు సర్వం తెలిసినవాడవు, నిన్ను తెలిసిన వారెవ్వరూ లేరు. సర్వానికీ కారణం నీవు. నీకు కారణ మేదీ లేదు. నీవు సర్వప్రభుడవు. నీకు ప్రభు వెవ్వడూ లేడు. నీవు ఒక్కడవు. సమస్త రూపాలతో వెలుగొందేదీ నీవే.

దేవా! సప్తసామములు నిన్ను స్తుతిస్తున్నాయి. సప్తసముద్రాలలో శయనించేది నీవే. సప్తజిహ్వుడే నీముఖం. సప్తలోకాలకు ఆధారం నీవే. నాలుగు పురుషార్థాలను ప్రసాదించే జ్ఞానం, నాలుగు యుగాలతో గూడిన కాలపరిణామం, నాలుగు వర్ణాలతో కూడిన లోకం – ఇదంతా నాలుగు ముఖాలు గల బ్రహ్మరూపుడవైన నీనుండే ఉద్భవించింది. మోక్షాపేక్ష గల యోగులు అభ్యాసంతో మనస్సును నిగ్రహించి హృదయగతుడవు, జ్యోతిర్మయుడవైన నిన్ను ధ్యానిస్తారు. నీవు జన్మరహితుడవైనా జన్మిస్తున్నావు. నిరీహుడవైనా శత్రువులను చంపుతున్నావు. జాగరూకుడవై యుండీ నిద్రిస్తున్నావు. ఇలాంటి నీ తత్త్వం తెలిసినవా డెవడు?

నీవు శబ్దాది విషయాలను అనుభవించగలవు. ఘోరమైన తపస్సు చేయగలవు. ప్రజలను పాలించటానికీ సమర్థుడవు. తటస్థంగానూ ఉండగలవు. పలురకాలైన గంగాప్రవాహాలు చివరికి సింధువునే చేరుతాయి. అలాగే ఆయా దర్శనాలు ప్రతిపాదించే భిన్నభిన్న సాధనమార్గాలు తుదకు నీలోనే పర్యవసిస్తున్నాయి. నీయందే చిత్తం నిలిపి నీకే కర్మలు సమర్పించిన విరక్తులకు మోక్షం ప్రసాదించేవాడవు నీవే.

ప్రత్యక్షప్రమాణానికి గోచరించే ఈ పృథివ్యాదికమైన నీయైశ్వర్యమే ఇంతింతదని కొలవటానికి సాధ్యం కాకుండా వుంది. ఇక వేదవచనాలతోనూ, అనుమాన ప్రమాణంతోనూ మాత్రమే సాధించదగిన నిన్ను గూర్చి ఏమని చెప్పేది? స్మరణ మాత్రంతో నీవు జీవుణ్ణి పవిత్రుణ్ణి చేస్తున్నావు. ఇక నీ దర్శన స్పర్శనాదులవల్ల కలిగే ప్రయోజనాన్ని గూర్చి వేరే చెప్పాలా! సాగరంలోని రత్నాల కాంతుల లాగా, సూర్యుని తేజస్సుల లాగా అగోచరాలై

నీ చరిత్రలు స్తుతింప శక్యం కాకుండా ఉన్నాయి. నీవు పొందనిది గానీ, ఇక పొందవలసినది గానీ ఏదీ లేదు. అయినా లోకానుగ్రహకాంక్షతోనే జన్మలెత్తి కర్మలు చేస్తున్నావు. ప్రభూ! నీ మహిమను కీర్తించి ఇంతటితో విరమించడం శ్రమవలన, లేదా సంకీర్తన సాధ్యం కాకపోవడం వల్లనేగాని 'నీ గుణాలు ఇంతే' అన్న భావంతో మాత్రం కాదు."

ఈ రీతిగా వినుతించి దేవతలు విష్ణువును ప్రసన్నుణ్ణి చేసుకొన్నారు. సర్వోత్తముడైన ఆ దేవుని ఉద్దేశించి వారు చెప్పినది యథార్థవచనమే కాని ప్రశంస కాదు. ఆయన కుశల ప్రశ్న చేసి వారిపట్ల తన ప్రీతిని ప్రకటించాడు. అప్పుడు సురలు ప్రళయవేళ కాకున్నా మేరమీరి ప్రవర్తిస్తున్న రాక్షసుడనే సముద్రంనుండి తమకు కల్గిన భయాన్ని వెన్నునితో విన్నవించుకొన్నారు.

పిదప సముద్రతీరంలోని పర్వత గహ్వరాలలో ప్రతిధ్వనిస్తూ సాగర ఘోషను మించిపోయిన స్వరంతో భగవాను డీవిధంగా చెప్పాడు. పురాణకవియైన ఆ పరమాత్ముని వర్ణస్థానాలనుండి వెలువడి సంస్కారం సంపాదించుకొన్న భారతి నిజంగా చరితార్థ అయింది. ఆయన వదనంనుండి దంతకాంతులతో సహా వెలువడిన ఆ వాణి పూర్వం ఆయన చరణంనుండి ప్రవహింపగా మిగిలి పైకి ప్రసరించిన గంగ లాగా భాసించింది.

"దేవతలారా! ప్రాణుల సత్త్వరజోగుణాలను తమోగుణం పైకొన్నట్లు మీ ప్రభావ పరాక్రమాలను రావణు డాక్రమించాడని ఎఱుగుదును. ప్రమాదవశాత్తు కలిగిన పాపంతో సజ్జనుని హృదయం తపించినట్లే ఆ రావణునిచే లోకత్రయం తపిస్తున్నదని కూడా నాకు తెలుసు. మేము ఏక కార్యార్థులమే కాబట్టి ఈ విషయంలో ఇంద్రుడు నన్ను ప్రార్థించవలసిన పనిలేదు. అగ్ని తనకు తోడ్పడుమని గాలిని ప్రార్థించదు గదా! తన కత్తి కెరచేయక దశమ మస్తకాన్ని నాచక్రం పాలి భాగంగా ఆ రక్కసుడు నిలిపివున్నాడు. బ్రహ్మ ప్రసాదించిన వరదానంవల్ల దురాత్ముడైన ఆ రావణుని ఔద్ధత్యాన్ని సర్పారోహణాన్ని చందనవృక్షం సహించినట్లు సహించాను.



వాడు మానవుల పట్ల అనాదరభావంతో దేవతలనుండి మాత్రం మరణం సంభవించకుండా తపస్సంతుష్టుడైన బ్రహ్మను ప్రార్థించి వరం పొందివున్నాడు. అందువల్ల నేను దశరథపుత్రుడుగా జన్మించి వాడిములుకులతో వాని శిరస్సు లనే పద్మరాశిని యుద్ధభూమికి పూజార్హంగా చేస్తాను. విద్యుక్త విధానంతో యజ్వలు కల్పించిన, మాయావులైన నిశాచరులు ముట్టని హవిర్భాగాన్ని మీరు మళ్ళీ త్వరలో స్వీకరింప గలరు. వినువీథిలో రావణభయంతో మేఘాలలో దాక్కుంటున్న సుకృతులైన వైమానికులు ఇకపై పుష్పక దర్శన సంక్షోభం పొందకుందురుగాక! నిర్జరులారా! నలకూబరుని శాపం కారణంగా రావణుడు కావించే బలాత్కార కచగ్రహాలు సోకని చెరలోని అమరాంగనల వేణీబంధాలను మీరు అచిరకాలంలోనే విడిపించగలరు."

రావణు డనే వఱపులో వాడిపోయిన దేవత లనే పైరును ఈ విధమైన వాగ్వర్షంతో తడిపి ఆ కృష్ణమేఘం అంతర్ధాన మయింది. చెట్లు తమ పుష్పాలతో వాయువు ననుసరించినట్లు ఇంద్రాదిదేవతలు దేవకార్యార్థమై ఉపక్రమించిన విష్ణువును తమతమ అంశాలతో అనుగమించారు.

ఆపై రాజు కావించిన పుత్రకామేష్టి పూర్తి కాగానే ఋత్విజులకు కూడా విస్మయం కలిగిస్తూ ఒక దివ్యపురుషుడు అగ్నినుండి ప్రభవించాడు. ఆదిపురుషుడు అధిష్ఠించి వుండడంవల్ల తనకు గూడా మోయరాని పాయసాన్నంతో నిండిన ఒక హేమపాత్రను రెండుచేతులా పట్టుకొని ఆ పురుషుడు ప్రత్యక్షమయ్యాడు.

సముద్రుడు ఆవిష్కరించిన అమృతాన్ని వాసవు డందుకొన్నట్లు ప్రాజాపత్యు డందించిన పాయసాన్నాన్ని దశరథుడు స్వీకరించాడు. ముల్లోకాలకూ మూలకారణమైన దేవుడే ఆ రాజుకు పుత్రుడుగా పుట్టనెంచాడు. దీనివల్ల అసాధారణమైన ఆ నరేంద్రుని గుణాలు లోకానికి వెల్లడయ్యాయి. సూర్యుడు లేతయెండను దివికీ, భువికీ విభజించి

యిచ్చినట్లు, చరునామకమైన విష్ణుతేజాన్ని రాజు కౌసల్యకూ, కైకేయికీ పంచియిచ్చాడు. కౌసల్య జ్యేష్ఠపత్ని కావటంవల్ల మహీపతికి మాన్యురాలు. కైకేయి ఇష్టురాలు. అందువల్ల వాళ్ళిద్దరూ సుమిత్రను భాగదానంతో గౌరవించడం మంచిదని రాజు భావించాడు. ఉచితజ్ఞుడైన నరేంద్రుని అభిప్రాయం గుర్తెరిగిన పత్నులిద్దరూ తమతమ భాగాలనుండి సగం సగం పాయసాన్నం తీసి సుమిత్ర కిచ్చారు. గజకపోలాలనుండి స్రవించే మదరేఖలపట్ల భృంగాంగన అనురక్తి కలిగివుండినట్లు సవతు లిరువురిపట్లా సుమిత్ర ప్రణయంతో మెలగింది.

అమృతనామకాలైన సౌరనాడులు జలమయగర్భం ధరించినట్లు రాణులు ముప్వురూ ప్రజాభ్యుదయానికై దేవాంశ సంభూతమైన గర్భం ధరించారు. ఒకేసారి గర్భవతులైన ఆ రాజపత్నులు పొట్టకు వచ్చిన సస్యసంపదల్లాగా కొంచెం వెల్లబారిన శరీరాలతో విరాజిల్లారు. దేవేరు లందరూ శంఖ చక్ర గదా శార్ఙ్గ ఖడ్గ లాంఛనాలతో ఒప్పారే వామన పురుషులు తమ్ము కాపాడుతున్నట్లు కలలు గన్నారు. బంగారు రెక్కల కాంతిపుంజాన్ని వెదజల్లుతూ వేగంతో మేఘాలను ఆకర్షిస్తున్న గరుత్మంతుడు గగనవీథిలో తమ్ము మోసుకుపోతున్నట్లు వారికి స్వప్నం వచ్చింది. ఉరోజాల నడుమ వ్రేలాడేటట్లు పతి ఉంచిన కౌస్తుభాన్ని ధరించి పద్మాన్నే వీవనగా చేపట్టిన లక్ష్మీదేవి తమ్ము సేవిస్తున్నట్లు వాళ్ళు కలలో చూచారు. ఆకాశగంగలో స్నానంచేసి వేదమంత్రాలను ఉచ్చరిస్తున్న సప్తఋషులు తమ్ము ఉపాసిస్తున్న దృశ్యం వారికి స్వప్నంలో సాక్షాత్కరించింది.

ఆ విధంగా తాము కన్న కలలను రాణులు రాజుకు నివేదించారు. అది విని సంతసించిన దశరథుడు జగత్పితకు జనకుడు కాగలిగినందున తాను సర్వోత్తముడనని భావించాడు. ఏకరూపుడైన విష్ణుడు ఆ రాజపత్నుల గర్భాలలో అనేక రూపాలతో విడిపోయి గాలికి కదిలే నిర్మలజలాలలో ప్రతిమా చంద్రునిలాగా నివసించాడు.



## శ్రీరామాదుల జననం

పిదప ప్రసవసమయం రాగానే కౌసల్యాదేవి రాత్రివేళ ఓషధి జ్యోతిని ప్రసరింప జేసినట్లు తమో నాశకుడైన పుత్రుని ప్రసవించింది. మనోహరమైన తనయుని ఆకారం చూచి ప్రేరణ పొందిన దశరథు డాబిడ్డకు జగత్ప్రథమ మంగళమైన రాముడనే పేరు బెట్టాడు. సాటిలేని తేజంతో వెలుగుతున్న రఘువంశ ప్రదీపుడైన రాముని ముందు రక్షాగృహమందలి దీపాలన్నీ వెలవెల పోయినట్లయ్యాయి. రాముని పడకపై పడుకోబెట్టుకొన్న కృశోదరి కౌసల్య ఇసుకతిన్నెపై పద్మోపహారం కల్గి శరదృతువులో కృశించిన గంగానది లాగా భాసించింది.

కైకేయికి భరతుడనే శీలవంతుడయిన కుమారుడు కలిగాడు. వినయం సంపదను అలంకరించినట్లు అతడు తల్లిని శోభిల్లజేశాడు. చక్కగా అభ్యసించిన విద్య ప్రబోధవినయాలను ప్రసవించినట్లు సుమిత్ర లక్ష్మణ శత్రుఘ్నులనే కవలపిల్లలను కన్నది. భువిపై అవతరించిన పురుషోత్తముని స్వర్గం కూడా అనుగమించిందా అన్నట్టు వారి పుట్టుకతో జగమంతా దోషరహితమై, గుణోజ్జ్వలమై ప్రకాశించింది.

రావణ భీతితో అలజడి చెందిన నాల్గు దిక్కులు నాలుగు రూపులతో హరి అవతరించగానే ధూళిలేని వాయువులతో ఉచ్ఛ్వసించినట్టయ్యాయి. అంతవరకు రాక్షసపీడకు లోనయిన అగ్ని ధూమరహితు డయ్యాడు. సూర్యుడు ప్రసన్నత పొందాడు. వారి దుఃఖం నాటితో తొలగిపోయింది. శ్రీరాము డవతరించగానే రాక్షస లక్ష్మియొక్క అశ్రుబిందువులు రావణుని కిరీటం నుండి మణివ్యాజంతో నేల రాలాయి.

దశరథు డిప్పుడు పుత్రవంతుడు. రాజపుత్ర జననవేళ మ్రోగించవలసిన వాద్యాలు దేవదుందుభులతోనే ప్రారంభమయ్యాయి. సురలోకంలోని కల్పవృక్షాలు రాజభవనంలో కుసుమాలను కురిశాయి. ఆ పుష్పవర్షమే

సజ్జనులప్పుడు చేయవలసిన మంగళోపచారాలకు అంకురార్పణ మయింది. కుమారులకు జాతకర్మాది సంస్కారాలు పూర్తి అయ్యాయి. దాదుల స్తన్యం త్రాగుతూ జ్యేష్ఠ సోదరుని పోలిన పిత్రానందంతోసహా వారు దినదినాభివృద్ధి పొందారు. సహజంగానే వారు వినీతులు. స్వాభావికమైన అగ్నుల తేజం అజ్యాదులతో ఇంకా వృద్ధి పొందినట్లు వారి వినయం శిక్షణతో మరీ యినుమడించింది.

వసంతాది ఋతువులు నందనవనాన్ని విలసిల్లజేసినట్లు అన్యోన్యవిరోధంలేని ఆ నలుగురు సోదరులూ పావనమైన రఘుకులాన్ని ప్రకాశింపజేశారు. నల్గురిలోనూ సౌభ్రాత్రం సమంగా వున్నా, రామలక్ష్మణుల్లాగానే భరతశత్రుఘ్నులు గూడా ప్రీతి విశేషంవల్ల జంటగా ఏర్పడ్డారు. అగ్నివాయువుల్లాగా, చంద్రసముద్రులలాగా ఆ రెండు జంటలూ ఎన్నడూ విడిపోకుండా కలిసే వుండేవి.

ఆ రాకుమారులందరూ వేసవి చివర మబ్బులు పట్టిన దినాల్లాగా తేజస్సుచేతా, వినయంచేతా ప్రజల చిత్తాలను చూరగొన్నారు. నాల్గు రూపులతో వెలుగొందిన ధర్మార్థకామ మోక్షాల అవతారం లాగా ఆ భూపతిసంతతి నాలుగు విధాల విభక్తమై భాసిల్లింది. పితృభక్తి సంపన్నులైన ఆ రాజపుత్రులు సాగరాలు రత్నాలతో సంతసింప జేసినట్లు మహీపతిని వినయాది గుణాలతో ఆనందింపజేశారు.

రక్కసుల అసిధారలను మొక్కవోజేసిన దంతాలతో ఐరావతం భాసిస్తుంది. ఫలసిద్ధితో ప్రారంభాన్ని ఊహింపజేసే సామాద్యుపాయాలతో రాజనీతి రాజిల్లుతుంది. కాడిమానులవలె పొడవైన భుజాలతో విష్ణువు విలసిల్లుతాడు. అలాగే విష్ణ్వంశ సంభూతులైన ఆ నల్గురు పుత్రులతో రాజాధిరాజగు దశరథుడు ప్రకాశించాడు.

* * *

# 11

# విశ్వామిత్ర యాగసంరక్షణ

ఒకసారి విశ్వామిత్రుడు దశరథుని చెంతకు వచ్చాడు. తన యజ్ఞానికి కలిగే విఘ్నాలు నివారించడానికి రాముని తనతో పంపుమని ఆ క్షితీశ్వరుణ్ణి అర్థించాడు. రాము డప్పటికి పిల్లజుట్టు దాలుస్తున్న బాలుడే. ఐనా తేజోవంతుల విషయంలో వయస్సును లెక్కింపరు కదా! విద్వజ్జనారాధకుడైన నరేంద్రుడు లేక లేక కలిగిన రాముణ్ణి లక్ష్మణునితో సహా మునివెంట పంపుట కంగీకరించాడు. అడిగినవారికి అసువులు సైతం సమర్పించడానికి రఘువంశరాజులు ఎన్నడూ వెనుకాడినవారు కారు. భూపాలుడు రాకుమారుల ప్రయాణ సమయంలో పురమార్గాలను అలంకరించవలసిందిగా అనుచరులను ఆదేశించాడు. ఇంతలో గాలి నెచ్చెలులైన మేఘాలు పూలతో కూడిన వానజల్లులతో పట్టణవీథులను సంస్కరించాయి.

ధనుర్ధారులైన సోదరులు పిత్రాజ్ఞను పరిపాలించడానికై పయన మవుతూ తండ్రి పాదాలపై వ్రాలారు. దశరథుని కనులనుండి జారిన బాష్పబిందువులు కూడా అప్పుడే వారిపై రాలాయి. జనకుని కన్నీటితో కొద్దిగా తడిసిన శిఖలు గల ఆ ధానుష్క లిరువురూ పురజనుల చూపులే దారిలో కలువతోరణాలు కాగా మునివెంట నడిచారు.

విశ్వామిత్ర మహర్షి ఒక్క లక్ష్మణుని మాత్రమే రామునికి అనుచరునిగా తీసుకుపోగోరాడు. అందువల్ల రాజు సైన్యాన్ని వారికి తోడుగా పంపక ఆశీస్సునే అండగా పంపాడు. వారి రక్షణకు చాలినది తండ్రి ఆశీర్వాదమే కదా! రామలక్ష్మణులు తల్లుల చరణాలకు ప్రణమిల్లారు. పిదప మహాతేజస్వి అయిన మునీంద్రుని అడుగుజాడలలో పయనిస్తూ భాస్కరుని గతి ననుసరించే చైత్రవైశాఖాలలాగా భాసిల్లారు. అలల్లాగా చలించే బాహువులు గల వారి

నడక చంచలమైనా శైశవం కారణంగా శోభిల్లినదై వర్షాకాలంలో పేరుకు తగ్గట్లు గట్టుమీద ప్రవహించే ఉద్ధ్యనదం లాగానూ, గట్టులు తెగి పారే భిద్యనదం లాగానూ పొడకట్టింది.

సహజంగా ఆ రాజకుమారులు రాజసౌధాలలో మణికుట్టిమ ప్రదేశాలలో నడయాడేవారు. విశ్వామిత్రుడు వారికి దారిలో బల, అతిబల అనే విద్యల నుపదేశించాడు. ఆ విద్యా ప్రభావంవల్ల ఎంత దూరం నడచినా ప్రయాసకు లోను గాకుండా తల్లుల వద్ద ఉన్నట్లే వారు హాయిగా వుండిపోయారు. వాహనాలపై ప్రయాణానికి అలవాటుపడిన ఆ సోదరులు తండ్రికి ప్రియసఖుడూ, పూర్వకథావిజ్ఞుడూ అయిన మునీంద్రుడు చెప్పే ఎన్నో పూర్వగాథలు వింటూ నడక సాగించారు. ఆ కథలే వారిని మోసుకుపోతున్నవా అన్నట్లు తమ కాలినడక వారికి స్ఫురించనేలేదు.

అలా సాగిపోతున్న రాజపుత్రులను మడుగులు మధుర జలాలతోనూ, విహంగాలు విన సొంపైన కూజితాలతోనూ, గాలులు కమ్మని వాసన లీనే పుప్పొడితోనూ, నీలిమేఘాలు నీడలతోనూ సేవించాయి. ఇష్టమైన రామలక్ష్మణుల సందర్శనంతో అక్కడి తపోధనులకు కలిగినంత ప్రీతి తామరలతో శోభిల్లే జలాలనుగానీ, శ్రమతొలగించే చెట్లను గానీ చూచినప్పుడు కలుగలేదు. ధనుర్ధారియైన దశరథ పుత్రుడు ముక్కంటి కంటిమంటలలో కాలిపోయిన కందర్పుని తపోవనం చేరుకున్నాడు. అతడక్కడ అందమైన మేనితో అనంగునికి ప్రతినిధి అయినాడే గాని చేష్టతో ప్రతినిధి కాలేదు.

తాటకకు శాపం సంభవించిన వృత్తాంతం కౌశికుడు రామలక్ష్మణులకు వివరించాడు. ఆ రక్కసి చెడగొట్టిన వనమార్గంలో వారు వింటి కోపులు నేలమోపి అవలీలగా అల్లెత్రాళ్ళు బిగించారు. వాళ్ళ ధనుష్టంకారం చెవి సోకగానే కృష్ణపక్ష రాత్రిలాగా నల్లని మేను గల తాటక, చలించే కపాలా



లనే కుండలాలు దాల్చి కొంగల బారుతో కూడిన దట్టమైన మేఘమాలికలాగా, వారి ముందట పొడసూపింది.

మితి మీరిన వేగంతో దారిలోని చెట్లను కదిపివేస్తూ, పీనుగులకు జుట్టిన పేలికలు చీరగా ధరించి పెడబొబ్బలు పెడుతూ ఆ రాక్షసి శ్మశానక్షితితో రేగిన సుడిగాలి లాగా వచ్చి రాముణ్ణి చుట్టుముట్టింది. పురుషుల ప్రేవులు పిరుదులపై మొలనూలుగా వ్రేలాడుతుండగా, ఒక భుజాన్ని దండంలా పైకెత్తుకొని తన పైకి దూకుతున్న తాటకను రాముడు చూచాడు. వెంటనే అతడు బాణంతోపాటు స్త్రీవధ విషయకమైన దయను కూడా వదలి పెట్టాడు.

రాముని బాణం బండలాగా కఠినమైన దాని వక్షఃస్థలంలో రంధ్రం కావించింది. అంతవరకూ రాక్షస దేశాలను ప్రవేశించని యమునికి ఆ రంధ్రమే ప్రవేశద్వార మయింది. బాణం హృదిని భేదించగానే తాటక నేలగూలింది. కూలుతూ తన కానన భూమినే కాక త్రిలోకాలను జయించడం వల్ల స్థిరపడివున్న రావణాసురుని రాజ్యలక్ష్మిని గూడా కంపింపజేసింది. రాము డనే మన్మథుడు ప్రయోగించిన దుస్సహమైన శరం హృదయంలో ప్రవేశించగానే ఆ నిశాచరి గంధవంతమైన రక్తచందనం మైపూతగా పూసుకొని జీవితేశ్వరుని నివాసం చేరుకున్నది.

పిదప సూర్యకాంతమణి సూర్యునినుండి కట్టెలను గాల్చు జ్యోతిని గ్రహించినరీతిగా రాముడు తన విక్రమం చూచి సంతసించిన విశ్వామిత్ర మునినుండి రక్కసులను నేలగూల్చగల మంత్రయుక్తమైన అస్త్రాన్ని పరిగ్రహించాడు. తరువాత అతడు మునీంద్రుడు నిర్దేశించిన పావనమైన వామనాశ్రమం ప్రవేశించాడు. పూర్వజన్మ వృత్తాంతం గుర్తుకు రాకున్నా అతడి కక్కడ ఏదో వింత అనుభూతి కలిగింది.

అటుపిమ్మట విశ్వామిత్రుడు పూజాసామగ్రి సిద్ధం చేసుకొన్న శిష్యులతోనూ, పల్లవపుటాలనే అంజలి బంధాలతో నిల్చిన చెట్లతోనూ,

మోరలెత్తి చూచే మృగాలతోనూ కన్నులపండువైన తన ఆశ్రమం చేరుకున్నాడు. పర్యాయక్రమంగా ఉదయించే సూర్యచంద్రులు కిరణాలతో పెనుచీకటినుండి లోకాన్ని రక్షించినట్లు అక్కడ రామలక్ష్మణులు యాగదీక్షితుడైన ఋషిని శరాలతో విఘ్నాలనుండి రక్షించటాని కుపక్రమించారు.

ఇంతలో యజ్ఞవేదిక మంకెన పువ్వులంతేసి రక్తబిందువులతో కలుషిత మయింది. అది చూచి ఋత్విక్కులు స్రుక్స్రువాదులు చేతినుండి జారిపోగా చేసే పనులు వదలి కలత చెందారు. వెంటనే రాముడు అమ్ముల పొదినుండి బాణం వెలికి తీసి మొగమెత్తి పైకి చూచాడు. గ్రద్ద ఱెక్కల గాలికి చలించే టెక్కెములుగల రక్కసుల సైన్యం అతని కంటబడింది. ఇతరుల జోలికి పోకుండా ఆ సేనకు నాయకులైన సుబాహు మారీచుల నిద్దరినే రాముడు తన శరములకు గురిచేశాడు. మహోరగాలపై విక్రమించే గరుత్మంతుడు నీటిపాములపై ఉద్యమించడు గదా!

అస్త్రవిశారదుడైన రాముడు మహావేగం కల వాయవ్యాస్త్రాన్ని వింట సంధించాడు. దాని తాకిడికి పెనుగొండను పోలిన మారీచుడు పండుటాకులాగా నేలగూలాడు. మాయ పన్ని ఇటూ అటూ సంచరిస్తున్న సుబాహుణ్ణి నేర్పరియైన రాముడు అర్ధచంద్ర శరప్రయోగంతో కండలుగా దెగనరికి ఆశ్రమం వెలుపల కాకులకూ, గ్రద్దలకూ వేశాడు. ఆ రీతిగా యాగవిఘ్నం తొలగించిన రాకుమారుల యుద్ధశూరతను అభినందించి ఋత్విక్కులు మౌనవ్రతంలో వున్న మునీంద్రుని క్రతుక్రియలను క్రమం తప్పక పూర్తిచేశారు. ఆవభృథస్నానం కావించిన విశ్వామిత్రుడు ముంగురులు కదలాడుతుండగా తనకు ప్రణమిల్లిన ఆ సోదరులను ఆశీర్వదించి దర్భస్పర్శతో పవిత్రమైన హస్తతలంతో నిమిరాడు.

ఇంతలో మిథిలాధిపతియైన జనకుడు తన యాగానికి రావలసిందిగా విశ్వామిత్రుణ్ణి ఆహ్వానించాడు. మిథిలకు పయనమవుతూ మునీంద్రుడు



జనకుని ధనువును గూర్చి విని దానిపట్ల కుతూహలం కలిగివున్న దశరథ కుమారులను గూడా తనవెంట తీసుకుపోయాడు.

సుదూరం నడచి సాయంసమయానికి వారొక ఆశ్రమం చేరి అక్కడ విశ్రమించారు. మనోజ్ఞమైన తరువుల కిరవైన ఆశ్రమ మది. పూర్వం గౌతమపత్ని దేవేంద్రునికి క్షణకళత్రమైన దక్కడనే. అక్కడ రాయిగా పడివుండిన అహల్య చిరకాలానికి మళ్ళీ సుందరమైన పూర్వరూపం పొందింది. అందుకు కారణం పాపపరిహారకమైన రాముని పాదపరాగపు టనుగ్రహమే.

## సీతాకల్యాణం

అర్థకామాలతో కూడి రూపు దాల్చి వచ్చిన ధర్మమా అన్నట్లు రామలక్ష్మణ సమేతుడై మునీంద్రుడు మిథిలా నగరానికి వచ్చినాడని విని జనక భూపతి ఆయనకు ఎదురుగా వెళ్ళి ఉచిత మర్యాదలతో సపర్యలు చేశాడు. ఆ రాకుమారులు దివినుండి భువికి దిగివచ్చిన పునర్వసు నక్షత్రాధిదేవతల లాగా విరాజిల్లారు. కన్నుల కఱవు దీరా వారిని చూస్తున్న విదేహనగర జనులు మధ్యలో రెప్పపాటును గూడా సహించలేకపోయారు.

క్రతువు సమాప్తం కాగానే సమయజ్ఞుడైన విశ్వామిత్రుడు శివధనుస్సును చూడాలని రాముడు సంబరపడుతున్నాడని జనకునకు తెలియపరచాడు. జనకుడు సుప్రసిద్ధ వంశజుడైన ఆ బాలుని కోమల శరీరం చూచాడు. ఎవరికీ వంచ వీలుగాని తన ధనువునుగూర్చి చింతించాడు. ధనుర్భంగమనే కన్యాశుల్కం బాలరామునికి దుష్కరం కాదా అని దుఃఖించాడు.

అతడు విశ్వామిత్రునితో ఇలా అన్నాడు – “భగవన్! మహామదగజాలకే దుష్కరమైన కార్యమిది. ఇందులో ఏనుగుగున్న చేసే వ్యర్థప్రయత్నాన్ని నే నంగీకరింపలేను. ధనుర్ధారులైన ఎందరో నరేశ్వరులు ఆ వింటివల్ల సిగ్గుపడి

అల్లెత్రాటి తాకిడికి కాయలు గాచిన తమ భుజాలను 'చీ' యని నిందించుకుంటూ వెనుదిరిగిపోయారు."

అప్పుడు జనకునితో విశ్వామిత్రుడు "నరేంద్రా! మాటలెందుకు? రాముని బలం ఎలాంటిదో చూచి నీవే గ్రహిస్తావు. పర్వతం పైన వజ్రాయుధంలాగా నీ చాపం మీదనే రాముడు తన శక్తిని వ్యక్తం చేస్తాడు" అని చెప్పాడు. ఇంద్రగోపమంతటి నిప్పురవ్వలో దాహశక్తిని విశ్వసించినట్లు ఆప్తుడైన మునీంద్రుని మాటనుబట్టి జనకుడు బాలరాముని పరాక్రమాన్ని విశ్వసించాడు.

సహస్రనేత్రుడు ఇంద్రధనుస్సును ఆవిర్భవింప జేయటానికి మేఘాలను పురికొల్పినట్లు మిథిలాధిపతి శివధనుస్సును తేవటానికి పార్శ్వచరుల నాదేశించాడు. వెంటనే వారు వింటిని సభాస్థలికి మోసుకొని వచ్చారు. పూర్వం శంకరుడు పరుగిడుతున్న యజ్ఞమృగాన్ని కొట్టడానికి బాణం సంధించిన విల్లు అదే. నిద్రిస్తున్న మహాభుజంగంలా భీకరమైన ఆవింటిని రాముడు చేతికి తీసుకున్నాడు. సభాసదులు ఆశ్చర్యచకితులై చూస్తుండగా మదనుడు మృదువైన కుసుమచాపమును సంధించినట్లు అత డాకొండవంటి వింటి నవలీలగా వంచి అల్లెత్రాటిని సంధించాడు. అమితంగా లాగడంవల్ల ఆవిల్లు పిడుగుపాటువంటి ధ్వనితో విరిగిపోయింది. ఆ ధ్వని మళ్ళీ క్షత్రియకులం విజృంభిస్తున్నదని క్షత్రియులపై గాఢకోపం కల పరశురామునికి నివేదించిందా అన్నట్లు వినిపించింది.

శివధనుర్భంగంతో తన బలం ప్రదర్శించి శుల్కం చెల్లించిన రాముని జనకమహారాజు అభినందించాడు. రూపుదాల్చిన లక్ష్మిలా వున్న అయోనిజయైన తన పుత్రికను అతని కర్పించాడు. పావకుని సమక్షంలో లాగా తేజస్వి, తపోనిధి అయిన విశ్వామిత్రుని సమక్షంలో సత్యప్రతిజ్ఞుడైన జనకుడు రామునికి సీతను ప్రదానం చేశాడు. తన కొమార్తెను కోడలుగా



పరిగ్రహించి నిమివంశాన్ని భృత్యభావంతో అనుగ్రహించమంటూ మిథిలేశ్వరుడు కోసలేశ్వరుని చెంతకు పురోహితునిద్వారా సందేశం పంపాడు. అప్పుడు దశరథుడు తగిన కోడలికై అన్వేషిస్తున్నాడు. ఇంతలో అనుకూలవార్తతో ఈవిప్రు డానరేంద్రుణ్ణి సమీపించాడు. పుణ్యాత్ముల అభీష్టం కల్పవృక్షఫల తుల్యమై వెంటనే ఫలిస్తుంది కదా! ఇంద్ర సఖుడూ, ఇంద్రియ నిగ్రహపరుడూ అయిన దశరథుడు జనక పురోహితుణ్ణి యథోచితంగా సత్కరించాడు. ఆభూసురుని ద్వారా మిథిలాధిపతి సందేశం విన్నాడు. వెంటనే సైన్యధూళి సూర్యబింబాన్ని క్రమ్ముకొంటూండగా మిథిలానగరానికి బయలుదేరాడు.

దశరథుని సేనలు విదేహ రాజధాని చుట్టూ విడిసి అందలి ఉద్యాన వృక్షాలకు పీడ కలిగించాయి. ఉద్ధతమైన ప్రియుని సంభోగాన్ని సహించే ప్రేయసి లాగా ఆనగరలక్ష్మి ప్రీతితో ఏర్పడిన ఆ ఒత్తిడిని సహించింది. ఆచార నిష్ఠులూ, వరుణవాసవులతో సమానులూ అయిన ఆ యిరువురు భూపతులూ తమతమ వైభవాలకు తగినట్లు యథావిధిగా పుత్రీపుత్రుల వివాహమహోత్సవం నిర్వహించారు. రాముడు సీతనూ, లక్ష్మణుడు ఆమె సోదరియైన ఊర్మిళనూ, భరతశత్రుఘ్నులు కుశధ్వజుని పుత్రికలైన మాండవీ శ్రుతకీర్తులనూ పరిణయమాడారు.

నవవధువులను పరిగ్రహించిన ఆ నలువురు రాకుమారులు ఫలసిద్ధితో కూడిన దశరథుని సామ దాన భేద దండాలనే చతురుపాయాల లాగా భాసిల్లారు. వధూవరు లందరూ తమతమ కులశీల వయోరూపాదులు అలా సఫలం కావటంతో పరస్పరం కృతార్థులైనారు. ఈ విధంగా దశరథుడు నలుగురు సుతులకు అక్కడ వివాహక్రియ నిర్వర్తించి ఆపైన సంతోషముతో తన నగరికి బయలుదేరాడు. జనకుడు మూడు మజిలీల వరకూ వారితో నడచి పిదప వెనుకకు మరలాడు.

గట్లు తెంచుకొని పొంగి ప్రవహిస్తూ, చెట్లను కూలుస్తూ, పొలాలను ముంచివేసే నదీప్రవాహాలలాగా దారిలో ఒక చోట ధ్వజాలను పడగొడుతూ మహావేగంతో వీచిన యెదురుగాడ్పులు దశరథుని సేనను చీకాకుపరచాయి. పిమ్మట సూర్యునిచుట్టూ భీకరమైన పరివేషమండలం పొడకట్టింది. మండల మధ్యగతుడైన భానుడు గరుడుడు పరిమార్చిన పాముపడగనుండి జారిపడి ఆ సర్పశరీరంచే చుట్టబడ్డ మణిలాగా కనిపించాడు. డేగరెక్కలు అనే ధూసరితమైన ముంగురులతోనూ, సంజమబ్బు లనే నెత్తుట దడిసిన చీరలతోనూ కూడిన దిక్కులు రజస్వలలైన అంగనలలాగా చూడదగినవి కాకపోయాయి. సూర్యుడున్న దిక్కుకు జేరిన నక్కల కూతలు రాజుల రక్తంతో పితృతర్పణం కావించిన పరశురాముణ్ణి పురికొల్పుతున్నవా అన్నట్లు భయంకరంగా వినిపించాయి.

ప్రతికూల వాయువులు మున్నగు దుర్నిమిత్తాలు చూచి కార్యజ్ఞుడైన దశరథుడు "ఈ అనర్థం ఎలా శమిస్తుంది?" అని వసిష్ఠ మహర్షిని అడిగాడు. అది సుఖాంత మవుతుందని చెప్పి మహర్షి నరేంద్రుని మనోవ్యథను తేలికపరచాడు.

## పరశురామ నిగ్రహం

ఇంతలో సేన ఎదుట ఒక మహాతేజోరాశి ప్రాదుర్భవించింది. సైనికులు కళ్ళు తుడుచుకొని తేరిపార జూచి అది ఒక పురుషాకారమని గుర్తించారు. ఆ పురుషుడు తండ్రి అంశమైన జందెమూ, తల్లి అంశమైన విల్లూ దాల్చి సోమునితో గూడిన సూర్యుని లాగా, సర్పంతో కూడిన చందనతరువు రీతిగా భాసించాడు. తండ్రి రోషపూరితాత్ముడై మేర మీరినా అతని ఆజ్ఞను కాదనలేక భయంతో వణకుతున్న తల్లి తలను తెగనరికి ముందు దయనూ, పిదప భూవలయాన్నీ జయించినవా డతడే. ఇరవైయొక్క సార్లు తాను క్షత్రియులను హతమార్చిన లెక్కను తెలపడానికి కాబోలు ఇరవైయొక్క రుద్రాక్షలుగల జపమాలను కుడిచెవిపై ధరించి వున్నాడు.



జనకుని చంపినారన్న కోపంతో రాజుల నందరినీ పరిమార్చటానికి ప్రతిన బూని వున్న భార్గవరాముణ్ణి దశరథుడు చూచాడు. బాలురైన తన పుత్రులనూ, అప్పటి తన దుర్బలస్థితినీ తలచుకొని అతడు విషాదం పొందాడు. ఇటు పుత్రునిలోనూ, అటు ఘోరశత్రువులోనూ తుల్యంగా వున్న రామనామం హారంలోనూ, సర్పంలోనూ సమంగా వుండే రత్నంలాగా రాజుకు ప్రీతినీ, భీతినీ కలిగించింది.

'అర్ఘ్యమర్ఘ్య'మని అంటున్న ఆ నరపాలుని వైపు చూడకనే భార్గవరాముడు క్షత్రియులపట్ల కోపాగ్ని జ్వాలను పోలిన పైకెత్తిన కనుగ్రుడ్లు కల తన చూపును శ్రీరామునివైపు ప్రసరింపజేశాడు. వింటిని పిడికిట బట్టుకొని మరొక చేతివ్రేళ్ళ సందులలో బాణం త్రిప్పుతూ యుద్ధసన్నద్ధుడైన జామదగ్న్యుడు నిర్భయంగా ఎదుట నిలిచి వున్న శ్రీరామునితో ఇలా అన్నాడు.

"ఓయీ! తీరని అపకారం చేసి క్షత్రియజాతి నాకు శత్రువయింది. ఆ జాతిని అనేక పర్యాయాలు హతమార్చి శాంతించాను. నిద్రించే సర్పం కర్రదెబ్బకు లేచినట్లు ఇప్పుడు నీ పరాక్రమం విని మళ్ళీ రోషావిష్టుడ నయ్యాను.

జనకుని ధనువును ఇంతకు మునుపు ఇతర నరపతు లెవ్వరూ వంచలేకపోయారు. నీవు దాన్ని భగ్నం చేశావట గదా! అది విని నీవల్ల నా వీర్యమనే శృంగం భగ్నమైనట్లు భావిస్తున్నాను. ఇప్పటిదాకా ఈ లోకంలో రాముడనే పేరు నాకొక్కడికే చెల్లుబాటయింది. ఇప్పుడు నీవు ఎదిగి వచ్చేసరికి మరొకణ్ణి చెందిన ఆ రామశబ్దం నాకు సిగ్గు కలిగిస్తున్నది.

కొండలను సైతం పిండి చేసే అస్త్రం చేపట్టిన నాకు సమంగా కీడుచేసిన శత్రువు లిద్దరే కనిపిస్తున్నారు. అందులో హోమధేనువు దూడ నపహరించిన కార్తవీర్యుడు మొదటివాడు. నా కీర్తి నపహరింప బూనిన నీవు రెండవాడవు. అందువల్ల నాపరాక్రమం క్షత్రియులను తెగటార్చినదే అయినా నిన్ను

జయించకపోతే నాకు ప్రీతి కలిగించదు. గడ్డివామిలో చెలరేగినట్లు సముద్రంలో గూడా మండినపుడే గదా అగ్నిమహిమ ప్రశంసింపబడుతుంది!

పైగా నీవు విరిచిన ఆ శివధనుస్సు ముందే విష్ణుతేజంవల్ల బలహీనం చేయబడిందని తెలుసుకో! నదీ ప్రవాహంతో వ్రేళ్లు కదిలిన చెట్టును పిల్లగాలి గూడా పడగొట్టేస్తుంది. అంచేత ఈ నాధనుస్సును అందుకో! దీనిని అల్లెత్రాటితో దగిలించి శరసంధానం చేసి లాగు! యుద్ధం అట్లా ఉండనీ! నా వింటిని వంచ గలిగితే నీవు నాతో సమబలుడవే. అప్పుడు నీవు నన్ను జయించినట్లే భావిస్తాను. అలా కాక మంట లెగజిమ్మే నా పరశుధారకు భయపడితివా? వ్యర్థంగా అల్లెత్రాటిని లాగి దాని తాకిడితో బిరుసెక్కిన నీచేతి వ్రేళ్ళతో అభయప్రార్థన కావిస్తూ అంజలి ఘటించు!"

భీకరుడైన భార్గవరాముడు ఈ విధంగా చెప్పేసరికి చిరునవ్వుతో కదలాడే పెదవి గల శ్రీరాముడు అతని ధనుస్సును అందుకోవడమే అందుకు తగిన సమాధానంగా భావించి అందుకున్నాడు. పూర్వం నారాయణావతారంలో చేపట్టిన ధనుస్సు మళ్ళీ చేతికి వచ్చేసరికి రాముడు ఎంతో రమణీయంగా కనిపించాడు. కొంగ్రొత్త మబ్బు ఒక్కటే వున్నా అందంగా వుంటుంది. ఇక ఇంద్ర ధనుస్సుతో కూడినప్పుడు దీని సొగసు చెప్పాలా?

వెనువెంటనే బలవంతుడైన శ్రీరాముడు ఒక కోపును నేలపై మోపి చాపాన్ని అధిరోపించాడు. క్షత్రియాంతకు డయిన భార్గవుడు పొగ మిగిలిన నిప్పులాగా తేజోరహితు డయ్యాడు. పెరుగుతూ, తరుగుతూ వున్న తేజస్సులతో పరస్పరం ఎదురెదురుగా నిలుచుకొన్న వారిద్దరూ పున్నమనాటి సాయంసమయమందలి చంద్ర సూర్యులలాగా ప్రజలకు కనిపించారు.

పరాక్రమంలో కుమార సన్నిభుడైనా దయతో మెత్తబడిన రఘురాముడు తనపట్ల శక్తి వుడిగివున్న భార్గవుణ్ణీ, తాను సంధించిన అమోఘమైన శరాన్నీ చూచి ఇలా అన్నాడు.



"భార్గవా! నీవు నన్ను తూలనాడినా విప్రుడవన్న కారణంతో నిర్దయుడనై నిన్ను కొట్టలేకున్నాను. ఈ బాణంతో నీగమనాన్ని హరించమంటావా? లేక యాగార్జిత మయిన స్వర్గాన్ని హరించమంటావా? చెప్పు!"

అందుకు పరశురాముడిలా సమాధానం చెప్పాడు – "పరమపురుషా! నీవు పురాణ పురుషుడవని ఎరుగనివాడను కాను. భువి కవతరించిన నీ వైష్ణవ తేజం చూడాలన్న కాంక్షతోనే నీకిలా కోపం కలిగించాను. పితృద్వేషుల నందరినీ భస్మీకరించి సముద్ర పర్యంతమైన భూమిని పాత్రులకు దానం చేసి కృతకృత్యుడ నయ్యాను. ఇట్టి నాకు పరమపురుషుడవైన నీవల్ల పరాజయం కల్గటం శ్లాఘనీయమే. మతిమంతుల్లో శ్రేష్ఠుడవైన ఓ రామా! పుణ్యతీర్థ గమనానికై అవసరమైన నా గమనాన్ని కాపాడు! నాకు భోగకాంక్ష లేదు. అందువల్ల స్వర్గమార్గాన్ని అరికట్టినా నేను బాధపడను."

అందుకు రాఘవుడు 'సరే' అని అంగీకరించాడు. వెంటనే తూర్పువైపుగా మళ్ళీ శరాన్ని ప్రయోగించాడు. సుకృతం చేసినవాడైనా భార్గవరాముని స్వర్గమార్గాని కా బాణం ప్రతిబంధక మయింది. పిమ్మట రాఘవుడు 'క్షమించండి' అంటూ ఆ తపోనిధి పాదాలు స్పృశించాడు. పరాజితులైన శత్రువుల మ్రోల ప్రణమిల్లడమే బలవంతులకు కీర్తికర మవుతుంది కదా!

తదుపరి భార్గవరాముడు రఘురాముని చూచి "తల్లి నుండి నాకు సంక్రమించిన రాజసప్రవృత్తిని తొలగించావు. తండ్రినుండి వచ్చిన శమప్రవృత్తిలో నన్ను ప్రతిష్ఠించావు. నీకోరిక మేరకు స్వర్గహాని కలిగిస్తూ నీవు చూపిన ఈ నిగ్రహం నిజంగా నాపాలిటికి అనుగ్రహమే! ఇక నేను వెళ్ళివస్తాను. దేవకార్యం నిర్వహింప నున్న నీకు అవిఘ్న మగుగాక!" అని చెప్పి అంతర్ధానమైపోయాడు.

అతడు వెళ్ళగానే దశరథుడు విజయశాలి అయిన శ్రీరాముణ్ణి స్నేహాతిశయంతో కౌగలించుకొన్నాడు. తన కుమారుడు పునర్జన్మ పొందినట్లుగా భావించి సంతసించాడు. దావానలం చుట్టుముట్టిన చెట్టుపై కురిసిన వానలాగా క్షణకాలం దుఃఖానికి గురైన అతని కెంతో సంతోషం కలిగింది. తరువాత శివసదృశుడైన దశరథ మహారాజు దారిలో ఏర్పాటైన అందమైన పటకుటీరాలలో కొన్ని రాత్రులు గడపి అయోధ్యానగరం చేరుకున్నాడు. మిథిలానగర రాజకన్యకలను చూడగోరిన సాకేతపురకాంతల కన్నులు భవన గవాక్షాలకు కలువతోరణా లయ్యాయి.

* * *

## 12

తృప్తిగా విషయభోగాల ననుభవించిన దశరథుడు వార్ధకం పైకొనగానే ఉషఃకాలంలో తైలముడిగి వత్తి కొసకంటిన దీపజ్వాలలాగా నిర్వాణస్థితికి చేరువైనాడు. కైకేయిని శంకించి కాబోలు నెరసిన వెంట్రుకల నెపంతో వార్ధకం అతని చెవి చెంతకు వచ్చి శ్రీరామునికి రాజ్యలక్ష్మిని అప్పగించమని చెప్పింది. పురజనులకు ప్రీతిపాత్రుడైన రాముడికి పట్టాభిషేకం జరుగనున్నదన్న వార్త కాలువనీరు ఉద్యానవనంలోని ప్రతిచెట్టునూ సంతోషపెట్టినట్లు పౌరులలో ప్రతి ఒక్కరినీ ఆహ్లాదపరచింది. కాని క్రూర నిశ్చయురాలైన కైకేయి శోకతప్తుడైన దశరథుని వేడికన్నీటిచే రాముని అభిషేక సంభారాలను తడిపి చెడగొట్టింది.

అతిగా కోపించిన కైకేయిని భర్త అనునయింపబోయాడు. అప్పుడామె అతడు పూర్వం తనకు ఇస్తానని అంగీకరించి వుండిన రెండు వరాలను వర్షంతో తడిసిన నేల కలుగులో దాగిన పాములను వెలిగ్రక్కినట్లు బయలుపరచింది. పదునాల్గు సంవత్సరాలపాటు రాముని అరణ్యవాసాన్ని ఒక వరంగానూ, తనకు వైధవ్యం కలిగించనున్న భరతుని పట్టాభిషేకాన్ని మరొక వరంగానూ ఆమె కోరింది.

### శ్రీరామ వనగమనం

తొలుత తండ్రి తనకు ప్రసాదించిన రాజ్యలక్ష్మిని రాముడు దుఃఖిస్తూ అంగీకరించాడు. ఆపైన అడవికి పోవలసిందన్న ఆజ్ఞను సంతోషంతో శిరసా వహించాడు. పట్టుపీతాంబరాలు ధరించే టప్పుడు గానీ, నారచీరలు కట్టుకొనే సమయంలో గానీ అతని ముఖవర్ణంలో ఏమాత్రం మార్పులేక పోవడాన్ని చూచి పౌరులు ఆశ్చర్యపడ్డారు.

తండ్రికి సత్యవాక్య పరిపాలనా భంగం కలగకూడదని సీతాలక్ష్మణ సమేతుడై రాముడు దండకారణ్యం ప్రవేశిస్తూ సజ్జనుల హృదయాలలో కూడా ప్రవేశించాడు. రాముని వియోగంతో దుఃఖితుడైన దశరథుడు తన

కర్మఫలమైన శాపాన్ని స్మరించుకొని దేహత్యాగమే దానికి ప్రాయశ్చిత్తంగా భావించి ప్రాణాలు వదిలాడు.

రాజకుమారుల ప్రవాసంవల్లా, రాజమరణం వల్లా దిక్కులేనిదైన కోసలరాజ్యం రంధ్రాన్వేషణ సమర్థులైన శత్రువులకు భోగ్యవస్తు వయింది. అనాథులైన అమాత్యులు కన్నీటిని నిగ్రహించుకోగల ఆప్తసచివులను పంపి మేనమామ యింట వున్న భరతుణ్ణి పిలిపించారు.

కైకేయి కొడుకు తల్లివల్ల తండ్రికి వాటిల్లిన దారుణమరణాన్ని గురించి విని తల్లిపట్లనే కాక రాజ్యలక్ష్మి పట్లగూడా విముఖు డయ్యాడు. ఆశ్రమవాసులు చూపగా రామలక్ష్మణులు విడిది చేసిన చెట్లను చూస్తూ కంట తడిపెట్టిన భరతుడు సైన్యంతో సహా రాముని జాడను అనుసరించి అడవికి వెళ్ళాడు. చిత్రకూటవనంలో వున్న రాముడికి తండ్రి స్వర్గస్థుడైన వార్తను తెలిపి అయోధ్యకు తిరిగివచ్చి అనుభవింప బడని గుణాతిశయం కల రాజ్యశ్రీని చేపట్టుమని ప్రార్థించాడు. అగ్రజుడు సిరిని పరిగ్రహించనప్పుడు తాను దానిని స్వీకరించి పరివేత్త (అన్నకంటె ముందు పెండ్లి చేసుకొన్నవాడు) కావడం అనుచితమని అతడు భావించాడు.

స్వర్గస్థుడైన తండ్రి ఆజ్ఞనుండి రాముని మరలించలేక కడకు అతని పాదుకలనే రాజ్యాధిదేవతలుగా ప్రసాదించమని అర్థించాడు. రాముడందు కంగీకరించాడు. అక్కడినుండి మరలిన భరతుడు అయోధ్యను ప్రవేశించకనే నందిగ్రామంలో వుంటూ రాముడు ఇల్లడ యిచ్చిన దానిలా రాజ్యాన్ని పరిరక్షించాడు. అన్నపై దృఢభక్తి గలిగి రాజ్యతృష్ణకు విముఖుడైన భరతుడు పైరీతిగా తల్లిచేసిన పాపానికి తాను ప్రాయశ్చిత్తం ఆచరిస్తున్నాడా అన్నట్లు రాజ్యపాలన గావించాడు.

సీతాలక్ష్మణులతో కూడి శాంతచిత్తుడైన రాముడు అడవిలోని కందమూలాదులను ఆహారంగా స్వీకరిస్తూ యువకుడై ఉండి కూడా వృద్ధులైన ఇక్ష్వాకులు పాటింప వలసిన వనవాసవ్రతం పాటించాడు.



ఒకనాడు కొంచెం బడలిక చెందిన వానిలా వున్న రాముడు తన మహిమతో నీడను కదలకుండా జేసిన ఒక చెట్టుక్రింద సీత ఒడిలో శిరముంచి నిద్రించాడు. అప్పుడు ఇంద్రసంతానమైన కాకి ఒకటి ప్రియుని ఉపభోగపు గుర్తులలో దోషైకదృష్టితో ఘాతం కావిస్తున్నదా అన్నట్లు జానకి పాలిండ్లను గోటితో గాయపరచింది. వెంటనే సీత మేల్కొల్పగా లేచిన దాశరథి కాకిపై తెల్లు పుల్లను అభిమంత్రించి ప్రయోగించాడు. ఫలితంగా ఒక కన్ను పోగొట్టుకొని ఆ కాకి తుదకు ప్రాణరక్షణ కావించుకున్నది.

అది దగ్గరి ప్రదేశం గాబట్టి భరతుడు మళ్ళీ వస్తాడేమో అని శంకించి రాముడు తమ ఎడబాటును సహించలేక తహతహ లాడుతున్న లేళ్ళతో నిండిన చిత్రకూటాన్ని వదలి దూరంగా వెళ్ళాడు. ఆతిథ్యం సమకూరుస్తున్న ఋష్యాశ్రమాలలో వార్షిక నక్షత్రాలలో సూర్యునిలాగా నివసిస్తూ అతడు క్రమంగా దక్షిణదిశకు పయనించాడు. అతని వెంట నడుస్తున్న జానకి కైకేయి కాదన్నా గుణాలపై ఔతుక్యంతో అనుసరించే రాజ్యలక్ష్మిలాగా రాజిల్లింది.

అనసూయ సీతకు పూసిన పుణ్యగంధమైన మైపూత తావికి ఆకర్షింపబడి తుమ్మెద లన్నీ అడవిపూలు వదలి ఆమె చెంతకు వచ్చాయి. రాహువు చంద్రుణ్ణి నిరోధించినట్లు సంజమబ్బులాగా పసుపు మీరిన ఎఱుపు వర్ణం కల విరాధుడనే రాక్షసుడు రాముని త్రోవకు అడ్డు తగిలాడు. లోక శోషకుడైన ఆ దనుజుడు రామలక్ష్మణుల మధ్యనున్న జానకిని శ్రావణ భాద్రపదాల నడుమ వర్షాన్ని వఱపు హరించినట్లు హరించాడు. రామలక్ష్మణులు ఆ దైత్యుణ్ణి సంహరించి దుర్గంధంతో ఆశ్రమప్రదేశం చెడిపోకుండా భూమిలో పాతిపెట్టారు. పిదప రాముడు అగస్త్యుని ఆనతి మేరకు పూర్వస్థితిని పొందిన వింధ్యాద్రి లాగా హద్దు మీరక పంచవటిలో వుండిపోయాడు.

అక్కడ రావణుని చెల్లెలైన శూర్పణఖ కామ పీడితురాలై ఎండవేడిమికి గురి అయిన భుజంగి చందనతరువును ఆశ్రయించినట్లు రాముని చెంతకు

వచ్చింది. సీతసన్నిధిలోనే తన వంశాన్ని పేర్కొని ఆవిడ రామునిపై తనకు గల వలపు ప్రకటించింది. వేరమీరిన కామినుల కామం సమయాసమయాలను పరిగణించదుగదా!

వృషస్కంధుడైన రాముడు ఆ కాముకిని "బాలా! నాకు భార్య వున్నది. నాతమ్ముని చెంతకు వెళ్ళు" అని ఆజ్ఞాపించాడు. ముందు పెద్దవాని చెంతకు పోవడంవల్ల లక్ష్మణుడు కూడా ఆమెను నిరాకరించాడు. ఇరు దరులను ఒరసి పారే నదిలాగా మళ్ళీ ఆ రాక్షసి రాముని చెంతకే వచ్చింది.

ఆమె దుఃస్థితిని చూచి సీత నవ్వింది. గాలి లేకపోవడంవల్ల నిశ్చలమైన సముద్రజలాలను చంద్రోదయం కలత పరచినట్లు అంతవరకూ సౌమ్యాకృతితో వున్న శూర్పణఖలో ఆ నవ్వు సంక్షోభం కలిగించింది.

"ఈ పరిహాసానికి ఫలం వెంటనే అనుభవిస్తావు. ఇదిగో నన్ను చూడు! నీవు చేసిన పని పులిని లేడి అవమానించినట్లున్నది సుమా!" అని భర్త ఒడిలో భయంతో ఒదిగివున్న సీత నుద్దేశించి పలికి ఆ శూర్పణఖ తనపేరుకు తగిన రూపం ప్రదర్శించింది. మొదట కోకిల లాగా మధురంగా పలికి పిదప నక్కలాగా ఘోరంగా అరుస్తున్న ఆ రక్కసి మాట విని లక్ష్మణుడు అది 'మాయావిని' అని గ్రహించాడు. వెంటనే అతడు పర్ణశాల ప్రవేశించి ఒఱనుండి కత్తి తీసి దాని ముక్కు చెవులు గోసి ముందే భీకరంగా వున్న దాని వైరూప్యానికి పునరుక్తి కలిగించాడు. అంతట ఆకసాని కెగసిన ఆ రక్కసి వంకరగోళ్లు గలిగి వెదురు బొంగువలె కర్కశమైన గణుపులతో గూడి అంకుశంలాగా వున్న వ్రేలు చూపి రామలక్ష్మణులను బెదిరించింది.

ఆ దురాత్మురాలు జనస్థానానికి వడిగా వెళ్ళి రాముడి వల్ల మొదటిసారిగా రాక్షసులకు కల్గిన పరాభవాన్ని ఖరుడు మొదలగు నిశాచరులకు విశదపరచింది. వెంటనే ఆ దనుజులు రాముని మీదికి దండెత్తారు. ముక్కుచెవులు తెగిన రక్కసిని ముందు పెట్టుకోవడమే ఆ రాక్షస సైన్యానికి అమంగళమైనది.



ఆయుధాలు ధరించి గర్వితులై పైకి దూకుతున్న శత్రువులను చూచి రాముడు సీతారక్షణభారాన్ని లక్ష్మణునికీ, విజయసాధన భారాన్ని చాపానికీ అప్పగించాడు. రాముడు ఒక్కడే. రాక్షసులు వేలకొలది ప్రోగయ్యారు. కానీ రణరంగంలో ఎంతమంది రాక్షసులు ఉన్నారో, అంతమందికి అన్ని రూపులుగా రాముడు గోచరించాడు.

సజ్జనుడు దుర్జనులు కావించే దూషణను సహించనట్లే సదాచార సంపన్నుడైన రాముడు దుష్టనిశాచరులు ముందుకు పంపిన దూషణుడనే రాక్షసుని సహించనివాడయ్యాడు. ఖరుడు, దూషణుడు, త్రిశిరుడు అనే ముగ్గురినీ దశరథసుతుడు శరప్రయోగంతో నిగ్రహించాడు. అతడు వారిపై క్రమంగా ప్రయోగించినప్పటికీ, ఆ బాణాలు ధనుస్సునుండి ఒక్కుమ్మడిగా పైకెగిరినట్లు పొడసూపాయి. రక్తసిక్తం కాకుండానే దేహాల ఆవలికి దూసుకు వెళ్ళిన వాడి ములుకులు ఆ ముప్పురు రక్కసుల ఆయువునూ త్రాగి వేయగా, వారి రక్తాన్ని పక్షులు త్రాగాయి. విశాలమైన రాక్షసబలాన్ని రాముని శరాలు తరిగి వేశాయి. భండనభూమి వట్టి మొండాలతో నిండిపోయింది. బ్రతికి బయటబడిన వాడు ఒక్కడూ లేడు.

## సీతాపహరణం

రాక్షస వాహిని బాణాలను వర్షంలా కురియిస్తున్న రాముడిచేత యుద్ధం చేయించి తుదకు గ్రద్దల నీడలో శాశ్వతంగా కన్ను మూసింది. దాశరథి బాణాలతో దానవులు హతులైనారన్న దుర్వార్తను రావణునికి చేరవేయడానికి ఒక శూర్పణఖ మాత్రమే మిగిలింది. చెల్లెలిని నిగ్రహించి, ఆప్తబంధువులను హతమార్చడంతో రాముడు తన పది తలలమీద పాదం మోపినట్లు రావణుడు భావించాడు. అతడు మృగరూపుడైన దానవునితో రామలక్ష్మణులను వంచింపజేసి జటాయువుతో క్షణకాలం పోరాడి సీతను అపహరించుకుపోయాడు.

సీతను అన్వేషిస్తూ రామలక్ష్మణులు దశరథుని మైత్రీఋణం నుండి విముక్తుడై, రెక్కలు తెగి కంఠగతమైన ప్రాణాలతో పడివున్న జటాయువును

చూచారు. ఆ జటాయువు జానకిని రావణు డపహరించాడన్న వార్తను వాక్కుతోనూ, తన వీరోచిత కృత్యాన్ని గాయాలతోనూ వారికి తెలియజెప్పి కన్నుమూశాడు. అతని మరణంతో పితృవియోగశోకం క్రొత్తది కాగా రామలక్ష్మణులు తండ్రికి చేసినట్లు అతనికి అగ్నిసంస్కారాది క్రియలన్నీ నిర్వర్తించారు.

పిదప రాముడు వధించిన కబంధుడనే దైత్యుడు శాపవిముక్తుడయ్యాడు. అతని ఉపదేశంమేరకు రాముడు తనవలె పత్నీవియోగంతో విపన్నుడై వున్న సుగ్రీవునితో సఖ్యం పెంపొందించుకొన్నాడు. వీరుడైన రాముడు వాలిని వధించాడు. చిరకాంక్షితమైన అతని స్థానంలో ఒక ధాతువుయొక్క స్థానంలో ఆదేశమైన మరొక ధాతువును నిల్పినట్లు సుగ్రీవుణ్ణి నెలకొల్పాడు. సుగ్రీవుని ఆదేశంతో సీతాన్వేషణకై బయలుదేరిన వానరులు వియోగార్తుడైన రాముని కోరికలలాగా నలుదిక్కులా పరిభ్రమించారు. సంపాతి దర్శనంతో వారికి జానకి వార్త తెలియవచ్చింది. వెంటనే నిస్స్పృహుడు సంసారాన్ని తరించినట్లు హనుమంతుడు సాగరాన్ని దాటాడు.

అతడు లంకాపురం ప్రవేశించి వెదకుతూ విషలతల నడుమ వున్న సంజీవని లాగా రాక్షస స్త్రీల మధ్య వున్న జానకిని చూచాడు. రాముడు అభిజ్ఞానం కొఱకై యిచ్చిన ఉంగరాన్ని అతడు సీతకు సమర్పించాడు. దాన్ని చూడగానే ఆమె కన్నులనుండి చల్లని ఆనందాశ్రుబిందువులు జాలువారాయి.

ఆంజనేయుడు రాముని సందేశవచనాలతో సీతకు ఉపశమనం కలిగించాడు. ఆపై రావణపుత్రుడైన అక్షుణ్ణి సంహరించాడు. బ్రహ్మాస్త్ర ప్రయోగంతో ఇంద్రజిత్తు కలిగించిన బాధను క్షణకాలం సహించాడు. పిదప లంకానగరాన్ని తగులబెట్టాడు. ఈ రీతిగా కృతకృత్యుడై అతడు రూపు దాల్చి స్వయంగా వచ్చిన వైదేహి హృదయమా అన్నట్లున్న ఆ దేవి యిచ్చిన ప్రత్యభిజ్ఞానరత్నాన్ని రాముని కందజేశాడు. ఎదపై ఉంచుకొన్న ఆ చూడామణి



స్పర్శతో నిమీలితనేత్రుడై ఆనందించిన రాముడు స్తన స్పర్శరహితమైన ప్రియాలింగన సౌఖ్యాన్ని చూరగొన్నాడు.

సీత వృత్తాంతం విని ఆమెను చేరుకోవాలన్న ఔత్సుక్యంతో అతడు లంకను పరివేష్టించి వున్న మహాసముద్రాన్ని అగడ్తలా తేలికగా భావించాడు. ఒక్క భూతలం మీదే కాక ఆకసాన కూడా క్రిక్కిరిసి తన్ను అనుసరించిన వానరసైన్యాలతో రాముడు శత్రు నిర్మూలనానికై బయలుదేరాడు. స్నేహవశాన బుద్ధిగుహలో ప్రవేశించి రాక్షసరాజ్యలక్ష్మి చేసిన ప్రేరణచే గాబోలు విభీషణుడు సాగరతీరం చేరిన రాముణ్ణి శరణు జొచ్చాడు. రాముడాతనికి రాక్షసాధిపత్యం కట్టబెడతానని ప్రతిన చేశాడు. సమయం చూచి ప్రయోగించిన నీతులు ఫలప్రదాలు కాకపోతాయా?

రాముడు వానరులచే లవణసాగరంపై వంతెన నిర్మింపజేశాడు. మహావిష్ణువు శయనించడానికై సాగరంనుండి పైకి దేలిన శేషునిలాగా ఆ సేతువు పొడచూపింది. ఆ సేతుమార్గాన సాగరం దాటి రాముడు వానరబృందంతో కూడా లంక చేరుకొన్నాడు. ఆ నగరాన్ని చుట్టుముట్టిన సువర్ణవర్ణం కల కపిసేన దానికి రెండవ స్వర్ణప్రాకారమా అన్నట్లు భాసించింది.

## రామరావణ సంగ్రామం

లంకలో రాక్షసులకూ, వానరులకూ భీకరంగా పోరాటం చెలరేగింది. రామరావణ జయశబ్దాలు దిక్కులు పిక్కటిల్లేటట్లు వినిపించాయి. వృక్ష ప్రయోగాలతో పరిఘలు విరిగిపోయాయి. శిలల తాకిడికి ముద్గరాలు పొడి అయ్యాయి. వాడిగోళ్ళ విన్యాసాలు శస్త్రాల నతిక్రమించాయి. కొండలు గజాలను హతమార్చాయి.

పిదప రాక్షస మాయానిర్మితమైన రాముని శిరఃఖండం చూచి సీత మూర్ఛపోయింది. అది మాయాప్రభావమని చెప్పి త్రిజట ఆమెను

తేరుకొనజేసింది. "నా నాథుడు జీవించే వున్నాడు" అని సీత శోకం తరించింది. కాని "ముందు రాముడు నిజంగా మరణించాడని నమ్మి జీవంతో వుంటినే" అని ఎంతో సిగ్గుపడింది.

ఇంద్రజిత్తు నాగాస్త్రప్రయోగంతో రామలక్ష్మణులను బంధించాడు. గరుడుని రాకతో ఆ అస్త్రబంధం విడిపోయింది. క్షణకాలం వారనుభవించిన క్లేశం స్వప్న సంఘటన లాగా తోచింది. పిదప రావణుడు శక్తిని ప్రయోగించి లక్ష్మణుని వక్షఃస్థలాన్ని భేదించాడు. ఆ దెబ్బ రామునికి తగలకపోయినా శోకంతో అతని హృదయం భిన్నమైంది. ఆంజనేయుడు తెచ్చిన సంజీవనీ మహౌషధితో లక్ష్మణుడు తేరుకొన్నాడు. మళ్ళీ అతడు శరప్రయోగంతో లంకలోని స్త్రీల యేడుపులకు ఆచార్యకం వహించాడు. శరత్కాలం మేఘగర్జితాన్నీ, ఇంద్రధనుస్సునూ రూపుమాపినట్లే లక్ష్మణుడు మేఘనాథుని సింహనాదాన్నీ, ఇంద్రాయుధతుల్యమైన ధనుస్సునూ నిశ్శేషం కావించాడు.

సుగ్రీవుడు, ముక్కు చెవులు గోయగా శూర్పణఖతో పోలిక సంతరించుకొన్న కుంభకర్ణుడు, సమ్మెట దెబ్బలకు తెగిపడిన మనశ్శిలలు గల పర్వతంలాగా వచ్చి రాముని నిరోధించాడు. "నిద్రా ప్రియుడవైన నిన్ను అకాలంలో వ్యర్థంగా మీ అన్న మేలుకొలిపాడు" అని చెప్పి కాబోలు రామబాణాలు అతణ్ణి దీర్ఘనిద్రకు గురిచేశాయి.

సమరభూమిలో రేగిన పరాగం రాక్షసుల రక్తప్రవాహంలో పడినట్లే ఇతర రాక్షసులు గూడా వానరానీకం పైబడి అణగారిపోయారు. పిదప రావణాసురుడు "నేడు జగత్తు అరావణమో, అరామమో కాక తప్పదు" అంటూ ఇల్లు వెడలి యుద్ధానికి నడిచాడు. పాదచారియైన రాముణ్ణీ, రథస్థుడైన రావణుణ్ణీ చూచి ఇంద్రుడు కపిలవర్ణం కల గుఱ్ఱాలు పూంచిన రథాన్ని రామునికై పంపాడు. వియద్గంగాతరంగాల గాలికి రెపరెపలాడే జెండా గలిగి జయశీలమైన ఆ రథాన్ని రాముడు మాతలిచేతి నూతగా గొని అధిరోహించాడు.



రాక్షసుల అస్త్రాలను కలువదళాల వలె నిరర్థకం చేయగల మహేంద్రుని కవచాన్ని మాతలి రాముడి మేన ధరింపజేశాడు. బహుకాలానికి అన్యోన్య దర్శనంతో పరాక్రమించడానికి అనువుగా ఏర్పడ్డ నాటి రామరావణుల పోరాటం చరితార్థమైన దానివలె ఒప్పారింది. బంధుజనులు మరణించడంతో పరిచారక శూన్యుడైన రావణుడు తాను ఒక్కడే ఉన్నా పెక్కు చేతులు, పెక్కు తలలు, పెక్కు కాళ్ళు వుండడంవల్ల మాతృవంశస్థులైన అనేక రాక్షసులతో కూడినవానిలా తోచాడు. లోకపాలురను జయించినవాడూ, తన శిరస్సులతో శివుని అర్చించినవాడూ, కైలాసాన్ని పైకెత్తినవాడూ అయిన పగతుణ్ణి దాశరథి గొప్పగానే సంభావించాడు.

సీతాసంగమ సూచకంగా చలిస్తున్న రాముని కుడి భుజంపై మహాకోపి అయిన దశకంఠుడు వాడి శరం నాటాడు. రాముడు ప్రయోగించిన బాణం అతని హృదయాన్ని భేదించి పాతాళవాసులైన ఉరగులకు ప్రియం చెప్పడానికో అన్నట్లు భూమిలో ప్రవేశించింది.

మాటతో మాటను ఖండించే వాది ప్రతివాదులకు లాగానే అస్త్రంతో అస్త్రాన్ని భేదించే వారిరువురి పరస్పర జయసంరంభం అంతకంతకూ పెరిగిపోయింది. పోరాడే రెండు మదగజాల మధ్య వేదిక లాగా పర్యాయక్రమంతో విక్రమం ప్రదర్శించే వారిరువురి నడుమ జయలక్ష్మి సమానస్థితి వహించింది. ప్రయోగానికీ, ప్రతిప్రయోగానికీ హర్షించిన సురాసురులు వారిపై వర్షించిన పుష్పవృష్టిని పరస్పర శరజాలం సహించలేక మధ్యలోనే నిరోధించింది.

విజయలబ్ధమైన కూటశాల్మలి నామకమగు యముని గద లాగా వున్న ఇనుప చీలలు కీలించిన శతఘ్నిని రావణుడు రామునిపై ప్రయోగించాడు. తన రథాన్ని సమీపించక ముందే రాక్షసుల ఆశతోపాటు ఆ శతఘ్నిని రాముడు అర్ధచంద్ర ముఖశరాలతో అరటి మ్రాకును నరకినట్లు నరకివేశాడు.

## రావణవధ

సాటిలేని మేటి విలుకాడైన రాముడు సీతాశోకశల్యాన్ని తొలగించే మహౌషధమైన అమోఘమగు బ్రహ్మాస్త్రాన్ని వింట సంధించి ప్రయోగించాడు. ఆ అస్త్రం మింట దేదీప్యమానమైన నూరు ముఖాలతో వ్యాపించి భీకరమైన పడగలు గల శేషుని శరీరంలాగా తోచింది. మంత్ర ప్రయుక్తమైన ఆ బ్రహ్మాస్త్రంతో రాముడు నొప్పి తెలియని రీతిగా త్రుటిలో రావణుని శిరః శ్రేణిని నేలగూల్చాడు. అలా తెగి పడిన రాక్షసేశ్వరుని పదితలలు నీటిలో అలలచే పెక్కురూపులుగా విడిపోయిన బాలసూర్యుని ప్రతిమలలాగా కనిపించాయి. దశముఖుని తలలు నేల రాలినప్పటికీ మళ్ళీ అతని శరీరాని కవి అంటుకుంటాయేమో అన్న సందేహంతో దేవతలు పూర్తిగా నమ్మలేకపోయారు.

ఆపై త్వరలో రాజ్యాభిషేకం పొందనున్న రాముని శిరస్సుపై దేవతలు పుష్పవృష్టి కురియించారు. మదధారలచే తడిసి బరువెక్కిన రెక్కలుగల తుమ్మెదలు ఆ పుష్ప సౌరభంతో ఆకర్షింపబడి ఐరావతాది మదగజాల గండభాగాలను వదలి భువికి వచ్చాయి.

దేవకార్యం తీర్చి నారి సడలించిన రామునివద్ద మాతలి సెలవుగైకొన్నాడు. పేరు చెక్కిన రావణుని బాణాలు నాటిన ధ్వజదండం గలిగి, వేయి గుఱ్ఱాలు బూన్చిన ఆ దివ్య రథాన్ని వెంటనే మాతలి ఊర్ధ్వలోకానికి తరలించుకు పోయాడు.

పిమ్మట రఘుపతి అగ్ని శుద్ధురాలైన సీతను పరిగ్రహించాడు. అనుగు చెలికాడైన విభీషణునికి రావణ రాజ్యలక్ష్మిని కట్టబెట్టాడు. సుగ్రీవ విభీషణ లక్ష్మణాదులు వెంట రాగా పరాక్రమవిజితమైన పుష్పకవిమానం అధిరోహించి అయోధ్యకు పయన మయ్యాడు.

* * *

## 13

# అయోధ్యకు పయనం

పిదప గుణజ్ఞుడూ, హరి యవతారమూ అయిన శ్రీరాముడు పుష్పక విమానమెక్కి శబ్దగుణక మయిన ఆకసంలో పయనిస్తూ సముద్రం వైపు చూచి సీతతో ఏకాంతంలో ఇలా అన్నాడు–

"వైదేహీ! నేను నిర్మించిన సేతువుచే మలయాద్రి వరకూ రెండుగా విభజింపబడి నురుగులు గ్రక్కుతున్న ఈ సాగరాన్ని చూడు. ఇది చక్కని చుక్కలతో విరాజిల్లుతూ, ఛాయామార్గంచే రెండుగా విభజింపబడిన శరత్కాలంలోని ఆకసంలాగా ఉన్నది.

సగరచక్రవర్తి యాగం చేస్తూ వుండగా యాగాశ్వాన్ని ఇంద్రుడు పాతాళానికి తీసుకువెళ్ళి కపిలమునివద్ద ఉంచాడు. దాన్ని అన్వేషిస్తూ భూమిని త్రవ్విన మాపూర్వులవల్లనే ఈ సాగరం ఇంతగా పెరిగిందట! సూర్యకిరణాలు ఈ సముద్రంవల్లనే జలమయగర్భం ధరిస్తున్నాయి. ధనసంపదలు కూడా ఇందులోనే వృద్ధి పొందుతున్నాయి. జలాన్ని దహించే బడబాగ్నినిగూడా ఈ సాగరమే భరిస్తున్నది. చంద్రుని పుట్టిల్లు గూడా యిదే.

విష్ణుని రూపం లాగానే వివిధావస్థలు పొందుతూ దశదిశలా వ్యాపించిన ఈ సముద్రుని రూపం ఇట్టిదని గానీ, ఇంతటిదని గానీ నిర్ణయింప వీలుగానిదైవున్నది. లోకా లన్నింటినీ సంహరించి కల్పాంతకాలంలో యోగనిద్రా ముద్రితుడైన విష్ణుడు నాభికమలంలో వున్న తొలి విధాత తన్ను స్తుతిస్తూ వుండగా ఈ సముద్రంమీదనే శయనిస్తాడు.

శత్రువులకు భయపడిన నరపతులు ధర్మప్రధానుడైన మధ్యమభూపతి నాశ్రయించినట్లు ఇంద్రునిచే ఆక్రమింపబడిన అద్రులు వందలాదిగా వచ్చి ఈ సాగరుణ్ణే శరణు పొందుతున్నాయి. రసాతలంనుండి ఆదివరాహం

భూదేవిని ఉద్వహించినపుడు.* (పైకెత్తినప్పుడు, పెండ్లాడినప్పుడు – అని ధ్వని) ఆ ప్రళయంలో పొంగిన స్వచ్ఛమైన సముద్రజలమే ఆమెకు ముహూర్తకాలం ముఖావకుంఠన మయింది. అనితర సాధారణమైన భోగసామర్థ్యం కల ఈ సముద్రుడు తన తరంగాధరాన్ని నేర్పుతో నదులచే త్రాగిస్తూ, అదే సమయంలో ఆ నదు లందిస్తున్న తరంగాధరాన్ని తాను త్రాగుతూ వుంటాడు.

ఈ తిములు (పెద్దజాతి చేపలు) నోరు దెరచి జలజంతువులతో సహా నదీ ముఖజలాన్ని త్రాగి నోరు మూసుకొని తలపై గల రంధ్రాలనుండి జలప్రవాహం పైకెగజిమ్ముతున్నాయి చూడు! వేగంగా పైకెగిరే మాతంగాలవంటి మొసళ్ళవల్ల సముద్రంలోని నురుగులు రెండుగా చీలిపోతున్నాయి. ఆ నురుగులు వాటి కపోలభాగాలపై బడి క్షణకాలం వాటికి కర్ణచామరాలలాగా భాసిస్తున్నాయి. గట్టున వున్న గాలికొరకై వెలికి వచ్చిన పాములు పెద్ద పెద్ద అలలను పోలివున్నాయి. అవి సూర్యకాంతిచే ప్రతిఫలించే పడగలమీది మణులవల్లనే అలలనుండి వేరుగా గుర్తించ వీలవుతున్నాయి. అలల తాకిడికి శంఖాలు నీపెదవితో పోటీపడుతున్న పగడాలపై ఎగసిపడుతున్నాయి. పైకెగ్రబాకే విద్రుమాంకురాలతో తమ ముఖం కుట్టివేయబడగా ఆ శంఖాలు అతికష్టంతో అక్కడనుండి తొలగిపోతున్నాయి.

నీరు త్రావబోయి సుడితాకిడికి గిర్రున దిరుగుతున్న మబ్బును చూస్తే మళ్లీ ఈ కడలిని మందరాద్రి మథిస్తున్నదా అనిపిస్తున్నది. అయశ్చక్రాన్ని పోలిన లవణసాగరం చుట్టూ చీకటి చెట్లచేత నల్లబడి దూరానికి సన్నగా కన్పిస్తున్న తీరభూమి చక్రాని కంటించిన మాలిన్యరేఖలాగా భాసిస్తున్నది. విశాలాక్షీ! తీరప్రాంతవాయువు కేతక రేణువులతో నీముఖాన్ని అలంకరిస్తున్నది. నీపెదవికై ఆశపడి అలంకరణ క్రియలో ఆలస్యాన్ని సహించలేని నన్నది పసిగట్టినదేమో! ఇసుకలో విప్పారిన ముత్తెపు చిప్పలు విరజిమ్మిన ముత్యాలతోనూ, పండ్ల బరువుకు వంగిన పోకచెట్లతోనూ కూడిన యీ సముద్రతీరాన్ని విమానవేగంవల్ల మనం ముహూర్తంలో చేరుకున్నాము.



హరిణప్రేక్షిణీ! ఇప్పుడు మనం దాటివచ్చిన త్రోవపై ఒకసారి చూపు సారించు. దూరమైపోతున్న సముద్రంనుండి అడవితో కూడిన నేల వెలికి పరుగిడి వస్తున్నట్లున్నది. ఈ విమానం ఒకచోట దేవతా మార్గంలోనూ, మరొకచోట మేఘమార్గంలోనూ, ఇంకొకచోట పక్షుల మార్గంలోనూ పయనిస్తున్నది. నేను మనస్సులో ఎలా అనుకుంటే అలా అది పోతున్నది, చూడు. ఐరావత మదగంధంతో కూడి గంగాతరంగ సంగంతో చల్లనైన ఆకాశవాయువు ఈ మధ్యాహ్న సమయంలో నీముఖంపై పొటమరించే చెమటబొట్లను హరిస్తున్నది.

చండీ! కుతూహలంతో నీవు చేయి గవాక్షలనుండి వెలికి చాచి తాకేసరికి మెఱపు వలయాన్ని సృష్టించిన మేఘం నీకు రెండవ కంకణం సమకూర్చి పెట్టినట్లున్నది. ఈ తాపసులు జనస్థానంలో ఇక బెడద లేదని గ్రహించి చిరకాలం క్రిందట వదలిపోయిన తమతమ ఆశ్రమాలకు తిరిగి వచ్చి క్రొత్తగా పర్ణశాలలను నిర్మించుకొంటున్నారు. నీవు జారవిడువగా నీయడుగు దామరల ఎడబాటుతో దురపిల్లినదా అన్నట్లు మూగవోయి నేలపై బడివున్న నూపురాన్ని నిన్ను వెదుకుతూ వచ్చి చూచినది ఇక్కడనే. ఓ భీరూ! నిన్ను రక్కసుడు ఏదారిలో అపహరించుకుపోయాడో, ఆ దారిని మాటలతో చెప్పలేక దయతో ఈ తీగలు వంగిన చివుళ్ళు గల రెమ్మలతో నాకు చూపాయి. దర్భమొలకలపై ఆశ వీడి ఆడు లేళ్ళు రెప్పలు వాల్చని కళ్ళతో దక్షిణంవైపు చూస్తూ నిన్నన్వేషిస్తున్న నాకు నీవు పోయిన త్రోవ తెలిపాయి.

ఇదిగో! ఆకసమంటే ఈ మాల్యవత్పర్వత శిఖరం ముందువైపు పొడసూపుతున్నది, చూడు. ఈ శిఖరం మీదనే మబ్బులు క్రొత్త నీళ్ళనూ, నేను నీ వియోగాశ్రువులనూ ఒకేసారి వదలడం జరిగింది. ఇక్కడే వర్షధారలతో తడిసిన మడుగుల గంధాలు, అరవిరిసిన కడిమిపూలు, మధురమైన నెమళ్ళ కేకలు నీకు దూరమైన నాకు సహించరాని వయ్యాయి.

ఓ భీరూ! చలికి వడవడ వడకుతూ పూర్వం నీ వొనర్చిన గాఢాలింగనాన్ని స్మరిస్తూ నేను ఇందలి గుహల్లో ప్రతిధ్వనించిన మేఘగర్జనలను ఎలాగో

సహించగలిగాను. పూచిన నేల యరటిపూలు ఎడతెరపి లేని వానకు నేలనుండి పైకెగసిన ఆవిరితో కూడినవై పెళ్ళినాడు హోమధూమం సోకి ఎఱ్ఱవారిన నీ కళ్ళను గుర్తుకు దెస్తూ నన్ను బాధించాయి. నలుప్రక్కలా వంజులవనాలతో కప్పబడి కొంచెం కనిపించే చంచలమైన సారసపక్షులతో గూడిన ఈ పంపా సరోవరంలోని జలాలను దూరంనుండి దిగిన నా దృష్టి అలసటతో త్రాగి వేస్తున్నట్లున్నది.

ప్రియురాలా! నీకు దూరమైపోయిన నేను ఇక్కడ పరస్పరం కలువకేసరా లందించుకొంటూ కలసి మెలసి విహరించే చక్రావాకాల జంటలను ఎంతో అభిలాషతో చూచాను. ఈ సరస్తీరంలో రమణీయాలైన పూగుత్తులతో వంగిన యీ సన్నని అశోకలతను చూచి నీవే అని భ్రమించి కౌగిలించుకోబోయాను. ఇంతలో లక్ష్మణుడు నివారించగా కన్నీరు గారుస్తూ వుండిపోయాను. విమానపు టంచులలో వ్రేలాడగట్టిన బంగరుగజ్జెల సవ్వడి విని సజాతీయ పక్షుల శబ్దమని భ్రమపడి పైకెగసే యీగోదావరిలోని సారసపక్షులు నీకు ఎదురుకో లివ్వడానికి వస్తున్నట్లున్నాయి.

ఇదిగో! ఈ పంచవటివైపు చూడు. నీవు నీ సన్నని నడుముతో కడవలలో నీళ్ళు మోసి ఇక్కడి లేతమామిడి చెట్లను పెంచావు. నీవు పోషించిన ఆ లేళ్ళు మోరలెత్తుకొని మనవైపే చూస్తున్నాయి. చిరకాలానికి కనిపించిన ఈ చోటు నాహృదయాని కెంతో ఆనందం కలిగిస్తున్నది. వేటనుండి తిరిగివచ్చి ఈ గోదావరీ తీరంలో అలలపై నుండి వీచే చల్లని పిల్లగాలులచే శ్రమ దీర్చుకొని ఏకాంతంలో నీ ఒడిలో శిరసు పెట్టుకొని ఇచ్చటి ప్రబ్బలి పొదరిండ్లలో నిద్రించిన సంగతి యిప్పుడు గుర్తుకు వస్తున్నది.

పూర్వం భ్రూభంగమాత్రంతో నహుషుణ్ణి ఇంద్రపదవినుండి చ్యుతుణ్ణి చేసినవాడూ, బురదనీటిని పరిశుద్ధం చేసేవాడూ అయిన అగస్త్యమునీంద్రుని భూలోకగతమైన ఆశ్రమమిది. విమల యశస్కుడైన ఆ మహాముని వేల్చే త్రేతాగ్నుల నుండి హవిర్గంధంతో కూడి పైకి లేస్తున్న ధూమం మన విమాన



మార్గాన్ని ఆక్రమిస్తున్నది. ఆ ధూమాన్ని ఆఘ్రాణించడంవల్ల రజోగుణ విముక్తమైన నా అంతఃకరణం తేలికపడుతున్నది.

మానినీ! ఇది శాతకర్ణి మహర్షి క్రీడాసరస్సు. దీన్ని "పంచాప్సర" మని అంటారు. చుట్టూ అడవులతో కూడిన ఈ మడుగు మబ్బుల నడుమ కనిపించే చంద్రబింబంలా వున్నది. పూర్వం ఆ మహర్షి దర్భాంకురాలు మాత్రమే తింటూ మృగాలతో సమంగా తిరుగుతుండేవాడు. అతని తపస్సుకు భయపడి ఇంద్రుడు ఐదుగురు అప్సరసలను పంపి వారి యౌవన మనే బోనులో అతణ్ణి బంధించాడట! ఆ మునీశ్వరుని నిరంతర సంగీత మృదంగ శబ్దం మడుగు నీటిలోపలి మేడనుండి వెలికి వస్తున్నది. అది ఆకాశమంటి ఈ పుష్పక విమానంలోని చంద్రశాలను క్షణకాలం ప్రతిధ్వనింపజేస్తున్నది.

అడుగో మరొక తపోధనుడు! పేరుకు సుతీక్ష్ణ డయినా అతడు స్వభావంతో సౌమ్యుడు. సూర్యుడు లలాటాన్ని తపింపజేస్తుండగా ఇంధనాలతో ప్రజ్వరిల్లే చతురగ్నుల మధ్యనుండి అతడు తపస్సు చేస్తున్నాడు. అతని తపస్సుకు గూడా భీతిచెంది ఇంద్రుడు దేవాంగనలను అతనిపైకి పురికొల్పాడు. కాని వారి నవ్వులొలికే చూపులు, వ్యాజంతో సగం కనిపించేట్టు ప్రదర్శించిన మేఖలలు గల విలాసచేష్టలు ఆ తపస్వికి తపోభంగం కలిగించలేకపోయాయి. ఊర్ధ్వబాహుడయిన ఆ సుతీక్ష్ణుడు జపమాలే వలయంగా కలదీ, మృగాల దురద తీర్చేదీ, దర్భపోచలను త్రుంచేదీ అయిన తన కుడిచేతిని నన్ను సంభావించడానికై ఇటు వైపు చూపుతున్నాడు. ఈ మౌనీంద్రుడు మౌనవ్రతం దాల్చివున్నాడు. అందువల్ల నా ప్రణామాన్ని కొద్దిపాటి శిరఃకంపంతోనే స్వీకరించి విమాన వ్యవధానంతో విడిపోయిన చూపును మళ్ళీ సహస్రకరునిపై లగ్నం చేస్తున్నాడు.

శరణ్యమూ, పావనమూ అయిన ఈ తపోవనం ఆహితాగ్ని అయిన శరభంగమునీంద్రునిది. అతడు బహుకాలం సమిధలతో అగ్నికి తృప్తి చేకూర్చి పిదప మంత్రపూత మయిన తన శరీరాన్ని కూడా అగ్నిలో వేల్చాడు.

ఈ ఆశ్రమంలోని వృక్షాలు ఇప్పటికీ తమ నీడలతో మార్గాయాసం పోగొడుతున్నాయి. దండిగా పండిన మేలైన పండ్లతో బాటసారులకు ఆ మహర్షి పుత్రులలాగా అతిథి సపర్య చేస్తున్నాయి.

సుందరాంగీ! దరీముఖంనుండి ధారాశబ్దాన్ని కలిగిస్తూ శృంగం చివర తగులుకొన్న మబ్బుతో కూడిన ఈ చిత్రకూటాద్రి మదించి ఱంకెవేస్తూ గోరాడగా కొమ్ము చివర మట్టి దగులుకొన్న వృషభంలాగా నాచూపును ఆకట్టుకొంటున్నది. ఆ కొండ చెంతనే నిర్మలమూ, నిశ్చలమూ అయిన ప్రవాహంతో కూడి సుదూరంలో ఉండడంవల్ల సన్నగా కనిపిస్తున్న ఈ మందాకినీ నది భూదేవీ కంఠంలోని ముక్తావళిలాగా భాసిస్తున్నది. అదిగో! ఆ కొండ ప్రక్కనే తమాలవృక్షం ఏపుగా పెరిగివున్నది. యవాంకురంలాగా తెల్లనయిన నీకపోలంలో శోభిల్లేటట్లు మంచి పరిమళం వెదజల్లే ఆ చెట్టు చివుళ్ళనే నీకు నేను అవతంసంగా అలంకరించాను.

ఇది అత్రి మహర్షి తపోవనం. ఈ తపోభూమి ప్రభావం చాలా గొప్పది. ఇక్కడ దండనభయం లేకనే జంతువులు వినయంతో ప్రవర్తిస్తాయి. పూయకనే చెట్లు ఫలిస్తాయి. ఎక్కడ సప్తర్షులు స్వహస్తాలతో స్వర్ణకమలాలను కోసుకొంటారో, ఏది శివుని శిరస్సులో మాలగా రూపొందిందో అట్టి భాగీరథిని తపోధనుల స్నానాలకై పూర్వం అనసూయాదేవి ఈ తపోవనంలో ప్రవహింపజేసింది. తమ నీడల్లో వీరాసనస్థులై ఋషులు ధ్యానం చేస్తుండగా ఇక్కడి వృక్షాలు గూడా వేదికల మధ్యభాగాల నధిష్ఠించి గాలి లేకపోవడంవల్ల కదలిక లేనివై యోగసమాధిలో వున్నట్లున్నాయి. అదిగో! నీవు పూర్వం పూజించిన వటవృక్షమే అది. దానిని "శ్యామ" మంటారు. ఇప్పు డది దండిగా ఫలించి పద్మరాగాలతో కూడిన గరుడ పచ్చల రాశిలా భాసిస్తున్నది.

సుందరాంగీ! ఇదిగో ఈ గంగానది వైపు చూడు. యమునా తరంగాలతో దీని ప్రవాహం కలిసిపోవటంవల్ల ఈ భాగీరథి ఒకచోట ఉజ్జ్వలకాంతులు వెదజల్లే ఇంద్రనీల మణులతో కలిపి గ్రుచ్చిన ముత్యాల హారంలాగానూ, మరొకచోట ఎడనెడా నల్లగలువలు కూర్చిన



తెల్లతామరమాల మాదిరిగానూ, ఇంకొకచోట నల్ల హంసలతో చేరిన రాజహంసల పంక్తి రీతిగానూ, వేరొకచోట కాలాగురు విరచిత మకరికా పత్రాలు గల చందన చర్చితమైన భూభాగం చందాననూ, ఒకచోట నీడలలో నెలకొన్న చీకట్లతో శబలీకృతమైన వెన్నెలవలెనూ, మరొకచోట మధ్యరంధ్రాలలో కనిపించే ఆకాశం కల శరత్కాల మందలి ధవళమేఘమాలిక విధాననూ, ఇంకొకచోట నల్ల త్రాచులచే అలంకరింపబడి బూది పూతగల శివుని శరీరంలాగానూ ప్రకాశిస్తున్నది.

ఈ గంగాయమునా సంగమంలో స్నానం చేసి పవిత్రాత్ము లైనవారు తత్త్వజ్ఞులు కాకపోయినా శరీరత్యాగానంతరం మళ్ళీ జన్మించరు. ఇది గుహుని నెలవైన శృంగిబేరపురం. ఇక్కడ నేను శిరోభూషలను వదలి జడలు దాల్చినప్పుడు సుమంత్రుడు "కైకేయీ! నీ కోరికలు ఫలించాయి గదా!" అని యేడ్చాడు. ఇది బ్రహ్మసరస్సు. ఇక్కడ యక్షవనితలు స్వర్ణపద్మపరాగాలు పయోధరాల కంటుతుండగా స్నానం చేస్తారు. బుద్ధికి అవ్యక్తంలాగా సరయూనదికి ఈ సరస్సే ప్రధానకారణమని మహర్షులు చెబుతారు. ఈ సరయూనది యూపస్తంభాలు నాటిన తీరంతో ఒప్పారుతున్నది. అశ్వమేధ యాగాంతంలో అవభృథస్నానం కొరకై దిగిన ఇక్ష్వాకురాజులచే పావనతరం కావింపబడిన జలాలను అయోధ్యానగరం చెంత ప్రవహింపజేస్తున్నది. ఇసుక తిన్నె లనే ఉత్సంగంపై సుఖాసీనులను గావించి ప్రభూత పయోధారలతో ఉత్తర కోసలేశ్వరులను పోషించే తల్లి అని నామనస్సు సరయూనదిని సంభావిస్తున్నది. నా తల్లి కౌసల్యలాగానే మాన్యురైన ఆ మహారాజుతో వియోగం పొందిన ఈ నదీమతల్లి చిరకాలానికి తిరిగివచ్చిన నన్ను చల్లని గాలితో కూడిన తరంగా లనే హస్తాలతో కౌగిలించుకొంటున్నది.

అదిగో! అరుణ సంధ్యాసమమైన ధూపరాగం ఎదుట పైకి లేస్తున్నది. హనుమంతుని ద్వారా మన వార్త తెలుసుకొని భరతుడు సైన్యసమేతంగా సహా నాకు ఎదురు వస్తున్నా డనుకొంటాను. యుద్ధంలో ఖరాది రాక్షసులను

పరిమార్చి తిరిగి వచ్చిన నాకు నిన్ను భద్రంగా కాపాడి లక్ష్మణుడు సమర్పించాడు. అట్లే పిత్రాజ్ఞను పరిపాలించి వచ్చిన నాకు సచ్చరిత్రుడైన భరతుడు సురక్షితమయిన పావన రాజ్యలక్ష్మిని అప్పగిస్తాడు. ఇది నిజం. అడుగో! నారచీరలు గట్టి సైన్యం వెనుక రాగా వసిష్ఠుణ్ణి ముందుంచుకొని వృద్ధులైన అమాత్యులతో కూడి అర్ఘ్యం చేతబూని పాదచారియై భరతుడు నాకు అభిముఖంగా వస్తున్నాడు. ఇతడు తండ్రి యిచ్చిన రాజ్యలక్ష్మి తన అంకం చేరినా, తాను యువకుడై వుండికూడా, నామీది భక్తిచేత ఆమె ననుభవించక ఇన్ని సంవత్సరాలూ ఆమెతో కూడ కఠోరమైన అసిధారావ్రతం పాటించాడు.”

సీతతో రాము డలా చెప్పేసరికి పుష్పక విమానం అతని తలంపును అధిదేవత ద్వారా గ్రహించి భరతునితోడి ప్రజలు ఆశ్చర్యంతో పైకి చూస్తుండగా ఆకసంనుండి క్రిందికి దిగింది. అప్పుడు సేవా నిపుణు డయిన సుగ్రీవుడు రామునికి హస్తావలంబం ఇచ్చాడు. విభీషణుడు ముందు నడుస్తూ దారిచూపాడు. నేలకు దగ్గర అయిన స్ఫటికసోపానమార్గాన్ని అనుసరించి రాముడు విమానంనుండి క్రిందికి దిగాడు.

పిదప రాఘవుడు ఇక్ష్వాకు వంశానికి గురువయిన వసిష్ఠునికి ప్రణమిల్లాడు. అర్ఘ్యాన్ని స్వీకరించి బాష్పనేత్రుడై భరతుని కౌగిలించుకున్నాడు. తనమీది భక్తి కారణంగా పితృరాజ్యాభిషేకాన్ని పరిహరించిన అతని శిరసు మూర్కొన్నాడు.

ఊడలు పెరిగిన మఱ్ఱిచెట్లు లాగా మీసాలు, గడ్డాలు పెరగడంవల్ల వికృతమయిన వదనాలుగల మంత్రి వృద్ధులు రామునికి ప్రణమిల్లారు. వారినతడు కృపార్ద్రమయిన చూపులతోనూ, కుశల ప్రశ్నలతోడి మధుర వచనాలతోనూ అనుగ్రహించాడు.

“ఈ కపీశ్వరుడు నాకు ఆపదలో బంధువు, ఈ పౌలస్త్యుడు సంగరములో నాకంటె ముందే శత్రువులతో తలపడతాడు” అని ఆదరంతో రాముడు



సుగ్రీవుణ్ణీ, విభీషణుణ్ణీ భరతునికి పరిచయం చేశాడు. అంతట భరతుడు లక్ష్మణుణ్ణి సంభావించక ముందే వా రిరువురికీ నమస్కరించాడు. తర్వాత సౌమిత్రిని కలుసుకొని నమ్రశిరస్కుడైన అతణ్ణి లేవనెత్తి ఇంద్రజిత్తు దెబ్బలచే కాయలు గాచిన అతని వక్షఃస్థలంతో తన భుజమధ్యం రాపిడి పొందేటట్లు గాఢంగా హత్తుకొన్నాడు.

రాముని ఆదేశాన్ని అనుసరించి కపిసేనా నాయకులు మానవ శరీరధారులై గజేంద్రాలను అధిష్ఠించారు. అవి నిండుగా మదధారలను వర్షిస్తుండగా వారు పర్వతాధిరోహణసుఖాన్ని అనుభవించారు. రాక్షసరాజయిన విభీషణుడు కూడా రాముని ఆనతితో అనుచరసహితంగా రథాలను అధిరోహించాడు. మాయా వికల్పంతో నిర్మించబడిన లంకేశ్వరుని రథాలకంటే శిల్పచాతుర్యంలో ఈ రథాలే మిన్నగా శోభిల్లాయి.

పిమ్మట బుధగురులతో సహా మెరుపుతో కూడిన మేఘబృందాన్ని అధిష్ఠించిన చంద్రునిలాగా రాముడు భరత లక్ష్మణ సమేతుడై పతాకతో శోభిల్లుతూ ఇచ్ఛానుసారం చరించే పుష్పకాన్ని మళ్ళీ అధిష్ఠించాడు. ఆదివరాహం ప్రళయంనుండి భూదేవినీ, శరదాగమం మేఘ సంఘాతంనుండి వెన్నెలనూ ఉద్ధరించిన రీతిగా రావణు డనే సంకటంనుండి రాముడు కాపాడగా సంతసించిన జానకీదేవికి ఆ విమానంలో భరతుడు మోకరిల్లాడు. లంకేశ్వరుని ప్రణామాలను త్రోసిపుచ్చి దృఢవ్రతం పూనిన జనకసుతా చరణద్వయం వందనీయ మయింది. అగ్రజుణ్ణి అనుసరించడంవల్ల సచ్చరిత్రుడైన భరతుని శిరస్సు జడలు గట్టింది. ఇప్పుడు అవి రెండూ పరస్పర స్పర్శచే పవిత్రతను సంతరించుకొన్నాయి. ప్రజలు ముందు నడుస్తుండగా విమానం మెల్లగా పయనిస్తూ అరకోసు దూరం వెళ్ళింది. అక్కడ శత్రుఘ్నుడు ఏర్పాటు చేసిన పటభవనాలు గల అయోధ్యానగర మహోద్యానంలో రాముడు విడిది చేశాడు.

* * *

## 14

ఆధారవృక్షం కూలిపోగా వసివాడిన తీగల్లాగా భర్త మరణించడంతో శోచనీయదశను పొందివున్న తల్లులను రామలక్ష్మణు లిరువురూ కలిసి వెళ్ళి సందర్శించారు. శత్రువులను నురుమాడి విక్రమంతో ప్రకాశించే ఆ సోదరులు క్రమంగా తమ తల్లులకు ప్రణమిల్లారు. కన్నీరు క్రమ్మడంవల్ల కౌసల్యాసుమిత్రలు తమ పుత్రులను స్పష్టంగా చూడలేకపోయారు. అయినా గాత్రస్పర్శ సుఖంతో వారిని తెలుసుకోగలిగారు.

వేసవిలో ఉష్ణతప్తమైన గంగా సరయూనదుల జలాన్ని హిమాద్రినుండి దిగిన సెలయేరు చల్లబరచినట్లు దుఃఖంతో పొంగి వచ్చిన వారి వేడికన్నీటిని ఆనందబాష్పాలు చల్లబరిచాయి. ఆ తల్లులు తమ కుమారుల శరీరాలపై రక్కసుల శస్త్ర ప్రహారాలచే ఏర్పడిన మచ్చలను పచ్చిపుండ్లనువలె దయతో తడవుతూ క్షత్రియవనితలు సహజంగా ఇష్టపడే వీరమాతృత్వం పట్ల వైముఖ్యం ప్రదర్శించారు.

“భర్త కష్టాలకు కారణమైన దౌర్భాగ్యవతిని, నాపేరు సీత” అని తన్ను పేర్కొంటూ జానకి విగత భర్తృకలైన అత్తలిరువురికీ సమాన భక్తితో నమస్కరించింది. “బిడ్డా! నీ భర్త సోదరునితో సహా నీ పవిత్రమైన శీలంవల్లనే పెద్దపెద్ద కష్టాలను అతిక్రమించగలిగాడమ్మా!” అని ఆ కోడలిని అత్త లిద్దరూ ప్రియమైన సత్యవాక్కులతో ఊరడిస్తూ లేవనెత్తారు.

## శ్రీరామ పట్టాభిషేకం

తల్లుల ఆనందబాష్పాలతో అలా ప్రారంభమైన శ్రీరాముని పట్టాభిషేకం ఆపై అమాత్యవృద్ధులు కావించిన కనక కలశాలలోని పావన తీర్థ జలాల అభిషేకంతో సమాప్తమయింది. మేఘజలాలు వింధ్యాద్రి శిఖరంపై పడినట్లు నదులకూ, సముద్రాలకూ, సరస్సులకూ వెళ్ళి రక్కసులూ, వానరులూ తెచ్చిన



పవిత్రజలాలు జయశీలుడైన రాముని శిరస్సుపై పడ్డాయి. తాపసవేషంతో ఉన్నప్పుడే రాముడు ఎంతో అందంగా కనిపించాడు. ఇప్పు డతనికి రాజవేషరచనలవల్ల కలిగిన శోభ ద్విగుణీకృతమై భాసించింది.

అతడు సైన్యసమేతుడై తూర్యనాదాలతో పురజనులను ఆనందింపజేస్తూ, మంత్రి వృద్ధులూ, రాక్షసులూ, వానరులూ తనతో నడువగా; పురకాంతలు మేడలనుండి లాజలు వర్షిస్తుండగా ఉన్నత తోరణాలతో విరాజిల్లే అయోధ్యానగరం ప్రవేశించాడు. అప్పుడు రథస్థుడైన రాముడికి లక్ష్మణుడూ, శత్రుఘ్నుడూ మెల్లగా వింజామరలు విసిరారు. భరతుడు ఛత్రం పట్టాడు. సోదరసహితుడై శోభిల్లుతూ వృద్ధి బొందిన సామాద్యుపాయ సంఘాతంలాగా రాముడు అయోధ్యలో ప్రవేశించాడు. అప్పుడు మేడలనుండి వెలువడే కాలాగురు ధూమపంక్తి గాలికి చెదరినదై అడవినుండి తిరిగి వచ్చిన రాఘవుడు విడదీసిన అయోధ్యా పురలక్ష్మియొక్క జడలాగా విరాజిల్లింది.

సీతాదేవిని అత్తలు చక్కగా అలంకరించారు. అమె చిన్న రథాన్ని అధిష్ఠించింది. సాకేత పురకాంతలు మేడల కిటికీల చెంత నిలిచి ఆమెకు అంజలి బంధాలతో ప్రణామాలు చేశారు. అనసూయ ప్రసాదించిన శాశ్వతమయిన అంగరాగంతో ధగధగ మెరసిపోతున్న సీత రాముని ఆనతిచే మళ్ళీ అయోధ్యానగర వాసులు చూచేటట్లు అగ్నిప్రవేశం చేసి తన పరిశుద్ధతను ప్రకటిస్తున్నదా అన్నట్లు శోభిల్లింది. సౌజన్యనిధియైన రాముడు సుగ్రీవుడు మొదలయిన మిత్రులకు సకలోపకరణ సమృద్ధిగల గృహాలలో విడిది యేర్పాటు చేశాడు. ఆపై జనకుని చిత్రపటంతో అలంకృతమైన పూజాగృహాన్ని కన్నీరు కారుస్తూ ప్రవేశించాడు. అక్కడ అతడు లజ్జతోనూ, దుఃఖంతోనూ క్రుంగిపోయిన కైకేయికి అంజలి ఘటిస్తూ “అమ్మా! మాతండ్రి స్వర్గఫలాన్ని ప్రసాదించే సత్యంనుండి జారకుండా వున్నాడంటే అది మీ సుకృతం వల్లనే కదా!” అంటూ ఓదార్పు మాటలతో ఆమె సిగ్గును తొలగించాడు.

సుగ్రీవ విభీషణాదులకు రాముడు ఆయా కల్పిత భోగ్యవస్తువులతో సకలోపచారాలు చేశాడు. సంకల్పమాత్రంతో సకలసిద్ధులూ పొందగలవారు అది చూచి ఆశ్చర్యచకితు లయ్యారు. అప్పుడు రాముణ్ణి అభినందించటానికి దివ్యమునులు అక్కడికి విచ్చేశారు. తన విక్రమానికి వన్నె కలిగించే రావణుని జన్మాదికమైన వృత్తాంతాన్ని అతడు వారినుండి విన్నాడు. ఆపై తపోధనులు వారివారి స్థానాలకు తిరిగివెళ్ళారు. రక్షోనాథులు, కపీంద్రులు ఆనందపరవశులై సమయం తెలియకనే పక్షం రోజులు అక్కడ గడిపివేశారు. సీతాదేవి తన చేతిమీదుగా వారికి తగిన సత్కారాలు అందజేసింది. పిమ్మట రాముడు వారిని తమతమ దేశాలకు సాగనంపాడు. సంకల్పమాత్రంతో దరికి జేరేదీ, రావణుని జీవితంతో సహా తాను గైకొన్నదీ, దివికి పుష్ప మనదగినదీ అయిన పుష్పకవిమానాన్ని రాముడు మళ్ళీ కుబేరుని సేవకై పంపివేశాడు.

ఈ రీతిగా రాముడు పితృశాసనాన్ని అనుసరించి వనవాసం ముగించిన పిదప రాజ్యాధికారం చేపట్టాడు. ధర్మార్థకామాలపట్ల లాగానే అతడు సోదరులపట్లగూడా సమప్రపత్తి గలిగి మెలిగాడు. ఆరు ముఖాలతోనూ స్తన్యం గ్రోలి షణ్ముఖుడు కృత్తిక లందరినీ సమంగా ఆదరించినట్లే స్నేహశీలి కనుక అతడు తల్లులందరి యెడలా సమానగౌరవాన్నే ప్రదర్శించాడు.

అతడు మహావదాన్యుడు కావటంవల్లనే లోకం ధనవంతమయింది. అతడు విఘ్నభయం నివారించడంవల్లనే లోకం క్రియావంత మయింది. అతడు నియామకుడు కావడంవల్లనే లోకం పితృమంత మయింది. అతడు శోకాన్ని దూరీకరించడంవల్లనే అది పుత్రవంత మయింది. అతడు సమయానుసారంగా పౌరకార్యాలు చక్కదిద్దాడు. ఉపభోగ్యౌత్సుక్యంతో సుందరమైన రూపుదాల్చిన రాజ్యలక్ష్మియా అన్నట్లున్న జానకితో కూడి రమించాడు. తమ వనవాస వృత్తాంతాలు ప్రదర్శించే చిత్రాలు గల ప్రాసాదాలలో వారిద్దరూ యథేష్టంగా విషయసుఖా లనుభవించారు. చిత్రదర్శనంతో స్మరణకు వచ్చిన దండకారణ్యవాసం నాటి కష్టాలన్నీ అప్పుడు వారికి సుఖాలుగానే తోచాయి.



పిదప యెఱుపెక్కిన కన్నులతోనూ, రెల్లుపువ్వులా తెల్లబడిన ముఖంతోనూ సీత తన గర్భధారణను చెప్పక చెప్పింది. విషయం గ్రహించిన రాముడు ఆనంద పరవశుడయ్యాడు. అతడు నల్లబడిన చనుమొనలు గల్గి సిగ్గుపడుతున్న ఆ కృశాంగిని ఏకాంతంలో ఒడిలో కూర్చోబెట్టుకొని కోరిక యేమిటో చెప్పమన్నాడు. ఆమె నివ్వరిబలులను భుజించే క్రూరమృగాలకూ, తొల్లి తనతో చెలిమి నెఱపిన వైఖానస కన్యలకూ, దర్భలకూ నెలవైన గంగాతీరమందలి తపోవనాలను మళ్ళీ సందర్శించాలని కోరింది.

రాఘవుడు ఆమె కోరిక తీరుస్తానని మాట యిచ్చాడు. పిమ్మట అయోధ్యాపుర శోభ చూడగోరి సేవకులు వెంట రాగా ఆకసమంటే సమున్నతసౌధం అధిష్ఠించాడు. అతడు వస్తుసమృద్ధిగల అంగళ్ళతో కళకళలాడే రాజమార్గాన్నీ, నౌకలతో శోభిల్లే సరయూనదినీ, విలాసవంతులు విహరించే నగరోద్యానాలనూ చూస్తూ ఆనందించాడు.

పిదప వాగ్మిశ్రేష్ఠుడూ, పవిత్రవర్తనుడూ, శేషుని పోలిన ఊరువులు, భుజాలు కలవాడూ, శత్రువిజేతా అయిన శ్రీరాముడు తన్ను గురించి ప్రజలు ఏమనుకుంటున్నారో చెప్పమని భద్రుడనే గూఢచారిని ప్రశ్నించాడు. రాజు నిర్బంధించి అడిగేసరికి ఆ గూఢచారి "మానవ దేవా! రాక్షస గృహంలో వున్న దేవిని పరిగ్రహించడం తప్ప తక్కిన అన్ని విషయాలలోనూ పౌరులు తమ చరిత్రను ఎంతగానో ప్రశంసిస్తున్నారు" అని చెప్పాడు.

## సీతాపరిత్యాగం

ఈ రీతిగా కళత్రనిందతో భరింపరానిదైన అపకీర్తి సోకి జానకీ వల్లభుని హృదయం సమ్మెట వ్రేటుకు గురై ఎఱ్ఱగా కాలిన యినుము లాగా

ప్రయ్యలయింది. 'ఈ నా అపవాదును ఉపేక్షింతునా? లేక దొసగు లేని సతిని పరిత్యజింతునా?' అనుకొంటూ ఒక నిర్ణయానికి రాలేక రాముడు డోలాయమాన మానసుడయ్యాడు. తుదకు జనాపవాదం త్యాగంతో తప్ప మరొక విధంగా తొలగదని నిశ్చయించుకున్నాడు. పత్నీ పరిత్యాగంతోనే దాన్ని రూపుమాప దలచుకున్నాడు. యశోధనులైన వారికి తమ దేహంకంటే యశస్సే గొప్పది. ఇక ఇంద్రియసుఖంకంటే అది గొప్పదని చెప్పాలా?

తేజస్సు గోల్పడిన రామచంద్రుడు వెంటనే సోదరు లందరినీ తన వద్దకు రమ్మన్నాడు. అతని వికృతాకృతి చూచి వారు సంతోష హీనులయ్యారు. తనపైబడిన నిందను వారికి తెలియజేసి రాముడు మళ్ళీ వారితో ఇలా అన్నాడు.

''మబ్బుగాలివల్ల అద్దానికి మాలిన్యం సోకినట్లు సదాచార పరిశుద్ధుడనైన నావల్ల సూర్యసంభవమైన రాజర్షి వంశానికి ఎలాంటి కళంకం వచ్చిందో చూడండి! మన కులానికి వచ్చిన మొట్టమొదటి అపవాదు ఇదే. నీటి అలలలో నూనె బొట్టులాగా పురజనులలో ఇది వ్యాపిస్తున్నది. గజేంద్రుడు కట్టుకంబాన్ని సహించనట్లే నేను దీన్ని సహించలేకున్నాను. పూర్వం పిత్రాజ్ఞను శిరసా వహించి రాజ్యలక్ష్మిని పరిత్యజించాను. అలాగే ఇప్పుడు ఈ అపవాదం తొలగించుకోవడానికి సంతానాపేక్ష వదలిపెట్టి నిండు చూలాలైన జానకిని పరిత్యజిస్తాను. ఈమె సాధ్వి అని నాకు తెలుసు. అయినా లోకాపవాదమే బలమైనదిగా నాకు తోస్తున్నది. నిర్మలుడైన చంద్రునిపై బడిన భూమి నీడనేకదా లోకులు కళంకమని ఆరోపణ చేశారు!

అయితే రాక్షసవధతో ముగిసిన నా ప్రయత్నం సీతా పరిత్యాగంతో నిరుపయోగం కాదు. అది పగ తీర్చుకోవటానికి ఉపయోగపడింది. కాలదన్నిన వాణ్ణి రోషించి సర్పం కాటు వేసేది పగ తీర్చుకోవడానికేగాని రక్తపిపాసతో కాదుగదా! అందువల్ల నిందాశల్యం తొలగించుకొని నేనింకా కొంతకాలం



జీవించాలని మీకు కోరిక వుంటే కరుణార్ద్ర చిత్తులైన మీరు ఈ నిర్ణయాన్ని కాదనకూడదు.''

ఈ రీతిగా జానకి విషయంలో మిక్కిలి క్రూరమైన ఆవేశంతో పలికిన ప్రభువును ఆ సోదరులలో ఒక్కడైనా కాదనటానికి గానీ, ఔననటానికి గానీ సాహసించలేకపోయాడు. అంతట ముల్లోకాలలో పొగడ్త కెక్కినవాడూ, సత్యవచనుడూ అయిన శ్రీరాముడు ఆజ్ఞానువర్తి అయిన లక్ష్మణుని ''సౌమ్యా'' అని సంబోధించి ఏకాంతంలో ఇలా అతణ్ణి ఆదేశించాడు– ''గర్భిణీ మనోరథం ప్రకటిస్తూ మీ వదిన తపోవనాలను సందర్శించాలని నాతో చెప్పింది. ఆ కోరిక తీర్చే నెపంతో నీవామెను రథం మీద వాల్మీకి ఆశ్రమానికి తీసుకుపోయి అక్కడ వదలిపెట్టు''.

తండ్రి ఆనతి మేరకు తల్లిని శత్రువువలె ప్రహరించిన పరశురాముణ్ణి గూర్చి వినియుండిన సౌమిత్రి అగ్రజుని ఆజ్ఞను శిరసా వహించాడు. గురువుల ఆజ్ఞ విచారింపక తలదాల్చ దగినదే కదా!

ఇష్టమైన మాట విని సీత సంతుష్టి చెందింది. లక్ష్మణుడు ఆమెను బెదరు పాటులేని గుఱ్ఱాలు పూన్చిన రథం ఎక్కించాడు. సుమంత్రుడు సారథ్యం చేస్తుండగా రథం బయలుదేరింది. తాను చూడగోరిన ప్రదేశాలకు పయనిస్తూ సీత ''నా ప్రియుడు ప్రియంకరుడు'' అని సంతసించింది. కాని అతడు తనపట్ల కల్పవృక్షత్వాన్ని పరిత్యజించి అసిపత్రవృక్షంగా మారిపోయాడని ఆమె గ్రహించలేకపోయింది.

దారిలో సౌమిత్రి ఆమెకు తెలియకుండా దాచినప్పటికీ ప్రియదర్శనానికి దూరమై అదరుపాటు చెందిన ఆమె కుడికన్నే రానున్న మహాదుఃఖాన్ని ఆమెకు ఎఱుక పరచింది. ఆ దుశ్శకునంతో ఆమె విషాదం పొందింది. ఆమె ముఖపద్మం వాడిపోయింది. ''సోదర సమేతుడైన రాముడికి శుభమగుగాక!'' అని మాటిమాటికీ మనసులో ఆమె భావించింది. అన్న

ఆనతితో ఆ సాధ్వీమతల్లిని అడవిలో విడిచిపెట్టనున్న లక్ష్మణుణ్ణి ఎదుట వున్న గంగ పైకి లేచిన అల లనే చేతులతో నివారిస్తున్నదా అన్నట్లు తోచింది.

సారథి గంగాతీరంలో రథం నిలిపాడు. సౌమిత్రి సీతను ఇసుక తిన్నెపై దించాడు. ఇంతలో నిషాదుడు పడవ తీసుకువచ్చాడు. సీతతో సహా దాని నధిష్ఠించి చేసిన ప్రతిజ్ఞను సత్యసంధుడు దాటినట్లు అతడు భాగీరథిని దాటాడు.

పిదప లక్ష్మణుడు ఎట్లో మాట చిక్కబట్టుకొని కన్నీటిచే కంఠం స్తంభితం కాగా ఉత్పాతకాలంలో మేఘుడు శిలావర్షాన్ని వర్షించినట్లు రాజశాసనాన్ని వెల్లడించాడు. అది విన్నంతనే పరాభవమనే గాలి తాకిడికి సొమ్ములనే పూలు రాలిపోగా వాడిన తీగలాగా సీత క్షణంలో తల్లి అయిన భూదేవి ఒడిలో ఒరిగిపోయింది. “ఇక్ష్వాకువంశభవుడూ, సాధువర్తనుడూ అయిన భర్త నిన్ను కారణం లేకుండా ఎందుకు వదిలేస్తాడు” అని సంశయించిందా అన్నట్లు భూమాత అప్పు డామెను తనలో ఐక్యం చేసుకోలేదు.

అంతట మూర్ఛిల్లిన సీతకు దుఃఖం తెలియలేదు. మూర్ఛనుండి తేరుకోగానే ఆమె దుఃఖంతో పరితపించింది. లక్ష్మణుని ప్రయత్నంతో కలిగిన ప్రబోధమే ఆమెకు మూర్ఛకంటే ఎక్కువ క్లేశం కలిగించింది. ఆ సాధ్వీ శిరోమణి ఏ పాపం లేకున్నా తన్ను నిరాకరించిన భర్తను తాను ఏమాత్రం తూలనాడలేదు. ‘ఎడతెగని కష్టాలు అనుభవించడానికే పుట్టిన దౌర్భాగ్యవతిని’ అని తన్ను తానే మాటిమాటికీ నిందించుకొన్నది. లక్ష్మణుడు ఆమెను ఊరడించాడు. ఆమెకు వాల్మీకి ఆశ్రమానికి మార్గం చూపాడు. “దేవీ! నేను పరాధీనుడను. ప్రభుని ఆనతిని పాటింపక తప్పలేదు. నాక్రౌర్యాన్ని క్షమించు” అని ఆమెకు మోకరిల్లాడు.

జానకి అతణ్ణి లేవనెత్తి ఇలా అన్నది. “సౌమ్యా! ఉపేంద్రుడు ఇంద్రుడికి అధీనుడైనట్లు నీవు మీ అన్నకు అధీనుడవై వున్నావు. నీపట్ల నేను ప్రీతి



చెందాను. నీవు చిరకాలం జీవించు. అత్తల కందరికీ క్రమంగా నా నమస్కారాలు చెప్పు. ‘నాలో వున్న మీపుత్రుని గర్భానికి శుభం కలిగేటట్లు చిత్తంలో ధ్యానించండి!’ అని నావిన్నపంగా వారికి విన్నవించు. ఆ రాజుతో నా మాటగా ఇలా చెప్పు. కంటి ఎదుట అగ్నిశుద్ధురాలనైన నన్ను లోకాపవాదం విని విడిచినావే. ఇది ప్రఖ్యాతమైన మీకులానికీ, విజ్ఞతకూ తగిన పనియా? అయినా నీవు కల్యాణమతివి. నా విషయంలో కావాలని నీవిలా చేశావని నేననుకోను. నేను పూర్వజన్మలలో చేసిన పాపాల ఫలమే నాపట్ల ఇలా సహింపరాని పిడుగుపాటయింది. చెంత జేరిన లక్ష్మిని త్రోసిపుచ్చి పూర్వం నీవు నాతో కూడా అడవికి పయనించావు. అంచేత మిక్కిలి రోషించిన లక్ష్మి యిపుడు నీ యింట కాలు మోపిన నన్ను సహించలేకపోయింది.

రక్కసుల దాడికి భయపడిన తాపస స్త్రీలకు నాడు నీ అనుగ్రహంవల్ల నేను రక్షణ కల్పించగలిగాను. అలాంటి నేను ఇప్పుడు నీవు ప్రభుడవై యుండగానే మరొక తపస్వినెలా శరణు పొందుగలను? నాగర్భంలో రక్షింపదగి వున్న నీ తేజస్సు అడ్డు పడకపోతే నీ శాశ్వత వియోగంతో నిష్ఫలమై దిక్కులేని దైన ఈ నా జీవితాన్ని ఈ క్షణంలోనే త్యజించి ఉండేదాన్ని.

ప్రసవానంతరం సూర్యునిపై దృష్టి వుంచి నా మరుజన్మలో కూడా నీవే భర్తవు కావాలనీ, అయితే వియోగం మాత్రం కలగరాదనీ ప్రార్థిస్తూ తపస్సు చేయడానికి ప్రయత్నిస్తాను. వర్ణాశ్రమ పరిపాలనమే రాజులకు ధర్మంగా మనువు విధించాడు. అందువల్ల విడిచి పుచ్చినా నన్ను నీవు ఇతర తపస్వులతో సమంగానైనా చూడవలసి వుంటుంది.”

లక్ష్మణుడు ఆ మాటలను “అలాగే” అని అంగీకరించి ఆమె దృష్టి పథం నుండి దూరమయ్యాడు. అంతట సీత దుఃఖాతిరేకంతో భీతిల్లిన లకుముకి పిట్టలాగా ఎంతగానో ఆక్రందించింది. ఆమె ఏడుపు విని నెమళ్ళు నృత్యాన్నీ, చెట్లు పుష్పాలనూ, జింకలు నోట గఱచుకొన్న దర్భలనూ వదలి

పెట్టాయి. ఈ రీతిగా సీతతో సమమైన దుఃఖానికి గురైన అడవిలో సైతం అంతటా ఏడ్పులే వినిపించాయి.

బోయవాని దెబ్బకు నేల వ్రాలిన పక్షిని చూడగా ఎవని శోకం శ్లోకంగా పరిణమించిందో ఆ వాల్మీకి మహర్షి దర్భలూ, సమిధలూ తేవడానికి వచ్చి సీత ఏడుపు విని ఆమె చెంతకు వచ్చాడు. ఆమె ఏడుపు మాని చూపు నడ్డుకొంటున్న కన్నీరు తుడుచుకొని ఆ మునీంద్రునికి వందనం చేసింది. ఆమె గర్భచిహ్నాలు చూచి ఆయన "సుపుత్ర ప్రాప్తిరస్తు" అని ఆశీర్వదించి ఇలా అన్నాడు–

"వైదేహీ! మిథ్యాపవాదంతో క్షోభపడి నీ భర్త నిన్ను పరిత్యజించినాడని యోగదృష్టితో గ్రహించాను. నీ విప్పుడు దేశాంతరంలో వున్న నీ పుట్టిల్లే చేరుకున్నావు. అందువల్ల దుఃఖించవద్దు. రాముడు ముల్లోకాలలోని కంటకాలను తొలగించినవాడే, సత్యసంధుడే, ఆత్మశ్లాఘ లేనివాడే అయినా అకారణంగా నీపట్ల అనుచితంగా ప్రవర్తించినందుకు నాకతినిపై కోపం కలిగింది. మహాకీర్తిమంతుడైన మీమామ నాకు మిత్రుడు. మీ తండ్రి జ్ఞానోపదేశంతో సజ్జనుల సంసారదుఃఖం తొలగించే మహానుభావుడు. నీవు పతివ్రతలలో అగ్రగణ్యురాలవు. ఇక నీ యెడల నాకు దయ కలగకుండా ఎలా ఉంటుంది?

తాపసుల సంసర్గంవల్ల వైరం వదలిన జంతువులు చరించే ఈ తపోవనంలో భయం లేకుండా వుండు. ఇక్కడ సుఖప్రసవం కాగానే నీ బిడ్డలకు జాతకర్మాది సంస్కారాలు జరిపిస్తాను. ఈ తమసానది పాపహారిణి. దీని గట్టున పర్ణశాల లున్నాయి. ఈ నదిలో స్నానం చేసి ఇసుక తిన్నె మీద యిష్టదేవతలకు పూజలు నిర్వర్తించు. అందువలన నీకు మనశ్శాంతి కలుగుతుంది. కాల ప్రాప్తాలైన పూలూ, పండ్లూ, పూజాయోగ్యమై దున్నకనే పండే ధాన్య విశేషాలూ తెచ్చి నీకందిస్తూ ఇక్కడి మునికన్యలు ఉదారమైన



మాటలతో నీదుఃఖం తొలగించి నిన్ను వినోదింపజేస్తారు. నీవు మోయటానికి వీలైన కడవలతో ఈ ఆశ్రమంలోని లేత చెట్లకు నీరు పోసి పెంచుతూ బిడ్డలు కలగకముందే నిజంగా శిశుప్రీతిని పొందుతావు."

ఈ విధంగా చెప్పి తన అనుగ్రహాన్ని ప్రదర్శించిన మునిని సీత అభినందించింది. దయార్ద్రహృదయుడైన ఆ మునీంద్రుడు సాయం సమయంలో వేదికల చెంత విశ్రమించిన శాంతమృగాలు కల తన ఆశ్రమానికి ఆమెను తోడ్కొని పోయాడు.

పితరు లనుభవించగా చివరికి మిగిలిన ఒకే ఒక చంద్రకళను అమావాస్యాకాలం ఓషధుల కందించినట్లు శోకదీన యయిన సీతను ఆమె రాకకు ప్రీతినొందిన తాపస స్త్రీలకు వాల్మీకి మహర్షి అప్పగించాడు. సపర్య పూర్తి కాగానే తాపసాంగనలు సాయంకాలంలో సీత నివసించటాని కొక పర్ణశాలను ఇచ్చారు. అందులో ఇంగుదీ తైలంతో వెలిగే దీపం పెట్టారు. పవిత్రమైన అజినం పరచి శయ్య ఏర్పాటు చేశారు.

ఆ తపోవనంలో స్నానాది నియమాలు పాటిస్తూ, శాస్త్రవిధి ప్రకారం అతిథులను సత్కరిస్తూ, నారచీర ధరించినదై సీత పతియొక్క సంతతి విచ్ఛిన్నం కాకుండా వుండడానికై కందమూలాదులతో శరీరాన్ని నిలబెట్టుకొన్నది.

అక్కడ లక్ష్మణుడు "ఇప్పటికైనా ప్రభువు పశ్చాత్తాపం కలిగి వుంటాడా" అన్న ఔత్సుక్యంతో ఆదేశం పాటించిన తీరును సీతావిలాపం వరకూ అన్నకు విన్నవించాడు. అంతట రాముడు మంచును వర్షించే పుష్యమాసపు చంద్రునిలాగా కన్నీరు గార్చాడు. జనాపవాదానికి భయపడి అతడు సీతను గృహంనుండి దూరం చేశాడే కాని తన మనస్సునుండి మాత్రం దూరం చేయలేదు.

ధీమంతుడూ, వర్ణాశ్రమ రక్షణలో జాగరూకుడూ, రజోగుణశూన్యుడూ అయిన రామచంద్రుడు తనలో తానే శోకం నిగ్రహించుకొని సోదరసాధారణ

భోగ్యంగా రాజ్యాన్ని పరిపాలించాడు. లోకనిందకు భయపడి సాధ్వియైన ఏకైక పత్నిని త్యజించిన ఆ నరాధిపుని వక్షఃస్థలంలో అవధి లేని సుఖాలను అనుభవిస్తూ రాజ్యలక్ష్మి సవతి లేని వనితలాగా భాసించింది. సీతను వదలి రాముడు మరొక కాంతను చేపట్ట లేదు. అంతేకాదు. ఆమె ప్రతిమనే ప్రక్కన పెట్టుకొని యజ్ఞాలు నిర్వర్తించాడు. ఈ వృత్తాంతం మైథిలి చెవిలో పడింది. అందువలన ఆమె దుర్వారమైన ఆ పరిత్యాగదుఃఖాన్ని ఎలాగో సహించగలిగింది.

* * *

# 15

జానకిని పరిత్యజించిన పిమ్మట రాముడు రత్నాకరమేఖల అయిన ఒక్క వసుంధరను మాత్రమే అనుభవించాడు.

## లవణాసుర సంహారం

లవణుడనే రక్కసుడు యమునా తీరవాసులైన మునుల యాగక్రియలకు విఘ్నం కలిగించాడు. వాడి బాధ భరించలేక వాళ్ళు రక్షణ సమర్థు డయిన రాముని శరణుజొచ్చారు. రాముడు తమ్ము రక్షించగలడన్న భావంతోనే వాళ్ళు తమ తేజంతో ఆ దానవుణ్ణి సంహరించకుండా వదలివేశారు. శాపమే అస్త్రంగా కల మహాత్ములు తపోవ్యయం చేసేది రక్షకు లెవరూ లేనప్పుడే కదా! రాముడు లవణాసురుని సంహరిస్తానని మౌనులకు మాట యిచ్చాడు. ఆ శార్ఙ్గధరుని అవతారం ధర్మరక్షణకొఱకే గదా! “శూలం చేత వున్నంత వరకూ లవణుణ్ణి ఎవరూ జయించలేరు. శూలం లేనప్పుడు లవణునిపై దాడికి వెడల” మని మునులు రామునితో లవణాసుర సంహారోపాయం కూడా వివరించారు.

అంతట మునుల క్షేమ మపేక్షించి రాఘవుడు శత్రుఘ్నుణ్ణి పిలిచి అతని పేరు సార్థకం చేయటానికో అన్నట్లు లవణాసురుణ్ణి సంహరించ వలసిందిగా ఆదేశించాడు. విశేషశాస్త్రం సామాన్య శాస్త్రాన్ని బాధించినట్లు శత్రువును హతమార్చటానికి రఘువంశస్థులలో ఏ ఒక్కడైనా సమర్థుడే. శత్రుఘ్నుడు అన్న ఆశీర్వాదం అందుకొన్నాడు. రథం అధిష్ఠించి నిర్భయంగా వైరి మీదికి దాడి వెడలాడు. కుసుమ వాసనలతో గుబాళించే వనస్థలాలు చూస్తూ ముందుకు సాగిపోయాడు.

స్వయంగానే అధ్యయనార్థం బోధించే ‘ఇఙ్’ ధాతువును ‘అధి’ అనే ఉపసర్గ అనుసరించినట్లే ఒంటరిగానే శత్రువులను నురుమాడగల శత్రుఘ్నుణ్ణి రాముని ఆజ్ఞమేరకు సేన ఊరక అనుసరించింది. రథం

ముందుభాగంలో కూర్చున్న మునులు దారి చూపుతుండగా వారి ననుసరించి సాగిపోతూ తేజస్వి శ్రేష్ఠుడయిన శత్రుఘ్నుడు వాలఖిల్యుల ననుసరించే సూర్యునిలా భాసించాడు. అలా పయనిస్తూ అతడు మార్గమధ్యంలో రథశబ్దం విని మెడలు నిక్కించి చూస్తున్న మృగాలతో మనోజ్ఞంగా వున్న వాల్మీకి తపోవనంలో ఒక రాత్రి విశ్రమించాడు.

అలసిపోయిన గుఱ్ఱాలతో విశ్రాంతి గైకొన్న ఆ రాకుమారుణ్ణి వాల్మీకి మునీంద్రుడు తపః ప్రభావంతో సిద్ధించిన విశేష మర్యాదలతో సత్కరించాడు. ఆ రాత్రే అక్కడ గర్భిణి అయిన సీత సమగ్రమైన కోశదండాలను వసుధ ప్రసవించినట్లు ఇద్దరు పుత్రులను ప్రసవించింది. అన్నకు సంతానం కల్గినందుకు శత్రుఘ్ను డెంతో సంతోషించాడు. తెల్లవారగానే రథం సన్నద్ధం చేసుకొని మునికి నమస్కరించి ఆయన వద్ద సెలవు గైకొని పయనం కొనసాగించాడు.

అలా పయనించి చివరికి శత్రుఘ్నుడు మధూపఘ్ను మనే లవణాసురుని పట్టణం చేరుకొన్నాడు. ఆ సమయానికే కుంభీనసి కొడుకైన లవణుడు కాననంనుండి కప్పం తెచ్చాడా అన్నట్లు జంతురాశిని తీసుకొని తిరిగి తన నగరానికి వచ్చాడు. వాడు ధూమ్రవర్ణం కలిగివున్నాడు. వాని శరీరం నుండి వసాగంధం వెలువడుతున్నది. వాడు అగ్నిజ్వాలల్లాగా ఎఱ్ఱనైన వెంట్రుకలతోనూ, మాంసభోజనుల పరివారంతోనూ కూడి నడయాడే చితాగ్నిలాగా భీకరంగా వున్నాడు.

లక్ష్మణానుజుడు శూలం చేతలేని సమయంలో ఆ లవణాసురుణ్ణి నిరోధించాడు. అవకాశం చూచి దెబ్బ కొట్టే వారిని విజయం వరిస్తుంది కదా! "నాపొట్టకు నేడు చాలినంత తిండి లేదని గమనించి భయపడి కాబోలు భాగ్యవశాత్తు బ్రహ్మ నిన్ను నావద్దకు పంపాడు" అని బెదరిస్తూ శత్రుఘ్నుణ్ణి చంపదలచి ఆ రాక్షసుడు ఎత్తైన చెట్టును తుంగపోచను పెకలించినట్లు పెకలించి అతనిపై విసరివేశాడు. ఆ చెట్టు సుమిత్రాపుత్రుని వాడి ములుకులకు మధ్యలోనే ముక్కలు ముక్కలై పడిపోయింది. దాని పుప్పొడి మాత్రమే అతని గాత్రం సోకింది. కాని చెట్టు తాకలేదు. వృక్షప్రయోగం వ్యర్థం కావడంతో ఆగ్రహోదగ్రుడయిన లవణుడు వేరుపడిన యముని పిడికిలిలా వున్న ఒక పెద్దబండను ప్రత్యర్థిపై ప్రయోగించాడు.



శత్రుఘ్నుడు ఐంద్రాస్త్రం ప్రయోగించే సరికి ఆ బండ ఇసుకరేణువుల కంటే చిన్నచిన్న పరమాణువులుగా మారిపోయింది. అంతట ఉత్పాతవాయు ప్రేరితమైన ఒంటి తాటిచెట్టుగల కొండలాగా కుడిభుజం పైకి లేపి రాత్రించరుడు శత్రుఘ్నుని పై కురికాడు. సౌమిత్రి వానిపైకి వైష్ణవబాణం సంధించి వదిలాడు. ఆ బాణం హృదయాన్ని ఛేదించి లవణాసురుణ్ణి నేల గూల్చింది. వా డలా కూలినప్పుడు భూమికి కంపం కలిగింది, ఆశ్రమవాసుల కంపం తొలగింది. అలా పడిపోయిన దానవుని శరీరంపై గ్రద్దలు మొదలైన పక్షులు వ్రాలాయి. అతణ్ణి పడగొట్టిన శత్రువు తలపై అదే సమయంలో దివినుండి కుసుమ వృష్టి కురిసింది.

ఆ రీతిగా లవణాసురుణ్ణి వధించి ఆ వీరుడు మహాబలవంతుడూ, ఇంద్రజిత్తును హతమార్చి ప్రశస్తి పొందినవాడూ అయిన లక్ష్మణునికి తాను తగిన సోదరుడనని అప్పుడు భావించాడు. కృతార్థులైన తపోధనులు శత్రుఘ్నుణ్ణి ఎంతగానో స్తుతించారు. పరాక్రమంతో ఉన్నతమైనా, వాళ్ళ స్తుతులవల్ల అతని శిరస్సు లజ్జచే అవనతమై శోభిల్లింది.

పిమ్మట పౌరుషాలంకారుడూ, విషయసుఖాలపై స్పృహ లేనివాడూ, సౌమ్యరూపుడూ అయిన ఆ శత్రుఘ్నుడు కాళిందీ తీరంలో మధురానగరాన్ని నిర్మించాడు. స్వర్గంనుండి వలసవచ్చిన వారికి ఆ నగరంలో నివాసం ఏర్పాటు చేయబడిందా అన్నట్లు అతని యేలుబడిలో అందలి జనులందరూ సకలైశ్వర్యాలతో విలసిల్లారు. ఆ పట్టణంలోని సమున్నతహర్మ్యం అధిష్ఠించి

శత్రుఘ్నుడు సువర్ణరచనతో కూడిన భూదేవి జడలాగా చక్రవాకాలతో కూడివున్న యమునానదిని వీక్షిస్తూ ప్రీతి పొందాడు.

అటు దశరథునికీ, ఇటు జనకమహారాజుకీ మిత్రుడూ, మంత్రద్రష్టా అయిన వాల్మీకి ఉభయుల మీదా వున్న ప్రీతివల్ల సీతాపుత్రులకు యథావిధిగా జాతకర్మాది సంస్కారాలు నిర్వర్తించాడు. ఆ మునీంద్రుడు ఒకబిడ్డకు కుశలతో (దర్భలతో) గర్భోపద్రవం తొలగించి కుశుడనీ, మరొక బిడ్డకు లవాలతో (గోవుతోక మెలికలతో) గర్భక్లేశం తొలగించి లవుడనీ నామకరణం చేశాడు. పిమ్మట ఆ మహర్షి కొంతబాల్యం గడవగానే వారిచే సాంగంగా వేదం చదివించాడు. ఆ పై కవుల కవితలకు మార్గదర్శకమైన తన రామాయణ కావ్యాన్ని గానం చేయించాడు. వారు తల్లియెదుట రాముని మధుర గాథను గానం చేస్తూ ఆమె భర్తృవియోగ వ్యథను కొంతవరకూ సడలించారు.

త్రేతాగ్ని తేజస్సులైన భరత లక్ష్మణ శత్రుఘ్నులు కూడా వారివారి ధర్మపత్నుల ద్వారా యిద్దరేసి కుమారులను కన్నారు. శత్రుఘ్నుడు శత్రుఘాతి, సుబాహుడు అనే తన పుత్రుల నిరువురినీ క్రమంగా మధురా విదిశా నగరాలకు అధిపతులను చేసి భ్రాతృప్రేమతో అయోధ్యకు తిరిగి పయనమయ్యాడు. దారిలో మళ్ళీ వాల్మీకికి తపోవిఘ్నం కలిగించ గూడదని నిశ్చలంగా కుశలవుల రామకథాగానం వింటున్న మృగాలతో కూడిన వాల్మీక్యాశ్రమం ప్రవేశించకుండా దాటిపోయాడు. లవణాసురుణ్ణి వధించడంవల్ల పురజనులు అతనిని మిక్కిలి గౌరవంతో చూస్తుండగా శత్రుఘ్నుడు తోరణాదులతో అలంకరింపబడిన అయోధ్యను ప్రవేశించాడు.

సీతను పరిత్యజించడం వల్ల భూమికి అసామాన్య భర్తయై సభలో సభాసదులచే సేవింపబడుతున్న రాముణ్ణి అతడు సందర్శించాడు. కాలనేమి వధచే ప్రీతినొందిన ఇంద్రుడు ఉపేంద్రుని అభినందించినట్లు రాముడు తనకు ప్రణమిల్లిన లవణాంతకుని అభినందించాడు. రాముడు అడిగే సరికి జరిగిన వృత్తాంతాన్ని శత్రుఘ్నుడు అతనికి వివరించాడు. కాని సమయ



ప్రతీక్షకావిస్తున్న వాల్మీకి ఆనతి మేరకు కుశలవుల జన్మవృత్తాంతం మాత్రం నివేదించ లేదు.

## శంబూక వృత్తాంతం

ఆపై ఒకనాడు జనపదానికి చెందిన బ్రాహ్మణు డొకడు యౌవనం పొడసూపకముందే మరణానికి గురియైన తన శిశువును ఒడిలో పెట్టుకొని రాజద్వారం ముందు “ఓ భూదేవీ! దశరథ మహారాజుకు దూరమైపోయిన నీవు రామునిచేత జిక్కి కష్టం మీద కష్టం అనుభవిస్తూ శోచనీయురాలి వయ్యావు కదే!” అని ఆక్రోశించాడు.

ప్రజారక్షకుడైన రాముడు ఆ విప్రుని దుఃఖానికి కారణం గ్రహించి ఎంతో సిగ్గుపడ్డాడు. ఇక్ష్వాకుల రాజ్యంలో అంతకుముం దెన్నడూ అకాల మరణం అన్నది లేదు కదా! దుఃఖిస్తున్న ఆ విప్రుణ్ణి ‘ఒక క్షణకాలం ఓపిక పట్టు’ అని ఓదార్చి యమునిపై దాడివెడలగోరి రాముడు పుష్పకవిమానాన్ని స్మరించాడు. తలంచగానే ప్రత్యక్షమైన పుష్పకం అధిష్ఠించి శస్త్రాస్త్రాలు చేబూని బయలుదేరాడు. ఇంతలో “రాజా! నీ ప్రజలలోనే ఒక అపచారం జరుగుతున్నది. దానిని అన్వేషించి శమింపజేశావంటే కృతకృత్యుడ వవుతావు” అన్న అశరీరవాణి వినిపించింది.

ఆ ఆప్తవాక్యం ఆలకించి తన రాజ్యంలో ఏర్పడిన వర్ణాపచారం తొలగించడానికి నిశ్చయించుకొని రాముడు వేగాతిశయంవల్ల కదలికలేని ధ్వజంతో విలసిల్లే పుష్పకవిమానంమీద వెళ్ళి దిక్కులన్నీ అన్వేషించాడు. అలా అన్వేషిస్తూ పోయి ఒకచోట అధోముఖుడై చెట్టుకొమ్మకు వేలాడుతూ పొగసోకి ఎర్రబారిన కళ్ళతో తపస్సు చేస్తున్న ధూమపాయి అయిన ఒక మనుజుణ్ణి చూచాడు. “నీ పేరేమి? నీ కులమేది? ఎందుకిలా తపస్సు చేస్తున్నావు?” అని అతణ్ణి ప్రశ్నించాడు.

“నేను శంబూకుడనే శూద్రుణ్ణి, స్వర్గప్రాప్తికోరి తపస్సు చేస్తున్నాను” అని అతడు బదులు చెప్పాడు. తపస్సు చేసే అధికారం అతనికి లేదు

కాబట్టి తన దుశ్చర్యతో ప్రజలకు దుఃఖం కలిగిస్తున్న ఆ శూద్రుని తల తెగవేయాలని నిశ్చయించుకొని రాముడు శస్త్రం పైకెత్తాడు. మంచుకు దెబ్బతిన్న కేసరాలు గల పద్మంలాగా నిప్పురవ్వల తాకిడికి కమలిపోయిన మీసాలు కల అతని ముఖాన్ని కంఠనాళంనుండి క్రిందికి పడగొట్టాడు. అలా రాజదండనకు గురికావడంవల్ల ఆ శూద్రుడు తనకు తగని తపస్సుతో పొందజాలని ఉత్తమగతిని పొందగలిగాడు.

రాముడు తిరిగివస్తూ శరత్కాలం చంద్రునితో కలిసినట్టు మహాతేజస్వి అయిన అగస్త్యుణ్ణి కలుసుకున్నాడు. తన్ను పానంచేసి మరల తనకు విడుదల కల్గించినందుకు చెల్లించిన మూల్యమా అన్నట్లు సముద్రుడు పూర్వం తనకిచ్చిన ఒక దివ్యాభరణాన్ని ఆ మునీంద్రుడు రామునికి సమర్పించాడు. సీతాకంఠాలింగనం లేని తన భుజాన్ని ఆ ఆభరణంతో అలంకరించుకొని రాముడు అయోధ్యకు మరలివచ్చాడు. అతడక్కడికి రాకముందే విప్రబాలకుడు పునర్జీవితుడయ్యాడు. పుత్రుడు తిరిగి బ్రతకగానే ఆనందించిన బ్రాహ్మణుడు మృత్యువు బారినుండి కూడా రక్షించగల రాముణ్ణి ఎంతగానో స్తుతించి మునుపు తాను చేసిన నిందను సమసిపోజేశాడు.

పిదప రాముడు అశ్వమేధయాగం చేయటానికి సంకల్పించి అశ్వాన్ని విడిచిపుచ్చాడు. అప్పుడు సుగ్రీవుడు, విభీషణుడు, ఇంకా పెక్కుమంది నరపాలురు మేఘాలు పైరులకు నీరు వర్షించినట్లు రామునికి పలురకాల కానుకలు వర్షించారు. యాగానికి రావలసిందిగా ఆహ్వాన మందుకొని నలుదెసలనుండి భూలోకవాసులైన మునులే కాక నక్షత్ర మండలస్థు లయిన మహర్షులు కూడా రాముని చెంతకు వచ్చారు.

నాలుగు గవనులతోడి అయోధ్య తనచుట్టూ విడిది చేసిన ఆ మహర్షులతో అప్పుడే లోకాలను సృష్టించిన చతుర్ముఖుని మూర్తిలాగా భాసించింది. ఏకపత్నీ వ్రతుడయిన రాముడికి సీతయొక్క బంగారు ప్రతిమే



యజ్ఞశాలలో ధర్మపత్నిగా రూపొందింది. అందువల్ల సీతకు తన పరిత్యాగం సయితం శ్లాఘనీయమే అయింది. శాస్త్రవిహిత మయిన సంభారాలకంటే ఎక్కువైన సంభారాలతో యజ్ఞం ప్రారంభమయింది. అనుష్ఠానానికి విఘ్నం కలిగించే రాక్షసులే ఆ యజ్ఞానికి రక్షకులైనారు.

పిదప సీతాసుతులయిన కుశలవులు గురుప్రేరితులై అయోధ్యకు వచ్చి వాల్మీకి ప్రోక్తమయిన రామాయణాన్ని అక్కడక్కడా గానం చేయడం ప్రారంభించారు. అసలే అది రాముని చరిత్ర! పైగా కృతికర్త వాల్మీకి మహర్షి! కిన్నర కంఠం కల కుశలవులు గాయకులు! ఇక వినేవారు ఆనందించకుండా ఎలా వుండగలరు?

ఆ గానం విని సంతసించిన వారు కుశలవులను గూర్చి రామునికి నివేదించారు. అతడు సోదరసమేతుడై నిండు సభలో మిక్కిలి కుతూహలంతో ఆ బాలకుల అందచందాలను చూచాడు. గానాన్ని ఆలకించాడు. ఏకాగ్రచిత్తంతో వారి పాట వింటూ ఆనందాశ్రువులు రాలుస్తున్న ఆ సభ గాలి లేని వేకువవేళ మంచుబిందువులు జాలువార్చే వనస్థలిలాగా శోభిల్లింది.

వయస్సులోనూ, వేషంలోనూ తప్ప తక్కిన అన్ని అంశాలలోనూ ఆ బాలకులు అచ్చంగా రాముని పోలి వుండటాన్ని ప్రజలు రెప్పవాల్చకుండా అచ్చెరువుతో చూడసాగారు. ఆ కుశలవుల ప్రావీణ్యం పట్ల చూపిన విస్మయం కంటె రాముడిచ్చిన కానుకలపట్ల వారి నిఃస్పృహ చూచి జనులు ఎక్కువ విస్మయం ప్రకటించారు.

"మీకీ పాట నేర్పినవా రెవరు? ఈ కృతి రచించిన కవి ఎవరు? అని రాజు తానే ఆ బాలకులను ప్రశ్నించాడు. అందుకు వారు "వాల్మీకి మహర్షి" అని సమాధానం చెప్పారు.

పిమ్మట సోదరసమేతంగా రాముడు వాల్మీకిచెంతకు వెళ్ళాడు. తన శరీరం మాత్రం నిల్పుకొని రాజ్యాన్ని ఆ మహర్షికి సమర్పించాడు.

దయామయుడైన ఆదికవి ఆ బాలకు లిరువురూ సీతాగర్భ సంజాతులైన నీ పుత్రులే అని తెలిపి సీతను పరిగ్రహింప వలసిందిగా అర్థించాడు.

అప్పుడు రాముడు "తండ్రీ! నీ కోడలు మాయెదుటనే అగ్ని ప్రవేశం చేసి తన పవిత్రతను ప్రకటించింది. కాని, రాక్షసుని దౌష్ట్యం కారణంగా ఇక్కడి ప్రజలామెను విశ్వసించలేదు. జానకి తన శీలం విషయంలో ప్రజలకు విశ్వాసం కలిగించాలి. అలా చేస్తే మీ ఆనతితో ఈ పుత్రవతిని నేను పరిగ్రహిస్తాను" అని చెప్పాడు. రాముడలా అనగానే మునీంద్రుడు తపస్సులతో అర్థసిద్ధిని తెప్పించినట్లు శిష్యులద్వారా ఆశ్రమంనుండి సీతను రప్పించాడు.

ఆ మరునాడు రామచంద్రుడు ప్రకృత కార్యపరిపూర్తికై ప్రజలందరినీ సమావేశపరచి వాల్మీకిని పిలిపించాడు. స్వరసంస్కారాలు గల వేదఋక్కుతో సూర్యుని సమీపించినట్లు పుత్రసమేత అయిన సీతతో సహా ముని రాముని సమీపించాడు. కాషాయవస్త్రం దాల్చి తన పాదాలపై చూపు సారిస్తూ వచ్చిన ఆ దేవియొక్క ప్రసన్న శరీరమే "ఆమె సాధ్వి" అని చెప్పక చెప్పింది. అక్కడ చేరిన ప్రజలందరూ ఆమెనుండి చూపు మరల్చి పండిన పైరులాగా తలలు వాల్చి ఉండిపోయారు.

అప్పుడు ఉచితాసన మధిష్ఠించిన మునిపుంగవుడు ఆమెను చూచి "బిడ్డా! నీపతి ముందట నీశీలం విషయంలో లోకానికున్న సంశయం తొలగించు" అని ఆనతిచ్చాడు. అంతట వాల్మీకిశిష్యు డొసంగిన పవిత్ర జలాలు ఆచమించి సీత ఇలా సత్యవచనాలు పలికింది. "దేవీ! విశ్వంభరా! మనోవాక్కాయాలతో నేను నా పతివిషయంలో స్ఖాలిత్యం లేని దాననయితే నన్ను నీ గర్భంలో లీనం చేసుకో!"

ఆ సాధ్వీమణి అలా అనగానే భూమిలో ఒక రంధ్రం ఏర్పడింది. అందుండి విద్యుత్కాంతి వంటి ఒక ప్రభామండలం ఉదయించింది. ఆ



కాంతి పుంజంలో పాము పడగలపై నిల్చిన సింహాసనంపై కూర్చున్నదై సాగర మేఖల అయిన భూదేవి పొడసూపింది. ఆమె భర్తవైపు చూపు సారించి వున్న సీతను తన ఒడిలో కూర్చోబెట్టు కొని రాముడు "వద్దు వద్దు" అని వారిస్తూ వుండగానే పాతాళానికి వెళ్లిపోయింది. రాముడు ధనుర్ధారియై సీతను తిరిగి తనకప్పగించ గోరుతూ భూదేవిపట్ల సంరంభం ప్రదర్శించాడు. దైవశక్తిని గుర్తించిన గురుడు రాముని ఆగ్రహాన్ని ఉపశమింపజేశాడు.

పిదప యజ్ఞం పూర్తి కాగానే రాముడు ఋషులను, మిత్రులనూ యథోచితంగా పూజించి వారివారి స్థానాలకు వారిని సాగనంపాడు. సీతపై తనకు గల ప్రేమను ఆమె బిడ్డలపై నిల్పుకున్నాడు. ప్రజాపోషకుడయిన ఆ రాజేంద్రుడు యుధాజిత్తు సందేశాన్ని అనుసరించి సింధుదేశాన్ని భరతుని కప్పగించాడు. భరతుడక్కడ యుద్ధంలో గంధర్వుల నోడించాడు. వారు ఆయుధాలు విడిచి వీణను మాత్రమే గ్రహించేటట్లు చేశాడు.

పిమ్మట భరతుడు తక్షుడు, పుష్కలుడు అనే తన కుమారులను తక్షశిలా, పుష్కలావతీ పట్టణాలకు పరిపాలకులుగా నియమించాడు. తరువాత రాముని వద్దకు తిరిగి వచ్చాడు. లక్ష్మణుడు కూడా రాముని శాసనాన్ని అనుసరించి అంగద చంద్రకేతులనే తన కొడుకులను కారాపథ దేశానికి అధీశ్వరులుగా నియమించాడు.

## శ్రీరామావతార పరిసమాప్తి

ఈ రీతిగా కొడుకులను రాజ్యాధిపతులను గావించి ఆ జనాధిపతులు భర్తృలోకాలకు పయనించిన తల్లులకు క్రమంగా శ్రాద్ధాది విధులు నిర్వర్తించారు.

ఆపై ఒకనాడు కాలుడు మునివేషంతో రాముని చెంతకు వచ్చి "రామా! ఏకాంతంలో నీతో మాట్లాడవలసి ఉంది. మనం మాట్లాడుతుండగా ఎవ్వరూ రాకూడదు. అలా వచ్చిన వారిని నీవు పరిత్యజించాలి" అని చెప్పాడు.

రాముడందు కంగీరించాడు. అంతట కాలుడు నిజస్వరూపం ప్రదర్శించి "రామా! బ్రహ్మదేవుని ఆనతి ప్రకారం ఇక నీ వీ యవతారం చాలించి మరల వైకుంఠం అధిష్ఠించు" అని విన్నవించాడు.

ఆ సందర్భంలో లక్ష్మణుడు ద్వారదేశంలో కాపుగా నియోగింపబడి వున్నాడు. అతడికి రహస్యభంగం చేయరాదన్న సంగతి కూడా తెలుసు. అయినా వెంటనే రామసందర్శనం కోరి వచ్చిన దుర్వాసుని శాపానికి భయపడి సౌమిత్రి వారి రహస్య సమావేశానికి భంగం కలిగించాడు. యోగవేత్త అయిన సుమిత్రాపుత్రుడు సరయూనదీ తీరం చేరి దేహం పరిత్యజించి అన్న ప్రతినను నిలబెట్టాడు. తనలో నాల్గవ అంశమైన లక్ష్మణుడు ముందుగా నాకలోకం చేరేసరికి, రాముడు మూడు పాదాలతోడి ధర్మదేవతలాగా కుదురుపాటు లేనివాడయ్యాడు.

స్థితప్రజ్ఞుడైన శ్రీరాముడు శత్రుగజముల పాలిటి అంకుశమైన కుశుణ్ణి కుశావతీ నగరానికి అధిపతిగా చేశాడు. మంచి మాటలతో సజ్జనులకు అశ్రులవాలను ఆపాదింపజేసే లవుణ్ణి శరావతీ పట్టణానికి పరిపాలకుడుగా నియమించాడు. పిదప అనుజులతో సహా అగ్ని పురస్సరంగా ఉత్తరాభిముఖుడై స్థిరచిత్తంతో పయనించాడు. అయోధ్యానగర జనులందరూ అనురాగంతో అతణ్ణి అనుసరించి నడిచారు.

రాముని చిత్తమెరిగిన కపులూ, రాక్షసులూ కడిమి మొగ్గల్లాగా స్థూలమైన ప్రజల కన్నీటి చుక్కలతో తడిసిన రాముని మార్గాన్ని అనుగమించారు. ఇంతలో దివ్య విమానం రాముణ్ణి సమీపించింది. భక్తానుగ్రహ తత్పరుడయిన రాముడు తన్ననుసరించిన ప్రజానీకం స్వర్గానికి వెళ్ళడానికి సరయూనదినే నిచ్చెనగా చేశాడు. ఆ నదిలో మునిగే ప్రజల సమ్మర్దం గోవు లేరు దాటునట్లు పొడకట్టింది. అందువల్లనే అక్కడి తీర్థం గోప్రతరణ మనే పేరుతో భూలోకంలో తరువాత ప్రశస్తి వహించింది.



దేవతాంశలో జన్మించిన సుగ్రీవాదులు స్వస్వరూపాలు పొందారు. దేవలోకం చేరిన అయోధ్యా పౌరులకు రాముడు నూతనంగా ఒక స్వర్లోకాన్ని కల్పించాడు. ఈ రీతిగా మహావిష్ణువు దేవతలకొరకై రావణ సంహారకృత్యం నిర్వర్తించాడు. లంకాధీశుడైన విభీషణుణ్ణి దక్షిణాన చిత్రకూటంలోనూ, హనుమంతుణ్ణి ఉత్తరాన హిమాద్రిలోనూ – ఇరువురినీ రెండు కీర్తి స్తంభాలుగా ఇరువైపులా స్థాపించాడు. తరువాత లోకా లన్నిటికీ ఆధారమైన నిజస్వరూపం దాల్చి వెలుగొందాడు.

* * *

## 16

శ్రీరాము డలా నిర్వాణం పొందిన తర్వాత లవుదు మొదలైన రఘువీరులు ఏడుగురూ పుట్టుకతోనేగాక గుణాలతో గూడా జ్యేష్ఠుడైన కుశుడికి శ్రేష్ఠ వస్తువులను కానుకలుగా సమర్పించారు. సౌభ్రాత్రం వాళ్ళకు వంశానుగతమే కదా! ఆనకట్టలు కట్టడం, కృషిగోరక్షణాలు నిర్వహించడం, ఏనుగులను బంధించడం మొదలగు ఫలప్రదమైన పనుల్లో ఆరితేరి వాళ్ళందరూ ఎంతో అభ్యుదయం సాధించారు. అంత సమర్థులై వుండి కూడా సముద్రాలు చెలియలి కట్టలను దాటనట్లు వాళ్ళు అన్యోన్య దేశవిభాగాల సరిహద్దులను మాత్రం అతిక్రమించలేదు. విష్ణ్వంశ సంభూతమై దానప్రవృత్తి వదలని ఆ వంశం సామవేదంనుండి ప్రభవించిన దిగ్గజాల వంశంలాగా ఎనిమిది పాయలుగా విస్తరిల్లింది.

అది ఒకనాటి అర్ధరాత్రి. అందరూ నిద్రిస్తున్నారు. దీపాలు స్తిమితంగా వెల్గుతున్నాయి. శయ్యాగృహంలో అప్పుడే మెలకువ గాంచిన కుశుడు తానంతకు ముందు ఎన్నడూ చూడని ప్రోషితభర్తృకావేషంలో వున్న ఒక వనితను చూచాడు. సజ్జన సాధారణమైన రాజ్యసంపదతోనూ, ఇంద్రుని వంటి తేజంతోనూ విరాజిల్లేవాడూ, శత్రువిజేతా, ప్రశస్తబాంధవ సమేతుడూ అయిన ఆ కుశుని ముందు ఆమె "జయోఽస్తు తే" అంటూ చేతులు మోడ్చి నిలబడింది.

వేసిన గడియ వేసినట్లే వుండగా అద్దంలో ప్రవేశించిన నీడ లాగా గదిలోకి ప్రవేశించిన ఆ కాంతను చూచి కుశుడు ఆశ్చర్యపడ్డాడు. తల్పంనుండి సగం శరీరంతో పైకిలేచి అత డామెతో ఇలా అన్నాడు–

"కల్యాణీ! ఆవరణంతో కూడిన ఈ గృహంలోనికి నీవెలా ప్రవేశించావు? నీలో యోగ ప్రభావం కూడా కనిపించడం లేదు. మంచు గప్పిన తామరలా వున్న నిన్ను చూస్తుంటే ఏదో బాధతో వున్నట్లున్నావు. ఎవరు నీవు? నీపతి



యెవరు? నావద్దకిప్పుడు ఇలా ఎందుకు వచ్చావు? జితేంద్రియులైన రఘువంశజుల చిత్తం పరస్త్రీ విముఖమన్న సంగతి గ్రహించి నీ అభిమత మేమిటో చెప్పు."

అంతట ఆమె అతనితో ఇలా అన్నది – "రాజా! మీ తండ్రి స్వస్థానానికి పయనమై పోతూ పవిత్రమైన ఏ నగరంనుండి పౌరులను సయితం తనతో తీసుకువెళ్లాడో, ఆ అయోధ్యానగరానికి అధిదేవతను నేను. ఇప్పుడు అనాథనైపోయాను. మహామహులైన రాజాధిరాజుల ఏలుబడిలో సకలైశ్వర్యాలతో తులదూగుతూ పూర్వం అలకాపురిని సైతం తిరస్కరించిన నేను సూర్యవంశజుడవూ, సమగ్ర శక్తి సంపన్నుడవూ ఐన నీవు ఉండగానే ఈ దీనావస్థకు లోనయ్యాను. పాడుపడిన వందలకొలది అట్టళ్లు, ఇళ్ళు, పడిపోయిన ప్రాకారాలతో కూడి ప్రభువు లేని నా నగరమిప్పుడు సూర్యు డస్తమించగానే ఝంఝూనిలపు తాకిడికి చెదరిపోయిన మబ్బులతో కూడిన సాయంసమయంలా వున్నది.

పూర్వం మెరుగులీనే కాలియందెల గజ్జల ధ్వనులతో అభిసారికలు సంచరించిన రాజవీథిలో ఇప్పుడు ఉల్క లెగసిపడే ముఖాలతో కర్ణకఠోరంగా అరుస్తూ నక్కలు మాంసం కొరకై అన్వేషిస్తున్నాయి. జలక్రీడా సమయంలో జలజాక్షుల అరచేతి దెబ్బలతో నాడు మృదంగ ధ్వని ననుకరించిన నడబావులలోని నీరు నేడు అడవిదున్నల కొమ్ముల పోట్లతో ఆక్రోశిస్తున్నది. క్రీడామయూరాలు ఆధారస్తంభాలు విరిగి పోవడంవల్ల చెట్లపై వాలుతున్నాయి. మృదంగధ్వనులు లేకపోవడంవల్ల నృత్యం మానుకొన్నాయి. దావానల స్ఫులింగాలచే కాలి మిగిలిన పింఛాలతో అవి అడవినెమళ్లై పోయాయి. ఏ సోపాన మార్గాలలో తొల్లి రమణీమణులు లత్తుకరసం జొత్తిల్లే తమ పాదాలు మోపేవారో, అక్కడ నేడు అప్పుడే మృగాలను హతమార్చిన పులులు రక్తసిక్తమైన కాళ్ళతో తిరుగులాడుతున్నాయి.

పెంటి యేనుగులనుండి తామరతూడు లందుకొంటూ కొలనులో ప్రవేశించినట్లు గోడలపై చిత్రించబడ్డ మదగజాల కుంభస్థలాలను కోపించిన సింహాలు నఖాంకుశాలతో చీల్చివేస్తున్నాయి. కొయ్యకంబాలపై రంగు వెలిసిపోయి దుమ్ముకొట్టుకొన్న స్త్రీ ప్రతిమలు పాములు విడిచిన కుబుసాలనే పైటలుగా ధరిస్తున్నాయి. సున్నపు పూతలు కాలక్రమంలో నల్లబడిపోగా, అక్కడక్కడా గడ్డి మొలచిన మేడలలో పూర్వం లాగా ముత్తెపు సరాలవలె స్వచ్ఛమైన చంద్రకిరణాలు ఇప్పుడు ప్రతిఫలించడం లేదు. పూర్వం విలాసినులు ఏ తీవలకొమ్మలను దయతో మెల్లగా వంచి పూలు కోసుకొనేవారో, ఆ నా ఉద్యానలతలు ఇప్పుడు కోతులచేత, అడవి చెంచులచేత వలె చీకాకుపడుతున్నాయి.

ఆ నగర ప్రాసాదాల గవాక్షాలనుండి ఇప్పుడు రాత్రివేళలందు దీపకాంతులు ప్రసరించడం లేదు. పగలు గూడా అక్కడ కాంతల ముఖకాంతులు కనిపించవు. అగరుధూపాల ప్రసారం ఎన్నడో విచ్ఛిన్న మయింది. ఇప్పు డాగవాక్షాలన్నింటినీ సాలీళ్ళు తమ గూళ్ళతో కప్పివేశాయి. పూజోపహారాది క్రియలు లోపించిన సైకతస్థలాలు గలవీ, స్నానసాధనాలతో సంబంధం లేనివీ, ప్రబలిన ప్రబ్బలి పొదరిళ్ళుగలవీ, జనసంచారం లేనివీ అయిన సరయూజలాలను చూచి నేనెంతో పరితపించిపోతున్నాను. అందువల్ల మీ తండ్రి కారణమనుష్యమూర్తిని వీడి పరమాత్మమూర్తిని పొందినట్లే, నీవు ఈ కుశావతిని వదలి కులరాజధానికి తిరిగి చేరవలసిందిగా ప్రార్థిస్తున్నాను.”

## అయోధ్యకు కుశుని రాక

అంతట రఘుప్రవరుడైన కుశుడు ఆమె ప్రార్థనను ‘అలాగే’ అని అంగీకరించాడు. ఆమె ప్రసన్నవదనయై అక్కడనుండి అంతర్ధానమయింది.

మరునాటి వేకువన రాత్రి జరిగిన ఆశ్చర్యావహమైన వృత్తాంతాన్ని రాజు ద్విజులకు తెలియబరచాడు. కులరాజధాని స్వయంగా వచ్చి వరించిన



కుశుణ్ణి వారు అభినందించారు. అతడు కుశావతీ నగరాన్ని శ్రోత్రియులకు దానం చేశాడు. ప్రయాణానుకూలమైన దినాన అంతఃపురజనులతో కూడి అయోధ్యాభిముఖంగా పయన మయ్యాడు. మేఘాలు వాయువు ననుసరించినట్లు సైన్యాలు అతణ్ణి అనుసరించాయి. ఆ నరపాలుడు పయనమై పోతుండగా కేతనాలు ఉద్యానాలను అనుకరించాయి. గజాలు క్రీడాశైలాల వలె భాసించాయి. రథాలు సమున్నత సౌధాలకు దీటయ్యాయి. ఇలా అతని సేన కదలిపోతున్న రాజధానిలా భాసించింది.

నిర్మలమైన ఆతపత్ర మండలంతో శోభిల్లే ఆ కుశుడు అయోధ్యవైపు నడిపిస్తున్న సేనాసన్నివేశం విమలమండలుడై ఉదయించిన చంద్రుడు తీరంవైపు నడిపిస్తున్న సముద్రంలాగా విరాజిల్లింది. నేల దద్దరిల్లేటట్లు నడుస్తున్న ఆ సేనల తాకిడిని తట్టుకోలేక కాబోలు వసుంధర రజోవ్యాజంతో ఆకసాన్ని అధిరోహింపబోయినట్లు తోచింది. కుశావతినుండి మున్ముందుకు సాగుతూ అయోధ్యా నగరం వైపుగా కదలిపోతున్న ఆ మహాసేన దారిలో వెనుక గాని, ముందుగాని, మధ్యలోగాని ఎక్కడ చూస్తే అక్కడ అపరిమితమై కనిపించింది. దారిలో ఆ భూపాలుని గజాలనుండి స్రవించిన మదజలంవల్ల దుమ్ము బురదగానూ, గుర్రపు గిట్టల తాకిడికి బురద దుమ్ముగానూ మారింది.

వింధ్యగిరుల కటకాలలో నర్మదానదిలాగా దారి వెతుక్కుంటూ పలుపాయలుగా చీలి రొద చేసుకుంటూ సాగుతున్న ఆ సేన గుహాముఖాలను ప్రతిధ్వనింప జేసింది. గైరికాది ధాతువుల స్పర్శతో రథచక్రపుటంచులు ఎరుపెక్కగా, గజతురగాదుల సవ్వడితో తూర్యధ్వనులు కలిసిపోగా ఆ ప్రభువు కిరాతులు సమర్పించే కానుకలవైపు చూపు సారిస్తూ వింధ్యాద్రి దాటి ముందుకు పోయాడు. గజశ్రేణితో సేతు బంధనం కావించి పడమర వైపు ప్రవహించే గంగానదిని దాటుతున్న కుశునికి రెక్క లల్లారుస్తూ ఎగిరే హంసలు అయత్న సిద్ధమైన వింజామర లయ్యాయి.

కపిల మునీంద్రుని రోషంతో భస్మావశిష్ట శరీరులైన తమ పూర్వుల స్వర్గప్రాప్తికి హేతువులూ, పడవలకు కదిలేవీ అయిన గంగాజలాలకు అతడు మోకరిల్లాడు. అలా కొన్ని దినాలు పయనం కొనసాగించి అతడు సరయూ నదీతీరం చేరాడు. అక్కడ పూర్వం రఘువంశరాజులు యజ్ఞవేదికలపై నెలకొల్పిన వందలకొలది యూపస్తంభాలను చూచాడు. అయోధ్యలోని ఉద్యానవనాలనుండి వీచిన గాలి పూరెమ్మలను కదిలించి, సరయూ తరంగాలను స్పృశించినదై బడలిన సైన్యంతో విచ్చేసిన భూపాలునికి ఎదురు వచ్చింది.

శత్రువులను శరజాలం పాలుచేసినవాడూ, పౌరుల చెలికాడూ, కులానికి ధ్వజప్రాయమైనవాడూ, బలవంతుడూ అయిన కుశుడు కదలాడే పతాకలతో విలసిల్లే సైన్యాలను పట్టణ పరిసరంలో విడియించాడు. గ్రీష్మతప్తమయిన భూమికి తొలకరి చినుకు మబ్బులు శోభ చేకూర్చినట్లే నృపుడు నియోగించిన శిల్పులు తగిన పరికరాలతో అయోధ్యానగరికి క్రొత్త చెలువు గలిగించారు. పిదప ప్రశస్త దేవతా మందిరాలతో ఒప్పారే నగరానికి రఘువీరుడు ఉపవాసవ్రత నిష్ఠులయిన వాస్తు శాస్త్రవేత్తలచే పశుబలిపూర్వకంగా సపర్యలు చేయించాడు. ఆపై కాంతా హృదయంలో ప్రవేశించే కాముకునిలాగా అతడు రాజభవనం ప్రవేశించాడు. అమాత్యులు మొదలైన పరివారానికి కూడా వారి వారికి తగినట్లు ఇతర గృహాలలో ప్రవేశం కలిగించాడు.

నగరంలోని అంగళ్లు క్రయ విక్రయాలకు తగిన వస్తువులతో నిండిపోయాయి. అశ్వాలు అశ్వశాలలను, గజాలు గజశాలలను ఆశ్రయించాయి. సర్వాంగీణంగా అలంకరింపబడిన నారీమణిలాగా అయోధ్యానగరి శోభిల్లింది. అలా పూర్వశోభను పుణికి పుచ్చుకొన్న కులరాజధానిలో నివసిస్తూ కుశుడు అమరలోకాధిపతిని గానీ, అలకాధిపతిని గానీ లెక్కింపనివా డయ్యాడు.



అంతట రత్నాలు తాపిన ఉత్తరీయాలూ, తెల్లని స్తనాలపై వ్రేలాడే హారాలూ, నిట్టూర్పు గాడ్పులకు చెదరిపోయే జిలుగుపైటలూ గల శీతల ప్రాయమైన వేషాన్ని కుశుని ప్రియురాండ్రకు ఉపదేశించటానికా అన్నట్లు వేసవి సమయం వచ్చింది. దక్షిణ దిశనుండి సూర్యుడు తన చెంతకు రాగానే ఉత్తరదిశ జాలువార్చిన ఆనంద శీతలమైన బాష్ప వృష్టియా అన్నట్లు హిమవంతంనుండి మంచు నీరు స్రవించింది. అధికతాపంతో తపించే పవలు, మిక్కిలిగా కృశించిన రేయి – ప్రణయకలహంతో వేరుపడి పశ్చాత్తాపానికి గురి అయిన దంపతులతో పోలిక పొందాయి. పాచిబట్టిన క్రిందిమెట్లను ఒకటొకటిగా నానాటికీ విడుస్తూ క్రిందికి పోతున్న నడబావులలోని నీరు పైకి నిక్కిన నాళాలతోడి పద్మాలతో కూడినదై కాంతల పిరుదులబంటి లోతుగలదయింది.

ఉద్యానాలలో సాయంవేళ సువాసనలు వెదజల్లుతూ విచ్చిన మల్లెమొగ్గలపై ఝుంకరిస్తూ ఒండొంటిమీదుగా కాలుమోపిన తుమ్మెద ఆ మొగ్గలను లెక్కిస్తున్నదా అన్నట్లు గోచరించింది. కామినుల కర్ణావతంసమైన దిరిసెన పువ్వు చెమర్చిన వారి నఖక్షతాంకిత కపోలతలంలో కేసరాలు అతుక్కుపోవటంవల్ల చెవినుండి జారినా వెంటనే క్రింద పడలేదు. ఆ మండు వేసవిలో సంపన్నులు యంత్రధారాగృహాలలో చల్లని జలధారల మధ్య చందనోదకంతో క్షాళితమైన మణిమయశిలల నధిష్ఠించి ఎండవేడిమి తప్పించుకొన్నారు. వసంతుడు వెళ్ళి పోవడంతో బలహీనుడైన మన్మథుడు సాయంవేళల్లో స్నానమాడి ధూపంతో తడియార్చుకొని మల్లెలు తురిమిన మగువల కేశపాశాల సాయంతో మళ్ళీ బలం పుంజుకొన్నాడు.

పుప్పొడి క్రమ్మిన పొడవైన ఏరుమద్ది పూరెమ్మ మన్మథుని శరీరాన్ని దహించి కూడా తీరని రోషంతో శివుడు ఖండించిన అతని అల్లెత్రాడులాగా శోభిల్లింది. వేసవికాలం మామిడి చివుళ్ళనూ, మాగిన కల్లునూ, అప్పుడే పూచిన కలిగొట్టు పూలనూ మనోజ్ఞమైన గంధంతో నింపి కాముకులలోని

తాపాదిదోషాలన్నింటినీ తొలగించింది. ఎండలు మండిపోతున్న ఆ సమయంలో అభ్యుదయ పథంలో సాగుతూ, తమ పాదసేవతో తాపం తొలగింపగల రాజూ, రేరాజూ – వీరిరువురే ప్రజానీకానికి ప్రీతిపాత్రులయ్యారు. వీచికలపై తేలియాడే మదించిన రాయంచలూ, గట్టున పూలు రాల్చే తీవలూ కల్గి గ్రీష్మంలో సుఖమయమైన సరయూ నదీజలాలలో జలజనేత్రలతో కూడి జలక్రీడ లాడాలనే కోరిక రాజుకు కలిగింది.

వెంటనే ఆ నదీతీరంలో దేరాలు ఏర్పాటయ్యాయి. జాలరులు నీళ్ళలోని మొసళ్లను తొలగించారు. విష్ణుతేజుడైన కుశుడు తన సంపదకూ, ప్రభావానికీ తగినట్లుగా నదిలో జలక్రీడలకు ఉద్యమించాడు.

## జలక్రీడ

మెట్ల దారిలో దిగుతున్న పడతుల బాహుపురులు పరస్పరం ఒరసుకోవడంవల్ల కల్గిన శబ్దానికీ, వారి కాలియందెల రవళికీ నదిలోని హంసలు బెదరిపోయాయి. ఒకరిపై ఒకరు నీళ్ళు చల్లుకుంటున్న అంగనల జలక్రీడాభిలాషను చూడగోరి రాజు ఒక పడవపై ఎక్కాడు. తన ప్రక్కనే వున్న చామర గ్రాహిణి అయిన బోయెతతో అతడిలా అన్నాడు–

"వందలకొలది నా అంతఃపురకాంతలు మైపూతలు కరిగిపోయేటట్లు జలక్రీడ లాడుతున్నారు. అందువల్ల మబ్బులతో కూడిన సంధ్యోదయం లాగా యీ సరయూ ప్రవాహం నానావర్ణ సమన్వితమై కన్పిస్తున్నది. చూడు. పడవలతో కల్లోలితమైన నదీజలాలు ఈ కాంతల కనులలోని కాటుకను కడిగివైచి దానికి బదులు మదరాగ శోభను కల్గిస్తున్నాయి. బరువైన పిరుదులు, పాలిండ్లతోడి శరీరాలను మోయలేక ఈ అబలలు కేయూరాలతోడి భుజాలతో క్రీడాభినివేశంవల్ల క్లేశాన్ని పరిగణించకుండా ఈదులాడుతున్నారు. జలక్రీడలాడే చెలువల చెవులనుండి జారిపడి ప్రవాహంలో చలిస్తున్న శిరీషప్రసవాలు నాచుపై ప్రీతిగల చేపలను మోసగిస్తున్నాయి. ముత్యాలవంటి



జలబిందువులు పాలిండ్లనుండి జారుతుండగా పోటీపడి జల్లులాడుకుంటున్న ఈ వనితలు ఆ సందడిలో తెగిపోతున్న హారాలను గూడా గుర్తించడం లేదు. విలాసినుల పొక్కిళ్ళకు, కనుబొమ్మలకు, పాలిండ్లకు క్రమంగా ఉపమానాలుగా పేరు పొందిన సుడులు, అలలు, చక్రవాకాలు ఇప్పుడు తమతమ ఉపమేయాలకు చేరువయ్యాయి.

నదీతీరంలోని మయూరాలు పురులు విప్పి నాట్యమాడుతూ మధుర కేకారవాలతో అభినందిస్తున్న పాటకు తగిన వీరి జలమృదంగ వాద్యం వీనులవిందుగా ఉన్నది. తరుణీమణుల నితంబాలకు అతుక్కుపోయిన తడిబట్టల చాటున నుండి వెన్నెలలో లీనమైన చుక్కలను పోలినవై ముత్యాల మొలనూళ్ళు ఆధారసూత్రం తడిసి పోవటంవల్ల కదలలేక మూగవోయాయి. ఒండొరుల మొగాలపై పంతంతో నీరు చల్లుకొంటున్న ఈ మానినులు వంకరలు లేని తమ ముంగురులనుండి కుంకుమాది చూర్ణాలతో ఎర్రబడిన జలబిందువులను జారుస్తున్నారు. వీరి జడముడులు విడిపోయాయి. పత్రరచనలు కరిగిపోయాయి. ముత్యాల చెవికమ్మలు జారాయి. ఈ రీతిగా జలవిహారంలో చెదిరిపోయినా వారి ముఖవేషం మనోజ్ఞంగానే వున్నది."

అలా ఆ యంగనల అందచందాల నభివర్ణిస్తూ కుశుడు విమానంవంటి పడవనుండి దిగాడు. పెకలించిన తామరతూళ్లు స్కంధంపై తగులువడగా కరేణువులతో క్రీడించే కరీంద్రునిలాగా అతడు హారాలు తూగాడుతుండగా కాంతలతో కూడి జలక్రీడ లాడాడు. ప్రకాశమానుడైన నరపతితో కూడిన ఆ స్త్రీలు ఎంతో శోభిల్లారు. సహజంగానే కంటి కింపైనవి ముత్యాలు. కాంతు లెగజిమ్మే ఇంద్ర నీలమణితో చేరినప్పుడు ఇక వాటి శోభనేమని చెప్పాలి? ఆ విశాలాక్షులు రాజుపై బంగారు చిమ్మన గ్రోవులనుండి అనురాగంతో రంగునీళ్ళు చిమ్మారు. అలా తడిసిన భూపాలుడు గైరికాది ద్రవ్యరస రంజితమైన పర్వతరాజులా భాసిల్లాడు. అంతఃపుర వనితలతో

నదిలో ఆ రీతిగా క్రీడించే కుశుడు ఆకాశగంగలో అచ్చరలతో కూడి విహరించే అమరేంద్రునిలా ప్రకాశించాడు.

పూర్వం శ్రీరాముడు అగస్త్య మహర్షినుండి తాను స్వీకరించిన ఒక ఆభరణాన్ని రాజ్యంతో సహా కుశుని కప్పగించి వుండినాడు. జయశీలమైన ఆ ఆభరణం జలక్రీడలో రాజుకు తెలియకుండానే జారిపడి నీట మునిగిపోయింది. అతడు యథేచ్ఛగా వనితలతో సహా స్నానమాడి గట్టున వున్న గుడారం చేరుకున్నాడు. అక్కడ అలంకరణ చేసుకొనే సమయంలో దివ్యాభరణ శూన్యమై వున్న తన బాహువును చూచుకొన్నాడు. ఆ ఆభరణం జయలక్ష్మికి వశీకరణమైనది. పైగా తన తండ్రి ధరించినది. అంచేత అతడది జారిపోవడాన్ని సహించలేకపోయాడే గాని లోభంతో కాదు. ఆ ధీరుడు పూలనూ, ఆభరణాలనూ సమదృష్టితో చూచేవాడు గదా!

పిదప ఈతలో నిపుణులైన జాలరుల నందరినీ ఆభరణాన్ని అన్వేషించ వలసినదిగా రాజు ఆదేశించాడు. వాళ్ళు నదిని కలయ వెదకి వెదకి వ్యర్థప్రయత్ను లయ్యారు. ఐనా ఆభరణం జాడ తెలియడం వల్ల వాడని మోములతో వచ్చి కుశునితో ఇలా అన్నారు–

"దేవా! ప్రయత్నంతో అంతటా వెదికాము. కాని మునిగిపోయిన ఆభరణం ఎక్కడా దొరకలేదు. కాని మడుగులో వుండే కుముదుడనే నాగరాజు లోభంతో దాన్ని తీసుకొని వుంటాడని మేము భావిస్తున్నాము."

అది విని కోపంతో కనులెర్రవారగా బలవంతుడయిన కుశుడు ధనుర్ధారి యయ్యాడు. నదిగట్టున నిల్చి కుముదుని హతమార్చడానికై గారుడాస్త్రం వింట సంధించాడు. అపుడా నది క్షోభపడి తరంగహస్తాలతో గట్టులను పడగొడుతూ గర్తంలో పడ్డ వనగజంలాగా భయంకర మయిన ధ్వని గావించింది.



అంతట మథ్యమానమైన సముద్రంనుడి లక్ష్మీసహితమైన పారిజాతవృక్షం ఉదయించినట్లు క్షోభచెందిన మొసళ్ళుగల ఆ మడుగునుండి ఒక కన్యను ముందు బెట్టుకుని భుజంగరాజు వెంటనే పైకి వచ్చాడు. ఆభరణం తిరిగి అప్పగించడానికి వచ్చిన కుముదుణ్ణి చూచి కుశుడు గారుడాస్త్రం ఉపసంహరించుకొన్నాడు. వినమ్రుల పట్ల సజ్జనులు కోపం చూపరు కదా!

గారుడాస్త్ర మహిమ తెలిసిన కుముదుడు త్రిలోకనాథుడైన రాముని కుమారుడూ, శత్రునిగ్రహ నిపుణుడూ, మూర్ధాభిషిక్తుడూ అయిన కుశుని యెదుట మహోన్నతమైన తన శిరసు వంచి వందనం చేసి యిలా విన్నవించాడు–

"నరేంద్రా! కార్యార్థమై మనుజుడుగా అవతరించిన రామచంద్రుని యొక్క పుత్రుడవే నీవు. నిన్ను ఆ రాముని మారురూపంగానే భావిస్తున్నాను. అలాంటి నేను ఆరాధనీయుడవైన నీ ప్రీతికెలా విఘాతం కలిగిస్తాను? చేతిదెబ్బకు పైకెగిరిన బంతివైపు చూస్తూ ఈ బాలిక ఆకసంనుండి పడే చుక్కలాగా మడుగునుండి పడుతున్న మీ ఆభరణాన్ని చూచి మిక్కిలి కుతూహలంతో పట్టుకొన్నది. మోకాలివరకూ వ్రేలాడుతూ, అల్లెత్రాటి దెబ్బల గుర్తులు కల్గి, భూవలయ రక్షణలో పరిఘవలె విలసిల్లే బలిష్ఠమైన నీభుజంతో ఈ ఆభరణం మళ్ళీ సంయోగం పొందుగాక! రాజా! ఈమె నా కనిష్ఠ సోదరి. ఈమె పేరు కుముద్వతి. చిరకాలం తమ పాదసేవ చేస్తూ తన అపరాధాన్ని తొలగించుకోవాలని ఈమె అభిలషిస్తున్నది. ఈ బాలిక కోరికను మన్నింప వేడికోలు."

## కుముద్వతీ పరిణయం

అలా విన్నవిస్తూ ఆభరణం సమర్పించిన కుముదుణ్ణి చూచి కుశుడు "నీవు మాకు శ్లాఘ్యబంధుడవు" అని ప్రశంసించాడు. తర్వాత బంధుసమేతుడై కుముదుడు కన్యారూపమైన కులభూషణాన్ని కూడా అతనికి శాస్త్రోక్త విధి

ననుసరించి సమర్పించాడు. మంగళార్థమైన మేషరోమ సూత్రం చుట్టిన కుముద్వతీహస్తాన్ని మనుజేంద్రుడు సహధర్మాచరణకై అగ్ని సాక్షికంగా చేపట్టాడు. అప్పుడు దివ్య తూర్యధ్వనులు దిగంతాలలో మారు మ్రోగాయి. ఆశ్చర్యంగా మేఘాలు సుగంధ బంధురమైన పుష్పాలను వర్షించాయి.

ఈ రీతిగా నాగరాజు శ్రీరాముని ఔరసపుత్రుడైన కుశునితోనూ, కుశుడు తక్షకుని కైదవతరం వాడైన కుముదునితోనూ బంధుత్వం పొందారు. అందువల్ల కుముదునికి గరుడభయం తొలగిపోయింది. కుశుని రాజ్యంలో సర్పభయం సమసిపోయింది. పురజనుల ప్రీతికి పాత్రుడై కుశుడు చక్కగా రాజ్యం పాలించాడు.

* * *

# 17

రాత్రి నాల్గవ జామువల్ల బుద్ధి వైశద్యం పొందినట్లు కుముద్వతి కుశుని వలన అతిథి అనే పుత్రుణ్ణి పొందింది. సాటిలేని తేజస్వి అయిన ఆ బాలుడు తండ్రిచే సుశిక్షితుడై సూర్యుడు ఉత్తర దక్షిణ మార్గాలను పవిత్రం చేసినట్లే మాతృపితృ వంశాలను రెండింటినీ పావనం చేశాడు.

అర్థవిదులలో అగ్రగణ్యు డయిన కుశుడు మొదట అతిథిచే కులవిద్యలను గ్రహింపజేశాడు. తర్వాత రాజకన్యలతో అతనికి పాణిగ్రహణం చేయించాడు. కులీనుడూ, శూరుడూ, నిగ్రహపరుడూ అయిన ఆ భూపాలుడు కులీనుడూ, శూరుడూ, నిగ్రహపరుడూ అయిన ఆ కుమారుని వలన ఒకడుగా ఉండే తాను ఇద్దరుగా మారినట్లు భావించాడు.

ఒకసారి తన కులాని కనుగుణంగా ఇంద్రునికి సహాయం చేయడానికి వెళ్ళి కుశుడు సమరంలో దుర్జయుడనే దైత్యుణ్ణి సంహరించాడు. ఆ రక్కసునిచేత తానుగూడా అసువులు గోల్పోయాడు. కుముదానంద కరుడయిన చంద్రుణ్ణి వెన్నెల అనుగమించినట్లు నాగరాజగు కుముదుని సోదరి అయిన కుముద్వతి పతితో సహగమనం చేసింది. ఆ రీతిగా నాకలోకానికి వెళ్ళిన వారిరువురిలో కుశుడు ఇంద్రుని సింహాసనంలో అర్ధభాగానికి అధిపతి అయ్యాడు. కుముద్వతి ఇంద్రాణికి నెచ్చెలియై పారిజాతాంశంలో భాగం స్వీకరించింది.

## అతిథి రాజ్యపాలన

యుద్ధానికి వెళుతూ కుశుడు కావించిన చివరి ఆదేశాన్ని స్మరిస్తూ మంత్రి వృద్ధులు అతని కుమారుణ్ణి రాజ్యాధిపతిని చేశారు. వారు అతణ్ణి అభిషేకించడానికై శిల్పులచే ఉన్నతమైన వేదికగల, నాలుగు స్తంభాల తోడి ఒక నూతన మండపం నిర్మింపజేశారు. ఆ మండపంలో భద్రాసనం మీద అతిథిని కూర్చోబెట్టి తీర్థజలాలతో నిండిన స్వర్ణకుంభాలతో ఆ మంత్రులు

అతణ్ణి సమీపించారు. అప్పుడు మధురంగానూ, గంభీరంగానూ నినదించే తూర్యధ్వని ఆ రాకుమారునికి కలుగనున్న అవిచ్ఛిన్న మయిన కల్యాణ పరంపరను సూచించింది. దూర్వాంకురాలు, యవాంకురాలు, జువ్విపట్టలు, లేజివుళ్ళు మొదలయిన మంగళ ద్రవ్యాలతో జ్ఞాతివృద్ధులు అతనికి నీరాజన విధులు నిర్వర్తించారు.

పురోహిత ప్రముఖులైన బ్రాహ్మణులు జయశీలుడైన అతిథిని జయశీలాలైన అథర్వమంత్రాలతో మొదట అభిషేకించడానికి పూనుకున్నారు. శబ్దం చేస్తూ అతని శిరస్సుపై పడిన అభిషేకజల ప్రవాహం శివుని శిరస్సు పైకి దూకిన గంగా ప్రవాహం లాగా భాసించింది. అభిషేక సమయంలో వందిజనుల స్తుతు లందుకొని వర్ధిల్లిన రాజపుత్రుడు చాతక పక్షుల అభినందన లందుకొన్న నిండు మేఘునిలా కనిపించాడు. మంత్రపూతాలయిన శుద్ధజలాలలో స్నానం చేస్తున్న అతని కాంతి వర్షజలంతో తడిసిన వైద్యుతాగ్ని కాంతి లాగా వృద్ధి పొందింది.

అభిషేకం పూర్తికాగానే స్నాతకులకు అతడు మెండుగా ధనం సమర్పించాడు. ఆ ధనంతో సమగ్రమైన దక్షిణలిచ్చి వాళ్ళు స్వయంగా యజ్ఞాలు పూర్తి చేసుకోగలిగినంత సంపన్ను లయ్యారు. ఆ స్నాతకులు ప్రీతచిత్తులై అతనికి ఆశీస్సు లిచ్చారు. పూర్వపుణ్యంచేత కల్గిన సామ్రాజ్యాదిఫలం వాళ్ళు ఆశీర్వదించక ముందే అతనికి లభించింది.

పట్టాభిషిక్తుడైన వెంటనే ఆ రాజు కారాగార బద్ధులను వదలి వేయమన్నాడు. వధార్హులను వధింపరాదనీ శాసించాడు. బరువులు మోసే ప్రాణులచే బరువులు మోయించరాదన్నాడు. గోవుల పాలు పితుకరాదనీ ఆదేశించాడు. చిలుకలు మొదలైన పంజర విహంగాలు కూడా అతని ఆజ్ఞతో విడుదల పొంది యథేచ్ఛగా ఎగురుతూ వెళ్లాయి.

తర్వాత అలంకరణకై అతడు భవన ప్రకోష్ఠంలో ఆస్తరణం కప్పిన నిర్మలమైన గజదంతాసనం అధిష్ఠించాడు. అలంకరణ నిపుణులు చేతులు



శుభ్రంగా కడుక్కొని ధూపంతో కేశాలను ఆరబెట్టి ఆ యా అలంకరణ సాధనలతో రాజును చక్కగా అలంకరించారు. అతని కురులు దువ్వి ముత్యాలసరంతో ఎత్తికట్టి పూదండలు చుట్టి ధమ్మిల్లంలో పద్మరాగమణి అమర్చారు. కస్తూరి వాసనలు విరజిమ్మే చందనంతో మైపూత పూశారు. ఆ పిమ్మట గోరోజనంతో పత్రరచన చేశారు. ఆభరణాలు ధరించి, పుష్పమాలా సమన్వితుడై, హంసచిహ్నం కల దుకూలం కట్టి రాజ్యలక్ష్మీ వధూవరుడయిన ఆ అతిథి మహారాజు కనులపండువుగా కన్పించాడు.

బంగారుపుటద్దంలో తన అందం చూచుకొంటున్న భూపాలుని ప్రతిబింబం సూర్యోదయ సమయంలో మేరుపర్వత శిఖరంలో ప్రతిఫలించిన కల్పవృక్ష ప్రతిబింబం లాగా విరాజిల్లింది. ఛత్రచామరాది రాజచిహ్నాలు చేపట్టిన పరిజనులు జయ జయ ధ్వానం చేస్తుండగా అతడు దేవేంద్రుని సుధర్మను పోలిన ఆస్థానానికి వెళ్ళాడు. అక్కడ మేలుకట్టుతోనూ, నరపతుల శిరోరత్నాలను ఒరసుకొన్న పాదపీఠంతోనూ విరాజిల్లే పైతృకమైన సింహాసనంపై ఆసీనుడయ్యాడు.

అత డాక్రమించిన 'శ్రీవత్స' మనే మంగళగృహం కౌస్తుభమణితో కూడిన శ్రీవత్సాంకమైన విష్ణు వక్షఃస్థలం లాగా శోభిల్లింది. కుమారుడై వుండి కూడా మహారాజపదవిని అధిష్ఠించిన ఆ నరపాలుడు రేఖాభావంనుండి హఠాత్తుగా సమగ్రస్థితి నందుకొన్న చంద్రునిలా భాసించాడు. ప్రసన్నమయిన ముఖశోభతో ఒప్పారి చిరునవ్వు లొలికించి మాటలాడుతున్న అతిథిని సేవకులు మూర్తీభవించిన విశ్వాసంగా భావించారు. దేవేంద్రునిలా శోభిల్లే ఆ మహీపాలుడు కల్పతరుల వంటి ధ్వజాలతో విలసిల్లే అయోధ్యానగరంలో ఐరావతాన్ని పోలిన గజాన్ని అధిష్ఠించి సంచరిస్తూ ఆ పట్టణాన్ని స్వర్గతుల్యం చేశాడు. ఒక్కడైన అతని శిరస్సుపై ఎత్తి పట్టుకోబడ్డ ధవళాతపత్రం లోకాని కంతటికీ కుశుని వియోగంతో కలిగిన తాపాన్ని పరిహరించింది. అగ్నినుండి ముందు పొగ, తర్వాత జ్వాలలు ఉదయిస్తాయి. సూర్యుడుదయయించిన

పిమ్మటే అతని కిరణాలు వ్యాపిస్తాయి. కాని, పై తేజస్సుల స్వభావాన్ని అతిక్రమించి ఆ రాజు ఏకకాలంలోనే శౌర్యాదిగుణాలతోపాటు ఉదయించాడు. రాత్రులు శరత్కాలంలో ప్రసన్నమైన నక్షత్రాలతో ధ్రువుణ్ణి అనుసరించినట్టు పురస్త్రీలు అనురక్తి నిండిన చూపులతో ఆ నరపతి ననుసరించారు. అయోధ్యలోని ప్రశస్తమైన ఆలయాలలో అతడు దేవతల నర్చించాడు. ఆ దేవతలు ప్రతిమల్లో నిలిచి అనుగ్రహార్హుడయిన అతణ్ణి అనుగ్రహించారు.

అభిషేక జలంతో తడిసిన మండపవేది తడి ఆరకముందే ఆ భూపాలుని దుస్సహమయిన ప్రతాపం సాగరతీరం వరకూ వ్యాపించింది. వసిష్ఠగురుని మంత్రబలమూ, ఆ ధానుష్కుని శరబలమూ – పరస్పరం కలిసినప్పుడు సాధింపరాని దేముంటుంది? నిత్యమూ ధర్మాధికారులతో చేరి ఆ రాజు పరిష్కరింపదగిన అర్థిప్రత్యర్థుల వ్యవహారాలను అలసత వీడి స్వయంగా పరిశీలించి పరిష్కరించేవాడు. ఆ పిమ్మట భృత్యుల విన్నపాలను సౌమనస్యంతో ఆలకించి వారి అభీష్టాలను నెరవేర్చేవాడు. శ్రావణమాసంలో నదులు వర్ధిల్లినట్లు అతని తంద్రికాలంలో ప్రజలు వర్ధిల్లారు. అతని కాలంలో భాద్రపదమాసంలోని నదుల్లా వారు ఇంకా ఎక్కువ అభివృద్ధి సాధించారు.

అతని మాట ఎన్నడూ అసత్యం కాలేదు. ఇచ్చిన వస్తువు నత డేనాడూ తిరిగి పుచ్చుకోలేదు. కాని శత్రువులను ముందు ఉన్మూలించి తర్వాత నిలబెట్టడం వల్ల "అతడు చేసిన దానికి తిరుగులేదు" అన్న వ్రతం మాత్రం భగ్నమైంది. యౌవనం, అందం, ఐశ్వర్యం – ఇందులో ఏ ఒక్కటి ఉన్నా గర్వం కల్గిస్తుంది. అతనిలో ఈ మూడూ కలిసే వున్నాయి. అయినా అతడు గర్వించలేదు.

నిత్యమూ ప్రజలు అతనిపై అనురక్తి కలవా రయ్యారు. ఈ రీతిగా అతడు రాజ్యానికి క్రొత్తవాడైనా దిట్టంగా వ్రేళ్ళూనిన వృక్షంలాగా స్థిరపడిపోయాడు. బాహ్యశత్రువులు నిత్య శత్రువులు కారు. పైగా వారు



దూరంగా వుంటారు. అందువల్ల అతడు నిత్యులూ, అంతరంగికులూ అయిన ఆరుగురు శత్రువులను (కామక్రోధాదులను) ముందు జయించాడు. సహజంగా చపల అయిన లక్ష్మి ప్రసన్నుడయిన ఆ రాజు చెంత ఒరపిడి రాయిమీద బంగారు రేఖ లాగా కదలకుండా ఉండిపోయింది.

శౌర్యంలేని వట్టి నీతి పిరికితనమే. నీతి లేని శౌర్యం క్రూరమృగ చేష్టే అవుతుంది. అంచేత అతడు నీతి శౌర్యాలు రెండింటితోనూ కార్యసాధనకై ఉపక్రమించాడు. అతడు చారు లనే వెలుగును నలదెసలా ప్రయోగించాడు. అందువల్ల మబ్బులు క్రమ్మని సూర్యునికి లాగా తన రాజ్యంలో అతనికి తెలియరాని విషయమంటూ ఏదీ లేకపోయింది. రాజులకు రేయుంబవళ్ళు ఏ సమయంలో ఏది కర్తవ్యమో దానినతడు ఏ మాత్రం లోటు లేకుండా నియతంగా అనుష్ఠించేవాడు. అతడు మంత్రులతో రోజూ మంతనం చేసేవాడు. సకల ద్వారాలూ నిరోధించడం వలన అతని మంతనాలు ఎప్పుడూ వెలికి పొక్కేవి కావు. ఆ రాజు శాత్రవుల పట్లా, తన వారిపట్లా ఒకరినొకరు తెలియకుండా గూఢచారులను ప్రయోగించేవాడు. అందువలన కాలానుగుణంగా నిద్రిస్తూవున్నా అత డెప్పుడూ జాగరూకుడుగానే వుండేవాడు.

అతడు ఎల్లవేళలా అరివర్గాలను నిరోధించేవాడే కాని వారిచేత నిరోధింపబడేవాడు కాదు. అయినా శత్రుదుర్భేద్యాలయిన మహాదుర్గాలలోనే అతడుండేవాడు. ఏనుగులను హతమార్చే సింహం సహజంగానే పర్వత గుహల్లో వుంటుంది కాని భయంతో కాదుగదా! ఆటంకరహితాలు, శుభప్రదాలు, నిత్యవిచారణీయాలూ అయిన అతని ప్రయత్నాలు వరిపైరుల్లాగా లోలోననే గూఢంగా ఫలించేవి. అతడు వృద్ధి పొందినా ఎప్పుడూ అపమార్గంలో ప్రవర్తించలేదు. లవణ సముద్రం ఎంత పొంగినా నదీ ముఖంగానే ప్రసరిస్తుంది కదా! ప్రజల్లో తన పట్ల ఏర్పడిన వైముఖ్యాన్ని వెనువెంటనే శమింపజేసే శక్తి అతనికి ఉండేది. అయినా వారిలో వైముఖ్యం

ఏర్పడకుండా అతడు ముందే జాగరూకత వహించేవాడు. అతడు శక్తి సంపన్నుడైనా తనకు లోబడిన వారిమీదనే దండయాత్ర చేసేవాడు గాని తన శక్తికి మించిన వారిపై దాడికి వెడలేవాడు కాడు. గాలి తనకు తోడుగా ఉన్నా దావాగ్ని నీటి మీద ప్రసరించదు గదా!

ఆ రాజు అర్థకామాలతో ధర్మాన్నీ, ధర్మంతో అర్థకామాలనూ బాధించలేదు. కామంతో అర్థాన్నీ, అర్థంతో కామాన్నీ బాధించలేదు. ఆ మూడింటి పట్లా సమానంగానే ప్రవర్తించాడు. మిత్రులు మరీ హీనులైతే ఉపకారం చేయలేరు. ఎక్కువగా వృద్ధి పొందితే అపకారం చేస్తారు. అంచేత అతిథి మహారాజు తన మిత్రులను మధ్యమస్థితిలోనే వుంచాడు. అతడు తన శక్తిని శత్రువుల బలంతో చక్కగా సరిపోల్చుకొని వారికంటే తాను బలవంతు డయినప్పుడే వారిపై కయ్యానికి కాలు ద్రవ్వేవాడు. బలహీను డయినప్పుడు ఊరకే వుండేవాడు.

తాను అర్థవంతు డైనప్పుడే జనులు తనను ఆశ్రయిస్తారన్న భావంతోనే అతడు ధనం ఆర్జించేవాడు. మేఘునిలో జల మున్నప్పుడే గదా చాతకాలు అతణ్ణి సేవించేది! ఆ నరపాలుడు ఇతర నరపతుల కార్యాలు చెడగొడుతూ తన పనులు సాధించేవాడు. శత్రువులను వారు తప్పు చేసినప్పుడు పైకొంటూ తన తప్పిదాలను వారికి తెలియనీకుండా కప్పిపుచ్చుకొనేవాడు. దండవంతు డయిన అతని సైన్యం తన దేహంలాగానే తండ్రిచే వృద్ధి పొందింది. అస్త్ర ప్రయోగంలో ఆరితేరింది. యుద్ధానికి సన్నద్ధంగా ఉంది. అట్టి సైన్యాన్ని అతడు తన శరీరాన్ని కాపాడినట్లే కాపాడేవాడు. పాము తలమీది రత్నాన్ని ఎవరూ లాగివేయలేరు. అట్లే ఆ నరపాలుని శక్తిత్రయాన్ని విరోధు లెవరూ ఆకర్షించలేకపోయారు. అయస్కాంతం ఇనుపముక్క నాకర్షించినట్లే అతడు విరోధుల శక్తిత్రయాన్ని తనవైపు లాక్కున్నాడు.

అతని యేలుబడిలో సార్థవాహులు మొదలయినవారు నదుల్లో నడబావుల్లో లాగానూ, అరణ్యాల్లో ఉద్యానాలలో లాగానూ, కొండలలో



సొంత యిండ్లలో లాగానూ స్వేచ్ఛగా చరించేవారు. విఘ్నాలనుండి తపస్సునూ, దొంగలనుండి సంపదనూ ఆ మహీపాలుడు రక్షించాడు, ఆశ్రమాలు తమ తపస్సులోనూ, వర్ణాలు తమ సంపదలోనూ అతనికి ఆరవ భాగాన్ని పన్నుగా సమకూర్చి పెట్టాయి. గనులనుండి రత్నాలనూ, పొలాలనుండి పంటనూ, అడవులనుండి గజాలనూ తన రక్షణకు తగిన వేతనంగా భూమి ఆ భూమీశునికి సమర్పించింది. షణ్ముఖుని వంటి పరాక్రమం కల ఆ జనపాలుడు షడ్గుణాలనూ, షడ్బలాలనూ సాధ్యవస్తువుల సిద్ధికై ఎలా వినియోగించాలో చక్కగా గ్రహించి అలా వినియోగించాడు.

ఈ రీతిగా నాలుగు విధాలైన రాజనీతిని సామాదిక్రమంలో అష్టాదశ తీర్థాల్లోనూ (మంత్రి, పురోహితుడు మొదలైన వారిలో) ప్రయోగిస్తూ అందుకు తగిన ఫలాన్ని అతడు అప్రతిహతంగా సాధించాడు. కూటయుద్ధ పద్ధతి తెలిసి కూడా ధర్మయుద్ధ పద్ధతినే అనుసరించే ఆ అతిథి మహారాజు విషయంలో వీరులను వరించే జయలక్ష్మి అభిసారికా వృత్తిని స్వీకరించింది. మదగంధంతోనే ఇతర గజాలను తరిమి వేయగల గంధగజానికి లాగానే ప్రతాపంతోనే శత్రువులను పరాజితులను చేసే ఆ భూపాలునికి రణమే దుర్లభమయింది. చంద్రుడూ, సముద్రుడూ వృద్ధి పొందిన తర్వాత క్షీణిస్తారు. ఆ రాజు చంద్ర సముద్రులతో సమానమైన వృద్ధినే పొందాడు. కాని, వారిలాగా క్షయం మాత్రం పొందలేదు. కటిక పేదరికంతో యాచకులైన విద్వాంసులు ఆ మహారాజు చెంతకు వెళ్ళి సముద్రాన్ని ఆశ్రయించిన మబ్బుల మాదిరిగా తామే యాచకుల కోర్కెలు తీర్చే దాత లయ్యారు.

స్తోత్రార్హమైన పనులు చేస్తూ కూడా అతడు తన స్తుతి విన్నప్పుడు సిగ్గుపడేవాడు. స్తోత్రకర్తలమీది వైముఖ్యం వల్ల అతని కీర్తి యితోఽధికంగా వ్యాపించింది. అతడు ఉదయించిన సూర్యునిలాగా దర్శనంతో పాపం నివారిస్తూ, తత్త్వార్థంతో తమస్సును తొలగిస్తూ ప్రజలను శాశ్వతంగా స్వాధీనం చేసుకొన్నాడు. చంద్రకిరణాలు పద్మంలో ప్రవేశించవు.

సూర్యకిరణాలు కలువలో ప్రసరించవు. గుణవంతుడైన ఆ నరపతి గుణాలు మాత్రం మిత్రులతో పాటు శత్రువుల హృదయాలలో కూడా ప్రవేశించాయి. అశ్వమేధ నిర్వహణకై జయాభిలాషతో అతడు దిగ్విజయం కావించాడు. అది శత్రువంచనతో కూడిన దైనప్పటికీ ధర్మబద్ధమే అయింది. ఈ విధంగా శాస్త్ర నిర్దిష్టమార్గం అనుసరిస్తూ తేజోऽభ్యుదయం పొంది దేవతలకు దేవేంద్రునిలాగా రాజుల కతడు రారాజయ్యాడు.

లోకరక్షణాది గుణాలలో పోలికను బట్టి ఆ రాజును ప్రజలు ఐదవ లోకపాలుడనీ, ఆరవ మహాభూతమనీ, ఎనిమిదవ కులపర్వతమనీ ప్రశంసించారు. దేవతలు ఇంద్రుని ఆజ్ఞను శిరసా వహించినట్లే శాసనపత్రాలలో నిర్దేశించిన అతిథి ఆజ్ఞను ఇతర రాజులు గొడుగులు తొలగిన తలలపై ధరించారు. అతడు అశ్వమేధయాగం నిర్వహించి ఋత్విజులను భూరిదక్షిణలతో చాలా గొప్పగా సన్మానించాడు. అందువల్ల కుబేరునిలాగా తాను గూడా ధనదుడనే ప్రసిద్ధి కెక్కాడు.

ఇంద్రుడు సమయవర్షాలను కురిపించాడు. యముడు రోగాలను నివారించాడు. వరుణుడు నావికుల సంచారానికై జలమార్గాలను అనుకూలం చేశాడు. అతని పూర్వుల మహిమను గుర్తించిన కుబేరుడు అతనికి కోశవృద్ధి కలిగించాడు. ఇలా అతిథి విషయంలో దిక్పాలకులు శరణాగతుల లాగా ప్రవర్తించారు.

* * *

# 18

శత్రునివారకుడైన అతిథి మహారాజు నిషధదేశాన్ని పాలించే అర్థపతి అనే భూపాలుని కుమార్తెను ధర్మపత్నిగా స్వీకరించాడు. అతని కొక కుమారుడు కలిగాడు. నిషధ పర్వతంతో సమానమైన బలం కల ఆ బాలునికి 'నిషధుడు' అని పేరు పెట్టారు. మంచి వర్షయోగంతో ఫలించిన పైరును చూచి జీవలోకం హర్షిస్తుంది. అలాగే మహాపరాక్రమంతో లోకరక్షణ దక్షుడుగా రూపొందిన ఆ పుత్రుని చూచి తండ్రి ఎంతో సంతోషించాడు. కుముద్వతీసుతుడు చాలాకాలం విషయసుఖాలు అనుభవించాడు. పిమ్మట కుమారునికి రాజ్యభారం అప్పగించాడు. కడపట నిర్మలమైన పుణ్యకర్మలతో సంపాదించుకొన్న స్వర్గలోకం చేరుకున్నాడు.

## నిషధాది మహారాజులు

పద్మనేత్రుడూ, సాగరధీరుడూ, అసహాయశూరుడూ, అర్గళదీర్ఘభుజుడూ అయిన నిషధుడు సాగరంవరకూ వ్యాపించివున్న భూవలయాన్ని ఏకాతపత్రంగా పరిపాలించాడు.

అతని తర్వాత అనలతేజుడైన నలుడనే అతని పుత్రుడు రాజ్యలక్ష్మికి నాథు డయ్యాడు. కసవుతో గూడిన నేలలను ఏనుగు మర్దించినట్లు అతడు శత్రుబలాలను మర్దించాడు. గంధర్వాదు లయిన ఖేచరులు అతని కీర్తిని గానం చేశారు.

ఆ నలుడు నభుడనే కుమారుని కన్నాడు. ఆ కుమారుడు ఆకాశంలాగా నీలమైన శరీరంతో ఒప్పారుతూ శ్రావణమాసంలాగా ప్రజలకు ప్రీతి కల్గించాడు. ధర్మప్రధానుడైన నలమహారాజు ఉత్తర కోసల రాజ్యాన్ని పుత్రుని కప్పగించి వార్ధకంలో మోక్షాపేక్షతో మృగాలతో నిండిన వనానికి వెళ్లాడు.

నభునికి పుండరీకుడనే తనయుడు జన్మించాడు. గజాలకు జయింపరాని పుండరీకమనే దిగ్గజం లాగా పుండరీకుడు రాజులకు

జయింపరానివా డయ్యాడు. తండ్రి స్వర్గస్థుడు కాగానే శ్వేతపద్మం చేపట్టిన లక్ష్మి పుండరీకాక్షుని చేరినట్లు రాజ్యలక్ష్మి పుండరీకుని చేరింది.

అమోఘధన్వుడయిన పుండరీకునికి క్షేమధన్వుడనే సుతుడు కలిగాడు. ప్రజలకు క్షేమం కలిగించడంలో దక్షుడూ, క్షమావంతుడూ అయిన క్షేమధన్వునికి సింహాసనం అప్పగించి పుండరీకుడు తపోనిష్ఠ దయ్యాడు.

ఆ క్షేమధన్వునికి యుద్ధంలో సేనలకు ముందు నడచేవాడూ, ఇంద్రాది దేవతలతో సమానుడూ అయిన దేవానీకుడనే కుమారుడు జన్మించాడు. అతని పేరు స్వర్గంలో గూడా ప్రసిద్ధి కెక్కింది. దేవానీకుడు చక్కని శుశ్రూషతో తండ్రికి సంతసం కల్గించి అతణ్ణి పుత్రవంతుణ్ణి చేశాడు. తాను కూడా తనపట్ల తండ్రి చూపిన వాత్సల్యంతో పితృమంతు డయ్యాడు. గుణనిధి, యాగకర్త అయిన క్షేమధన్వుడు తనతో సమానుడైన కుమారునిపై రాజ్యరక్షాభారం నిల్పి తాను యాగఫలం అనుభవించడానికై నాకలోకం చేరుకున్నాడు.

ఆ దేవానీకుని పుత్రుని పేరు అహీనగుడు. ఆ కుమారుడు సమర్థుడూ, మధురవచనుడూ కావడంవల్ల మిత్రులకు లాగానే శత్రువులకు సైతం ప్రియమైనవా డైనాడు. ఒకసారి బెదరిపోయిన జింకలను కూడా మధురనాదం వశీకరించుకొంటుంది కదా! మొక్కవోని భుజపరాక్రమం కల ఆ రాజసుతుడు హీనులతో చెలిమి చేయలేదు. కాబట్టి యౌవనంలో కూడా ఎలాంటి దుర్వ్యసనాలూ లేకుండా విలసిల్లి భూమినంతా పాలించాడు. పురుషులలోని తారతమ్యం చక్కగా గుర్తించిన అహీనగుడు తండ్రి తరువాత పుడమిపై అవతరించిన పురుషోత్తమునిలాగా ప్రకాశించాడు. చాతుర్యం కలిగి సడలని సామాది చతురుపాయాలతో చతుర్దిశలకూ పాలకుడైనాడు.

శత్రువిజేత అయిన ఆ భూపాలుడు పరలోకం చేరగానే ఔన్నత్యంతో పారియాత్ర శైలాన్ని జయించిన పారియాత్రుడనే అతని పుత్రుణ్ణి రాజ్యలక్ష్మి



సేవించింది. ఆ పారియాత్రునికి ఉదారచరిత్రుడూ, శిలాపట్టంలాగా విశాలమైన వక్షం కలవాడూ అయిన శిలుడనే సుతుడు ఉదయించాడు. అతడు శరప్రయోగంతో శత్రువులను చీల్చి చెండాడే వీరుడైనా, తన పరాక్రమ ప్రశంస వినడానికి సిగ్గుపడేవాడు. అనఘాత్ముడైన పారియాత్రుడు బుద్ధిసంపన్నుడైన శిలుణ్ణి యువరాజుగా చేసి ఆ పిమ్మటనే యథేచ్ఛగా సుఖా లనుభవించాడు. సుఖ ప్రతిబంధకమైన రాచరికం కారాగారం లాగా బంధకమే కదా! భోగాసక్తుడైన అతనితో చేరి సుఖిస్తున్న విలాసవతుల మీది మాత్సర్యంతో జర తనకు రతి సామర్థ్యం లేకున్నా వ్యర్థంగా అతణ్ణి వశీకరించుకున్నది.

ఆ శిలునికి గంభీరనాభి అయిన ఉన్నాభుడనే పుత్రుడు జన్మించాడు. విష్ణుసన్నిభుడైన ఆ రాకుమారుడు సమస్త రాజమండలానికీ ప్రధానుడైనాడు.

ఉన్నాభునికి ఇంద్ర సమతేజుడూ, యుద్ధభూమిలో వజ్రంలా ఘోషించేవాడూ అయిన వజ్రణాభు డనే తనయుడు ఉదయించాడు. అతడు వజ్రపు గనులనే భూషణాలుగా దాల్చిన వసుంధరకు పతి అయ్యాడు. ఆ వజ్రణాభుడు కొంతకాలానికి సుకృతఫలమైన స్వర్గం చేరుకొన్నాడు. శత్రుంజయుడైన శంఖణు డనే అతని కుమారుడు ఆ పిమ్మట సింహాసనం అధిష్ఠించాడు. గనులనుండి పొడమిన రత్నాలు కానుకలుగా సమర్పించి సాగర పర్యంతం విస్తరించిన పృథివి అతణ్ణి సేవించింది.

ఆ తరువాత సూర్యసమతేజుడూ, అశ్వినీ దేవతలను పోలిన అందగాడూ అయిన వ్యుషితాశ్వు డనే శంఖణుని కుమారుడు రాజ్యపదవి నధిష్ఠించాడు. అతని సైనికులూ, గుర్రాలూ సముద్రతీరాలలో నివేశనం పొందడం వలన అతడు సార్థకనాము డయ్యాడు. ఆ క్షితీశ్వరుడు విశ్వేశ్వరుణ్ణి సేవించి ఆ దేవుని అనుగ్రహంతో సమస్త విశ్వాన్నీ పాలించడానికి సమర్థుడూ, విశ్వసఖుడూ అయిన విశ్వసహుడనే పుత్రుణ్ణి కన్నాడు.

నీతి కుశలుడైన ఆ విశ్వసహునికి వెన్నుని అంశంతో హిరణ్యనాభు డనే ఆత్మజుడు ప్రభవించాడు. గాలితో కూడిన అగ్ని చెట్లకు సహింపరానిదైనట్లే హిరణ్యనాభ సమేతుడైన విశ్వసహుడు శాత్రవులకు సహింపరాని వాడయ్యాడు. పితౄణం తీర్చుకొని కృతకృత్యుడైన విశ్వసహుడు వార్ధకంలో మోక్షసుఖం అపేక్షించాడు. ఆజానుబాహుడైన హిరణ్యనాభుణ్ణి రాజ్యాభిషిక్తుణ్ణి చేసి తాను అడవికి వెళ్లాడు.

సూర్యవంశభవుడైన హిరణ్యనాభుడు ఉత్తర కోసల దేశానికి ప్రభువై సోమయాగం నిర్వహించాడు. అతనికి రెండవ సోమునిలాగా కనుల పండువైన కౌసల్యుడనే సుతుడు ఉదయించాడు. అతడు బ్రహ్మలోకం వరకూ తన కీర్తిని వ్యాపింపజేశాడు. అతని కుమారుని పేరు బ్రహ్మిష్ఠుడు. బ్రహ్మజ్ఞుడైన బ్రహ్మిష్ఠునకు రాజ్యాధికారం కట్టబెట్టి కౌసల్యుడు బ్రహ్మసాయుజ్యం పొందాడు.

కులశేఖరుడైన బ్రహ్మిష్ఠమహారాజు సత్సంతానవంతు డయ్యాడు. ప్రజలకు ఎట్టి బాధలూ లేకుండా రాజ్యపరిపాలన కావించాడు. అతని కాలంలో ప్రజలు కనులనుండి ఆనందబాష్పాలు రాలుస్తూ వర్ధిల్లారు. గురుసేవచే పాత్రత పొందినవాడూ, విష్ణుతుల్యాకారుడూ, పద్మపత్రనేత్రుడూ అయిన 'పుత్రుడు' అనే పుత్రుడు జన్మించడంవల్ల ఆ బ్రహ్మిష్ఠుడు పుత్రవంతులలో అగ్రగణ్యు డయ్యాడు. అతడు విషయాభిలాషను పరిత్యజించాడు. వంశప్రవర్తకుడైన కొడుకువల్ల వంశప్రతిష్ఠ కావించాడు. ఇంద్రునితో మైత్రిని కాంక్షించాడు. త్రిపుష్కరాలలో స్నానం చేస్తూ చివరికి దేవలోకానికి పోయి దేవత్వం పొందాడు.

పుత్రమహీపాలుని ధర్మపత్ని పుష్య నక్షత్రంతో కూడిన పున్నమనాడు పుష్యరాగ ద్యుతిని తలదన్నే కాంతిగల పుష్యుడనే సుతుణ్ణి ప్రసవించింది. రెండవ పుష్యనక్షత్రంలా విలసిల్లే ఆ రాకుమారుడు పొడమగానే ప్రజలు



సర్వతోముఖంగా వృద్ధి పొందారు. పిమ్మట మహాశయుడైన పుత్రభూపాలుడు సంసారవిరక్తు డయ్యాడు. కుమారునికి రాజ్యం అప్పగించాడు. బ్రహ్మజ్ఞుడైన జైమినిమునికి శిష్యత్వం వహించాడు. అతనినుండి యోగవిద్య నభ్యసించి జన్మరహిత స్థితిని పొందాడు.

పుష్యుని తర్వాత ధ్రువసమానుడైన అతని కుమారుడు ధ్రువసంధి అన్న పేరుతో ప్రసిద్ధి పొంది సింహాసనాధిష్ఠితు డయ్యాడు. గుణగరిష్ఠుడూ, సత్యసంధుడూ అయిన అతనితో అనుద్ధతులైన శత్రురాజులు సంధిని ధ్రువపరచుకొన్నారు. విశాలనేత్రుడూ, పురుషశ్రేష్ఠుడూ అయిన ఆ ధ్రువసంధి ఒకనాడు వేటకు వెళ్ళాడు. అక్కడ ఒక సింహం అతని ప్రాణాలు హరించింది. పాడ్యమినాటి చంద్రునివంటి సుదర్శనుడనే అతని కుమారుడు అప్పటి కింకా శైశవదశలోనే ఉండినాడు.

స్వర్గస్థుడైన భూపాలుని మంత్రులు ఆ క్లిష్టదశలో అనాథులై దీనులై వున్న ప్రజలను చూచారు. ఐకమత్యంతో రాజకులానికి ఒకే పట్టుగొమ్మగా వున్న ఆ సుదర్శనుణ్ణి యథావిధిగా సింహాసనంపై కూర్చోబెట్టారు. బాలచంద్రునితో కూడిన ఆకాశంలాగా, ఏకసింహశిశువుతో విలసిల్లే విపినం మాదిరిగానూ, ఒంటి తామరమొగ్గతో ఒప్పారే మడుగు మాదిరిగానూ ఆ బాలనరపాలునివలన రఘుకులం రాజిల్లింది. కిరీట ధారణం చేసిన ఆ బాలుణ్ణి లోకం అతని తండ్రితో సమానంగానే సంభావించింది. గున్న యేనుగంతటి చిన్న మేఘమైనా గాలి తోడైనప్పుడు దిక్కులకు ప్రాకడం కనిపిస్తుంది గదా! ఆరేండ్ల ప్రాయంవాడైన సుదర్శనుడు ఉజ్జ్వలవేషం ధరించి మావటి సాయంతో ఏనుగునెక్కాడు. అతడు రాజవీథిలో పోతుండగా ప్రభువు కాబట్టి, ప్రజ లతణ్ణి ధ్రువసంధిని గౌరవించినట్లే గౌరవించారు.

అతడు బాలుడు కాబట్టి, పైతృకమైన సింహాసనాన్ని నిండుగా ఆక్రమించలేకపోయాడు. కాని, తన శరీరాన్ని ఆవరించిన బంగారు కాంతిని బోలిన తేజస్సంపదతో ఆ ఆసనాన్ని సమగ్రంగా ఆక్రమించగలిగాడు. ఆ

సింహాసనంనుండి కొంచెం క్రిందికి వచ్చి స్వర్ణ పీఠాన్ని స్పృశింపకనే వ్రేలాడుతున్న లాక్షారసరంజితములైన అతని పాదాల ముందట నరపాలకు లందరూ తలలు వంచి మోకరిల్లారు. ఇంద్రనీలమణి చిన్నదైనా తేజఃప్రభావం వలన దానికి 'మహానీలం' అన్న పేరు నిరర్థకం కాలేదు గదా! అదే రీతిగా సుదర్శనుడు చిరుప్రాయం వాడైనా అతని పట్ల ప్రసిద్ధమైన 'మహారాజ' శబ్దం ప్రభావాతిశయంవలన సార్థకమే అయింది.

ఇరుప్రక్కలా చలించే చామరాల గాలికి తన ఉభయకపోలాలపై వెంద్రుకలు కదలుతుండగా, ఆ బాలుడు జారీ చేసిన ఆదేశాలు సాగర తీరాలలో సైతం అప్రతిహతంగా చెల్లుబాటయ్యాయి. కనక పట్టంతో శోభిల్లే లలాటంతో తిలకధారణం చేసి చిరునవ్వులు చిందించే ఆ రాకుమారుడు శత్రుస్త్రీల వదనాలమీది ఆ తిలకాన్నే రూపుమాపాడు.

దిరిసెన పూవుకంటే సుకుమారుడైన ఆ నృపకుమారుడు భూషణాలను గూడా ధరించేవాడు కాదు. అట్టికూడా మిక్కిలి బరువైన భూభారాన్ని మాత్రం అతడే సమర్థతతో భరించాడు. పలకపై అక్షరాలు పూర్తిగా వ్రాయడానికి నేర్చుకోకముందే అతడు విద్యావంతులైన పెద్దల సాయంతో దండనీతి వల్ల కలిగే ఫలాల నన్నింటినీ అనుభవించాడు. అతని వక్షస్థలంపై నివసించడానికి రమకు చోటు చాలలేదు. అందువల్ల అతడు ఎప్పుడు ప్రౌఢవయస్కు డవుతాడా అని యెదురు చూస్తూనే ఆమె బాలుడన్న సిగ్గుతో గాబోలు ఛత్రచ్ఛాయావ్యాజంతో అతణ్ణి కౌగిలించుకొన్నది.

ఆ సుదర్శనుని భుజం ఇంకా కాడిమానుతో సామ్యం పొందలేదు. అల్లెత్రాటి దెబ్బల మచ్చలు గూడా దానిపై ఏర్పడలేదు. అది కత్తిపిడిని కూడా స్పృశించలేదు. అయినా దానినుండి ధరణికి చక్కని రక్షణ సమకూరింది. కాలక్రమంలో అతని శరీరావయవాలతోపాటు జనప్రియమైన శౌర్యాదిగుణాలు గూడా అభివృద్ధి పొందాయి. ఆ సుదర్శనుడు పూర్వజన్మలోనే



సమగ్రంగా నేర్చుకొన్నవాటిని ఇప్పుడు స్మరిస్తున్నాడా అన్నట్లు గురువులకు క్లేశం కలిగించకనే త్రివర్గానికి మూలమైన మూడు విద్యలనూ, వాటితో పాటు తండ్రి పాలించిన ప్రజలనూ స్వాధీనం చేసుకొన్నాడు. ధనుర్విద్య నభ్యసించేటప్పుడు సుదర్శనుడు పూర్వశరీరాన్ని కొంచెం చాచి నిలబడ్డాడు. కేశపాశాన్ని ఎగగట్టుకొన్నాడు. ఎడమ మోకాలు ముడుచుకొని బాణం సంధించిన కార్ముకాన్ని కర్ణాంతంవరకూ లాగినవాడై శోభిల్లాడు.

అంతట సుదర్శనునిలో అనురాగబంధానికి పల్లవమైన యౌవనం పొటమరించింది. ఆ యౌవనం స్త్రీలకు నేత్రపేయమైన మధువుగా, మదనవృక్షం పూచిన పూవుగా, సర్వాంగాలకూ సహజమైన ఆభరణంగా, విలాసాల కెల్లా మొదటిదిగా విరాజిల్లింది. రాజసంతతి వర్ధిల్లా లన్న కోరికతో మంత్రులు దూతికలు చూపిన చిత్రపటాలలో కంటే అందగత్తెలైన రాజకన్యలను తీసుకువచ్చి అతనితో పరిణయం కావించారు. ఆ యువకు డంతకు మునుపే చేపట్టివున్న లక్ష్మికీ, వసుమతికీ ఈ రాజకన్యలు సవతు లయ్యారు.

* * *

## 19

విద్యావంతులలో అగ్రగణ్యుడూ, జితేంద్రియుడూ అయిన సుదర్శనుడు వార్ధకంలో అగ్నితేజుడైన తన కుమారుడు అగ్నివర్ణుణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. తాను తపస్సు చేయటానికై నైమిశారణ్యానికి వెళ్ళాడు. అక్కడ మునివృత్తిలో వుంటూ తీర్థజలాలతో విహారపు నడబావులనూ, నేల నావరించిన దర్భలతో హంస తూలికాతల్పాలనూ, పర్ణశాలతో సమున్నత సౌధాలనూ విస్మరించాడు. స్వర్గాది సుఖాలపై కోరిక లేకుండా తపస్సు కొనసాగించాడు.

## అగ్నివర్ణుని చరిత్ర

అగ్నివర్ణుడు తనకు సంక్రమించిన రాజ్యాన్ని ఏమాత్రం శ్రమ లేకుండా పరిపాలించాడు. ఎందుకంటే సుదర్శన మహారాజు శత్రువుల నందరినీ భుజబలంతో జయించాడు. మళ్ళీ చక్కదిద్దుకో నవసరం లేకుండా భూమి నతనికి అనుభవించడానికి మాత్రమే అప్పగించి వెళ్ళాడు.

అగ్నివర్ణుడు మహాకాముకుడు. కొన్ని సంవత్సరాలు స్వయంగానే కులోచితమైన ప్రజాపాలనకార్యం నిర్వర్తించాడు. ఆ పిమ్మట మంత్రులకు రాజ్యభారం అప్పగించి తన నవయౌవనాన్ని పూర్తిగా అంగనలకు అధీనం కావించాడు.

కామినీ సహచరుడైన ఆ కాముకుని సౌధాలలో సదా మృదంగ ధ్వనులు వినిపించేవి. దినదినానికీ పెచ్చుపెరిగిన సమృద్ధితో అక్కడ ఉత్సవ పరంపరలు కొనసాగేవి. విషయ సుఖాలతో ఒక్కక్షణం కూడా ఎడబాటు సహించలేని ఆ భూపాలుడు రేయింబవళ్ళు అంతఃపురంలోనే విహరిస్తూ వుండేవాడు. తన దర్శనం కోరి వచ్చే ప్రజలపట్ల బొత్తిగా ఉపేక్ష వహించేవాడు. ఎప్పుడైనా సచివుల మాట కాదనలేక వారికి దర్శనం ఇచ్చినా, ఆ దర్శనం గవాక్షరంధ్రం గుండా వెలికి జాచిన అతని చరణానికి మాత్రమే పరిమిత మయ్యేది. మృదువైన ఎఱ్ఱని గోళ్ళకాంతి కలిగి లేత యెండచే విప్పారిన తమ్మిపువ్వుతో దీటువచ్చే ఆ చరణానికే అనుచరులు ప్రణామాలు సంఘటించేవారు.



మన్మథ ప్రకోపం మితిమించిన ఆ రాజు ప్రౌఢయువతుల స్తనాల తాకిడితో చలించే కమలాలు కలవీ, వారి కటిస్థలాలను (సురత భవనాలను) తమ జలాల మాటున దాచేవీ అయిన డిగ్గియలలో జలక్రీడ లాడేవాడు. ఆ సమయంలో కంటి కాటుక, పెదవుల మీది రాగద్రవ్యం నీటివల్ల చెఱిగి పోగా సహజ కాంతులతో ఒప్పారిన వదనాలతో వనితలు అగ్నివరుణ్ణి మిక్కిలి ప్రలోభానికి గురి చేసేవారు.

కరిణీసమేతుడైన కరీంద్రుడు వికసించిన తామరకొలనిలో ప్రవేశించినట్లే నెచ్చెలులతో కూడి ఆ నృపుడు మధుగంధంతో మనోజ్ఞమైన పానభూమిలో ప్రవేశించేవాడు. అంగనలు ఏకాంతంలో ఎక్కువ మత్తుగొలిపే అగ్నివర్ణు డిచ్చిన ముఖాసవం అభిలషించేవారు. అతడు కూడా వకుళ వృక్షంలాగా ముగుద లిచ్చిన ముఖమద్యాన్ని అభిలాషతో ఆస్వాదించేవాడు.

మనోజ్ఞమైన ధ్వనిగల వీణ, లేదా మంజుభాషిణి అయిన మానిని అతని ఉత్సంగంతో ఎన్నడూ ఎడబాటు పొందలేదు. వాద్యకుశలుడైన ఆ క్షితిపాలుడు కంఠహారాలు, కంకణాలు కదలుతుండగా స్వయంగా వాద్యాలు వాయిస్తూ నర్తకీమణుల చిత్తాలను హరించేవాడు. ఆ పారవశ్యంతో తప్పటడుగులు వేసే నట్టువకత్తెలను నాట్యాచార్యుల చెంతనే సిగ్గు పడేటట్లు చేసేవాడు. నృత్యం పూర్తి కాగానే అలసటవల్ల చెమర్పుటచే తిలకం చెఱిగిపోయి అందం చిందే వారి వదనమందలి స్వేదబిందువులను ముఖమారుతంతో తొలగిస్తూ, అధరసుధ లాస్వాదిస్తూ ఇంద్ర కుబేరులను మించిన సౌభాగ్యంతో శోభిల్లేవాడు.

నిత్యమూ అతనికి నూతనమైన కామ్యవస్తువులపై ఆసక్తి ఉండేది. దూతిని పంపి కాని, స్వయంగా అభిసరించి కాని కలిసికొని తమపై వ్యామోహం తగ్గకుండా ఉండడానికి ప్రియురాండ్రు సమాగమ సమయాలలో అతనికి సగం తృప్తి మాత్రమే కలిగించేవారు. అతడు తన ప్రణయినులను తరచు వంచించేవాడు. అందుకై వారతణ్ణి చివురుకొనల బోలిన వ్రేళ్లతో

తర్జించేవారు. బొమముడితోడి చూపులతో చురచుర చూచేవారు. మాటిమాటికీ మొలనూళ్లతో బంధించేవారు.

తమవంతుకు వచ్చిన రాత్రులలో తనకై ఎదురుచూచే తరుణుల వెనుక దూతికి తెలిసేటట్లు ప్రచ్ఛన్నంగా ఉండి విరహార్తితో వారు "దూతీ! ప్రియుణ్ణి తీసుకువచ్చి నన్ను కాపాడవే!" అని చెప్పే దీనాలాపాలను ఆలకించేవాడు. రాణులతో కలిసివున్నప్పుడు అతనికి వారవనితలతో పొత్తు దుర్లభమయ్యేది. అపు డతడు ఔత్సుక్యంతో చెమట తడికి వ్రేళ్ళనుండి కుంచె జారిపోతుండగా వారి శరీరసౌందర్యాన్ని ఎలాగో శ్రమపడి చిత్రిస్తూ కాలం గడిపేవాడు. ప్రియానురాగంతో గర్వించిన సవతులపై మచ్చరంవల్లా, వలపు మేర మీరడంవల్లా రాణులు రోషం వీడి అతణ్ణి మదన మహోత్సవ మనే నెపంతో తీసుకుపోయి తమ కోరికలు నెరవేర్చుకొనేవారు. రాత్రి ఎక్కడో గడపి తెల్లవారగనే పరిభోగచిహ్నాలతో వచ్చి కనిపించగానే ప్రణయినులు అతని పట్ల కోపగించేవారు. ఆ ఖండితలకు అంజలి ఘటించి వారిని శమింపజేయబోతూ కూడా ఆ నట్టువకత్తెలమీది ప్రేమతో పొరపాటుచేసి వారికి ఎక్కువ తాపం కలిగించేవాడు.

అతడు కలలో సవతులను కలవరించగా కోపించిన సతులు 'అలా చేశా'వని అతనితో చెప్పకనే పాన్పుమీద వలువను కన్నీళ్లతో తడిపేవారు. చేతిగాజులు పగిలేటట్లు పెడమోముగా తిరిగి పవ్వళించి అతణ్ణి తిరస్కరించేవారు. దూతికలు దారి చూపగా పుష్పశయ్యలతో గూడిన లతాగృహాలకు వెళ్లి అంతఃపురకాంతలవలన భయంతో వణకుతూనే అతడు దాసీజనులతో రమించేవాడు. సవతుల పేరుతో తమ్ము పేర్కొన్నపుడు "నీ ప్రియురాలి పేరు మాకు వచ్చింది. ఆమె భాగ్యం కూడా మా మనస్సు ఆశిస్తున్నది. దాని ఆశకు మితి లేదు కదా!" అని వనితలు అతణ్ణి ఎత్తిపొడిచేవారు.



కుంకుమాది చూర్ణాల మరకలు, లత్తుకరసపు గుర్తులు గల్గి జారిపడిన పూలమాలలతోనూ, తెగిపడిన మొలనూళ్ళతోనూ ఆకులమైన అతని పాన్పు అటనుండి లేచిన ఆ విలాసవంతుని లీలారతప్రక్రియలను సూచించేది. అతడు స్వయంగా స్త్రీల చరణాలకు లత్తుక పూసేవాడు. అలా పూసేటప్పుడు బిగింపు వీడిన వలువలు గల వారి జఘనాలవైపే చూపు నిల్పడంవల్ల రాగరచన రమ్యంగా చేయగలిగేవాడు కాదు. చుంబనానికి పూనుకున్నప్పుడు పెదవి త్రిప్పడం, పోకముడి విడదీయటానికి ఉద్యమించినపుడు చేతు లడ్డుపెట్టడం – ఇలా అంతటా తన కోరికకు అంతరాయం ఏర్పడిన ఆ వధూరతం అగ్నివర్ణునికి కామోద్దీపకమే అయింది. వనితలు అద్దాలలో తమ భోగచిహ్నాలు చూచుకొంటున్నప్పుడు అతడు పరిహాస పూర్వకంగా వారి వెనుక నిలబడేవాడు. చిరునవ్వుతో మనోజ్ఞంగా కనిపించే అతని ప్రతిబింబాన్ని చూచి వారు సిగ్గుతో తల వంచుకునేవారు.

నిశావసాన వేళలో పాన్పునుండి లేచి తమ్ము వీడిపోతున్నప్పుడు తన మృదుబాహుపాశాన్ని తమ కంఠంపై తగిలించి, తమకాలి మునివ్రేళ్లపై తన కాళ్ళుమోపి తమ్ము చుంబించవలసినదిగా అతివ లతణ్ణి ప్రార్థించేవారు. ప్రియాపరిభోగ లక్షణాలతో కూడిన తన స్వరూపాన్ని అద్దంలో చూచుకున్నప్పుడు కలిగినంత ప్రీతి ఇంద్రుణ్ణి మించిన శోభ కల తన రాజవేషాన్ని అందులో చూచుకున్నప్పుడు కూడా అతనికి కలిగేది కాదు.

అతడు మిత్రకార్యం అన్న నెపంతో మరొకచోటికి పయనించటానికి ఉపక్రమించేవాడు. అపుడు ప్రియురాండ్రు "ఓ శఠుడా! నీ వెందుకిలా పారిపోతున్నావో మాకు తెలుసులే" అంటూ అతని కేశపాశాలు పట్టుకొని అడుగు సాగనీకుండా అడ్డుకునేవారు. ప్రగాఢమైన రతిశ్రమతో అలసిపోయిన అంగనలు ఆలింగన విశేషవ్యాజంతో ఘనస్తన విలుప్త చందనమైన అతని విశాల వక్షఃస్థలంపై విశ్రమించేవారు.

అతడు సంగమాపేక్షతో రాత్రివేళ తన కిష్టమైన ఇంటికి పయనిస్తూ ఉండేవాడు. గూఢచారిణు లయిన దూతికల ద్వారా ఆ సంగతి గ్రహించిన వనితలు అతని మార్గం అడ్డుకొని “ఓయి కాముకుడా! చీకటిలో ఎందుకిలా మమ్మల్ని మోసగిస్తావు” అని చెప్పి తమ ఇంటికి లాక్కువెళ్ళేవారు. చంద్రకిరణ స్పర్శను బోలిన వనితల స్పర్శచే సుఖిస్తూ, రాత్రివేళ మేల్కొని పగటిపూట నిద్రిస్తూ అగ్నివర్ణుడు కలువ మడుగుతో సామ్యం వహించాడు. పెదవులపై దంతాలతోనూ, తొడలపై నఖాలతోనూ క్షతినొంది కూడా వేణువీణలచే మరలా బాధకు గురి అయిన గాయనులు సాభిప్రాయమైన కుటిల వీక్షణాలతో అతని వైపు చూస్తూ అతనికి ప్రలోభం కలిగించేవారు.

ఆంగిక, సాత్త్విక, వాచిక రూపాలతో మూడురకాలైన అభినయాన్ని ఏకాంతంలో నర్తకీమణులకు నేర్పి మిత్రుల సమక్షంలో వారి నాట్య కౌశలాన్ని ప్రదర్శింపజేస్తూ అతడు ప్రయోగ నిపుణులైన నాట్యాచార్యులతో ఘర్షణ పడేవాడు. అతడు వర్షాకాలంలో కొండమల్లె మాలలు, ఏరుమద్దిదండలు మెడలో వేసుకొని, కడిమి పుప్పొడి మైపూతగా పూసుకొని మదించిన నెమళ్ళు మిక్కుటంగా కల కృత్రిమ శైలాలలో విలాసంగా విహరించేవాడు.

ప్రణయ కలహంతో పడకలో పరాఙ్ముఖంగా శయనించిన అబలలను అనునయించడాని కతడు త్వరపడేవాడు కాదు. ఉరుములకు భయపడి వారు తమకు తాముగా తనవైపు మళ్ళి తన్ను కౌగిలించుకోవడాన్ని అతడు కోరుకునేవాడు. శరద్రాత్రులలో లలితవనితలతో సహా చాందినీలు కట్టిన సౌధాలలో ప్రవేశించి మబ్బు విడిచిన వెన్నెలలో సురతశ్రమ తొలగించుకొనేవాడు. హంసలు అనే మొలనూలుతో కూడిన ఇసుకదిబ్బలు అనే నితంబాలను ప్రకటిస్తూ తన ప్రేయసీ విలాసాలను అనుకరిస్తున్న సరయూనదిని అతడు మేడల కిటికీలనుండి చూచేవాడు. పెళపెళలాడేవీ, అగురుధూపాల వాసన కలవీ, బంగరు మొలనూళ్లను వ్యక్తం చేసేవీ అయిన వనితల హేమంత వస్త్రాలు నీవిని బంధించడంలోనూ, విడిపించడంలోనూ



ఆసక్తుడైన అతణ్ణి ఎంతగానో ఆకర్షించేవి. గాలి దూరని లోపలి యిండ్లలోని నిశ్చలమైన దీపా లనే చూపులతో కూడిన శిశిరరాత్రులు సుఖావహాలై అతని సమస్త సురత ప్రక్రియలకూ సాక్షు లయ్యాయి. మలయానిలం వీవగానే చివురుతో గూడిన మామిడిపూతను చూచి చిగురుబోండ్లు పొలయలుకలు వీడి వియోగం సహించలేని అగ్నివర్ణుణ్ణి అనునయించేవారు.

పరిజనులు ఊపే ఊయలలో ఉవిదలను తన ఉత్సంగంపై కూర్చుండపెట్టుకొని అతడు ఊగేవాడు. త్రాడు వదలి పెట్టి ఊగుతూ పడిపోతామేమో నన్న భయంతో ఆ పడతులు తన్ను బాహులతలతో పెనవేసి పట్టుకోగా వారి స్వయంగ్రహాలింగన సౌఖ్యం అనుభవించేవాడు. పయోధరాలపై చందన చర్చ గావించుకొని, ముత్యాల ఆభరణాలు ధరించి, పిరుదులపై మణిమేఖలలు వ్రేలాడుతుండగా గ్రీష్మర్తువునకు తగిన అలంకరణలతో ప్రియురాండ్రు అతణ్ణి సేవించేవారు. అతడు మామిడి చివురుతోనూ, పాటల పుష్పాలతోనూ, కూడిన మద్యం పానం చేయడంవల్ల వసంతం గడచిపోవడంతో దుర్బలుడైన మదనుడు మళ్ళీ బలం పుంజుకొన్నాడు.

ఇలా కామప్రేరితుడై ఆ రాజు ఇతర కార్యాలన్నీ విడిచి ఇంద్రియసుఖాలు అనుభవించాడు. ప్రియురాండ్రు ధరించిన ఆ యా పుష్పాద్యలంకరణ చిహ్నాలను చూచినప్పుడుమాత్రమే ఆ యా ఋతువుల కాలమది యని గుర్తించేవాడు.

అత డారీతిగా వ్యసనాసక్తుడై వుండినాడు. అయినా ప్రభావాతిశయంవల్ల ఇతర నరపతు లతణ్ణి ఆక్రమించలేకపోయారు. కాని, దక్షుని శాపం చంద్రుణ్ణి పైకొన్నట్లు రతిరాగాతిశయం వల్ల కల్గిన క్షయరోగం మాత్రం అతణ్ణి క్రుంగదీసింది. వైద్యుల మాట పెడచెవిని బెట్టి అతడు దోషహేతువులని తెలిసికూడా స్త్రీ పానాది వ్యసనాలను వదలలేకపోయాడు. మధుర విషయాలను రుచి మరిగిన ఇంద్రియానీకాన్ని వాటినుండి మరల్చడం

తేలిక పనికాదు గదా! అతని ముఖం పాలిపోయింది. నగలు ధరించడానికి గూడా అతడు శక్తిలేనివాడయ్యాడు. పరిజనుల చేతి ఊతతో మాత్రమే నడవగలిగేవాడు. స్వరం హీనమయింది. ఇలా క్షయరోగంవల్ల అతనికి కల్గిన దురవస్థ కాముకావస్థనే పోలివుండింది.

రాజు క్షయరోగగ్రస్తు డయ్యేసరికి ఆ రఘుకులం కళామాత్రావశిష్టుడైన చంద్రునితో గూడిన ఆకసంలాగానూ, బురద మాత్రం మిగిలిన వేసవి మడుగురీతిగానూ, అల్పజ్వాలావశిష్టమైన దీపపాత్ర చందాననూ శోభా విహీన మయింది. ప్రజలు నృపుని వ్యసనాన్ని శంకించారు. మంత్రులు "ఇప్పుడు మనరాజు పుత్రప్రాప్తికొరకై జపాద్యనుష్ఠానాలు చేస్తున్నాడు" అని పలుసార్లు అతని రోగాన్ని కప్పి పుచ్చారు.

అగ్నివర్ణుడు అనేక పత్నులు గలవాడై కూడా పితౄణంనుండి తన్ను విడిపించగల సంతతిని చూడలేకపోయాడు. పెనుగాలి దీపాన్ని ఆర్పివేసినట్లే వైద్యుల ప్రయత్నాలను వమ్ము చేసిన రోగం అతని జీవితాన్ని హరించి వేసింది. అంతట అంత్యేష్టి విధానం తెలిసిన పురోహితునితో కూడి మంత్రులు గృహోద్యానంలోనే రోగశాంతివ్యాజంతో రహస్యంగా అతని శరీరాన్ని అగ్నికాహుతి గావించారు.

వెంటనే పౌరజానపదులలోని ప్రధానులను సమావేశపరచి అమాత్యులు గర్భవతి అయిన అగ్నివర్ణుని సహధర్మచారిణికి పట్టాభిషేకం చేశారు. నరేంద్రునికి కల్గిన ఆపదచే శోకిస్తున్న రాణియొక్క వెచ్చని కన్నీటిచే తపించిన గర్భం హేమకుంభాలనుండి జారిన చల్లని అభిషేక జలాలతో చల్లబడింది. ప్రసవసమయాన్ని ప్రతీక్షించే ప్రజల సంపదకై శ్రావణ మాసంలో విత్తిన విత్తనాలను ధరించే భూమిలాగా గర్భం ధరించిన రాణి కనకసింహాసనం అధిష్ఠించి ఆప్తులయిన వృద్ధామాత్యుల సాయంతో భర్తృరాజ్యాన్ని చక్కగా పాలించింది.

***రఘువంశం సమాప్తం***